ఓం

శ్రీ లక్ష్మీధర కవి విరచిత

# అద్వైత మకరన్దమ్



అనువాదకులు : స్వామి బ్రహ్మవిద్యానన్ద

శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వామి ఆశ్రమము – సోలాపూర్

ఓం శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీ లక్ష్మీధర కవి విరచిత

# అద్వైత మకరన్దమ్

అన్వయార్థసహిత టీకా




సోలాపూర్ మహారాష్ట్రము

అనువాదకులు

## స్వామి బ్రహ్మవిద్యానన్ద

Computerized by:-Swami Brahmavidynanda
&
Brahmachari Ajay Chaitanya

Shri Sadguru Maharshi Malayalaswami Ashram,
Plot No . 48, Kalavathi Nagar ( New Sunil Nagar ),
M.I.D.C . Solapur - Maharashtra
Pin:- 413006

వెల: రూ.360=00

**'అద్వైత మకరన్దము' గ్రంథమును పొందగోరువారు పై చిరునామకు తెలియజేయగలరు..లేదా ఈక్రింది ఫోన్ నంబరు తో సంప్రదించగలరు.**

Contact: 7843036503; 7017550722.

అద్వైత మకరన్దముయొక్క ఆవిష్కరణ దివసము:శోభకృత్ నామ సంవత్సర కార్తీక శుక్లపక్ష వైకుంఠ చతుర్దశి.

క్రీ.శ.౨౬- ౧౧-౨౦౨౩.

**మహారాజపోషకులు :—**

౧.బ్రహ్మచారి అజయ్ చైతన్య - సోలాపూర్.

౨.శ్రీ నాగరాల భాస్కర్, సులోచన, కర్నూలు.

౩.శ్రీ కట్రెడ్డి గాలిరెడ్డి, వసుంధర(గజ్జలకొండ,మార్కాపురం,ప్రకాశం జిల్లా)

౪.శ్రీ గూడూరు చంద్రశేఖర్, శివరంజని, కర్నూలు.

౫.శ్రీ పుల్లయ్య తొగర్చేటి, గోవిందపల్లె, నంద్యాల.

౬.శ్రీ బత్తులూరు చంద్రశేఖర్ రెడ్డి, ప్రభావతి, నంద్యాల.

౭.శ్రీనర్సింహులుగౌడ్ బైరగోని,అమ్మాపూర్,జనగామ(చేర్యాల).

౮.శ్రీమతి చెక్కిల్ల సుజాత, అమ్మాపూర్, జనగామ(చేర్యాల).

౯.శ్రీ చెక్కిల్ల భిక్షపతి, అమ్మాపూర్, జనగామ(చేర్యాల).

౧౦.శ్రీమతి పేట శీల w/o గజేంద్రరెడ్డి,శ్రీకాళహస్తి (Now in Mysore)

౧౧.శ్రీ వంగల రాజగోపాల్ రెడ్డి,M.తిమ్మాపురం,మహానంది,నంద్యాల.

# ముందు మాట

భవన్తి నమ్రా స్తరవ ఫలాగమై

ర్నవామ్బుభిర్దూరవిలమ్బినో ఘనా ।

అనుద్ధతా సత్పురుషా సమృద్ధిభిః

స్వభావ ఏవైష పరోపకారిణామ్ ॥ (అభిజ్ఞాన శాకుం.౫-౧౨)

వృక్షములు ఫలించినపుడు స్వాభావికముగానే క్రిందికి వంగియుండును. మేఘములు నూతనజలములను నింపుకొని వర్షించుటకు సన్ముఖమైనపుడు సహజముగానే భూమిపైకి వ్రేలాడబడును.అట్లే, పరోపకారస్వభావముగల సజ్జనులు స్వయముగానే వినయశీలురైయుందురు.ఎవరియొక్కప్రోద్బలముచేతనూ వారి సద్గుణములను ప్రదర్శించుటకై వినమ్రతనుచూపెట్టరు.వారు అత్యధిక సమృద్ధిని పొందినపుడు అత్యంత వినమ్రులై యుందురు.

అయం స్వభావః స్వత ఏవ యత్పర

శ్రమాపనోద ప్రవణం మహాత్మనామ్ ।

సుధాంశురేషః స్వయమర్కకర్కశ

ప్రభాభితప్తామవతి క్షితిం కిల ॥ (వివేకచూడామణిః ४०)

ఇతరులయొక్క శ్రమను నివారించుటయే,అనగా,అజ్ఞానజన్య తాపత్రయముచే పరితపించువారలయొక్క పరితాపమును

మహావాక్యోపదేశముద్వారా స్వస్వరూపానందమును గలుగజే యుటవలన పోగొట్టుటయే,మహాత్ములయొక్క సహజస్వభావ మై యుండును.. ఎట్లనగా,

యథా హిమాంశుః ఖలు తైజసోఽయం,

ప్రకాశకత్వాన్నహి తత్ప్రకాశమ్ । (స్వానుభవాదర్శః ౫౩)

ప్రకాశోష్ణత్వం తేజః స్వరూపమఖండం తత్తేజ ఆప్యచన్ద్రమ ణ్డలే ప్రతిఫలితం యదా భవతి తదా ఉపాధిః చంద్రమణ్డలముప హితస్య తేజసః ఉష్ణత్వమాచ్ఛాదయతి న ప్రకాశం యథాతథా॥

చంద్రుడు-సూర్యునియొక్క ప్రకరకిరణములలోని ఉష్ణత్వ ము మరియు ప్రకాశకత్వములలో,ఉష్ణతను తాను స్వయముగ గ్రహించి,కేవల ప్రకాశకత్వమును మాత్రము శీతలమగు అమృ తకిరణములద్వారా భూమిపైవెదజల్లి,సూర్యునియొక్క ప్రచండ కిరణములచే తపింపబడిన భూమిని రక్షించును.అట్లే, సంసార తాప తప్తులగు జనులనుద్ధరించుటయే మహాత్ములయొక్క సహ జస్వభావము.

ఆత్మీయులారా!అట్టి కోవకు చెందిన అవ్యాజకరుణాసము ద్రుడే శ్రీ లక్ష్మీధర కవీంద్రులవారు.అద్వైత వేదాంత సాహిత్యము లోయెట్లు శ్రీశంకరాచార్యులవారి దశశ్లోకి యెంత ప్రసిద్ధమున్న దో,అట్లే శ్రీ లక్ష్మీధర కవి విరచిత‘అద్వైత మకరందమ’ను గ్రంథ ముగూడ యుక్తి-సౌష్ఠవము మరియు శరీరలాఘవములో చాలా సుప్రసిద్ధమున్నది.ఇందులో అద్వైతతత్త్వమును కేవలము

ఇరువది యెనిమిది అనుష్టుప్ ఛందస్సు శ్లోకములలో, కడవలో కడలిని నింపినట్లు యినుమడింపజేసినాడు.ఈ గ్రంథములోని ఒక్కొక్క శ్లోకముయొక్క భావమును విస్తారముగా ఒక్కొక్క గ్రంథముగా వ్యాఖ్యానము చేయవచ్చును.ఈ విషయమును స్వ యముగా టీకాకారులగు శ్రీ స్వయంప్రకాశయతి ఈ గ్రంథము యొక్క చివరలో చెప్పినారు.అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదిం చుటకు యీ గ్రంథస్థ శ్లోకములను స్మరించుకొనుటకు అత్యంత ఉపయుక్తములు.

టీకాకారులైన శ్రీ స్వయంప్రకాశయతి,శ్రీకైవల్యానంద యో గీంద్రులవారికి శిష్యుడని తనయొక్క లేఖనముద్వారానే తెలియ బడుచున్నది. అట్లే శ్రీశుద్ధానందులవారికి, శివానందులవారికి, మరియు సచ్చిదానందుల వారికి శ్రద్ధాంజలిని ప్రదానము జేసి నాడు.శ్రీ స్వయంప్రకాశ యతీంద్రులు అద్వైత మకరందమునకు 'రసాభివ్యంజిక'యను టీకను వ్రాయడమే కాకుండా అన్యాన్య టీకలుగూడ రచించినారు.శ్రీ ఆదిశంకరులవారి 'హరి-స్తుతి'కి 'హరితత్వముక్తావళి'టీకను;'దక్షిణామూర్తిస్తోత్రము'నకు 'తత్త్వ సుధాటీక'ను మరియు'మనీషాపంచకము'నకుగూడ వ్యాఖ్యా నము చేసియున్నారు.'తత్త్వానుసంధానము' మరియు దానిపై 'అద్వైత చింతా కౌస్తుభము'అను టీకను వ్రాసిన శ్రీ మహాదేవా నంద సరస్వతీస్వాముల వారికి,స్వయముగా శ్రీ స్వయంప్రకాశ యతీంద్రులు గురువైయుండెను. స్వయంప్రకాశ యతియొక్క కాలము క్రీ.శ.౧౭౦౪ సుమారుగానుండెనని,ఆయన తిరుచినా

పల్లి జిల్లాలో కావేరీ నదీతీరమున నివసించువాడని తెలియు చున్నది.వీరియొక్క రచనలు స్పష్టార్థకములు, అశేషార్థకములు మరియు అనావశ్యక విస్తార శూన్యములై యున్నవి.అద్వైత సాహిత్యములో వీరియొక్క స్థానము చాలాఉత్కృష్టమైనది.అద్వైత దర్శనమునందు ఆసక్తి గలవారు, వీరియొక్క సాహిత్యమును అవశ్యముగా అవలోకించ దగును.

ఈగ్రంథమును మేము ప్రప్రథమమున 2001 లో అవలోకించినపుడు,మమ్ములను చాలా ప్రభావితులను చేసింది, మరియు మా విద్యార్థులతో కలిసి పరస్పరము చింతనముగూడ చేసినాము.ఈగ్రంథముయొక్క ఆడియోలు యూట్యూబ్ లో వేసియున్నాము.ఆ లింకును క్రింద ఇచ్చియున్నాము.

ఈ గ్రంథముపై శ్రీ రామానందులవారు మరియు శ్రీ సనాతన దేవులవారు ఇద్దరు కలిసి హిందీ భాషలో అనువదించారు.అట్లే, మరాఠీభాషలో శ్రీవినాయక నారాయణ జోశీ (సాఖరే మహారాజు)గారు చాలా విస్తృతంగా వ్యాఖ్యానము జేసినారు. ఈశ్వరాభిన్న శ్రీలక్ష్మీధర కవిగారియొక్క అనుగ్రహవిశిష్ట ప్రేరణయే కాబోలు,మాలో తెలుగు భాషలోగూడ అనువదించాలనే సంకల్పము 2001 లోనే పొడమినది. అది క్రమేణ ఈనాటికి సాకారమును దాల్చినది.ఎట్టి పరిస్థితుల్లోనైనా ఈ'అద్వైత మకరందము'ను అనువదించి తీరాలి-అను పట్టుదలతో మొన్నటికి మొన్న నెలరోజుల క్రితమే అనువాదమును ప్రారంభించి ఈశ్వరాభిన్న సద్గురుదేవుల అపార కరుణా కటాక్షముచే అనువాద

కార్యమును పూర్తిజేయగలిగినాము.

మాయొక్క అంతేవాసియగు 'బ్రహ్మచారి అజయ్ చైతన్య' దేవనాగరి లిపిలోనున్న యీగ్రంథమును యథాతథముగ తెలుగు లిపిలోకి మార్చి మాకు అందించినాడు.తదనంతరము మేము—శ్లోకము,అన్వయము, అన్వయార్థము మరియు సంస్కృత టీకకు తెలుగులో అనువాదముచేసినాము.స్వయముగా మేమే Computerizing (DTP) చేసి డాక్యుమెంట్స్ తయారుచేసి proofreading కోసము మాయొక్క మరొక అంతేవాసియగు చంద్రమోహన్ యేముల్ గారికి అందజేయగా, అతడు proof readingచేసి తిరిగి మాకిచ్చినమీదట, మేము మళ్ళీ సరిజేసి గ్రంథమును సిద్ధముజేసి ముద్రణజేయడమైనది.

టీకాకారులగు శ్రీ స్వయంప్రకాశయతి చెప్పినట్లుగా, ఈగ్రంథమునకు ఎంతో వ్యాఖ్యానముచేయాలని మాలో ప్రేరణ కలిగినప్పటికిని,విస్తారభయముచే కలముయొక్క గతిని నిరోధించవలసివచ్చింది.ఐననూ,దుస్సాహసముచే కించిదధికముగా గూడ చెప్పడమైనది.సాధకులు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులగు గురువుల సాన్నిధ్యంలో అధ్యయనముచేసి సవిస్తరముగా తెలిసికొని -స్వాత్మానుభూతిని పొంది తరించగలరని మనవి చేయుచున్నాము. కాని,స్వతంత్రముగా చదవడానికి ఎంతమాత్రము ప్రయత్నించవద్దనిగూడా పదేపదే విన్నవించుకుంటున్నాము.ఎందుకంటె ఈ విషయంలో శ్రుతి,స్మృతి,భాష్యవచనము మరియు విద్వదనుభవములు ప్రమాణములుగా నున్నవి.“తద్విజ్ఞానార్థం స గురుమే

వాభిగచ్ఛేత్ శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్''అను శ్రుతికి భాష్యమును రచిస్తూ శ్రీశంకర భగవత్పాదులు''శాస్త్రజ్ఞోఽపి స్వాతంత్ర్యేణ బ్రహ్మజ్ఞానాన్వేషణం న కుర్యాదిత్యేతద్గురుమేవేత్యవధారణ ఫలమ్''(ముండకోపనిషత్ 1-1-12 భాష్యము)అని బోధించినారు.మ-రొక నివేదనమేమనగా,వేదాంతము సుకరమగుట కొఱకు మొదట వేదాంత పారిభాషిక శబ్దార్థములు తెలిసికొనవలసి యుండును.వేదాన్తపారిభాషిక శబ్దార్థములు తెలియనందువల్లనే వేదాంతము కఠినమగుచున్నది.అందువలన,ప్రతి వేదాంతపారిభాషిక శబ్దార్థములు తెలియుటకు,వాటి లక్షణములు కంఠస్థముంచుకోవాలి.

ఉదాహరణకు:-అజ్ఞానము అని దేనికంటారు?దాని లక్షణమిట్లున్నది—''ఆవరణ విక్షేపశక్తులుగల అనాది అనిర్వచనీయ భావరూప పదార్థమునకు అజ్ఞానమందురు''-అని.ఈలక్షణములోగూడ 'ఆవరణ' మంటేయేమిటి? 'విక్షేప'మంటే యేమిటి? 'అనాది'అనగానేమి?'అనిర్వచనీయ'మంటే యేమి?'భావ'మంటేయేమి?'అభావమ'నగానేమి?ఇత్యాదిశబ్దములకుగూడ వాటి వాటి లక్షణములు గలవు.ఇట్లు ప్రతి పారిభాషిక శబ్దమునకు దాని దాని లక్షణముండును.వాటి పరిజ్ఞానమును లేనిచో వేదాంతము అవగతమగుట అత్యంత కష్టతరము.

ఆ లక్షణములు 'లక్షణావళి'యను చిన్న సంస్కృత గ్రంథమున గలవు. మరియు 'వేదాంత సంజ్ఞావళి'అను గ్రంథమున దెలియదగును.శ్రీ వ్యాసాశ్రమమువారు ముద్రించిన 'బాలబోధ

ము'లో ౧౨౦ పృష్ఠమునుండి ౧౩౪ పృష్ఠము వరకు సంక్షేప ముగా కొన్ని పారిభాషిక శబ్దములకు మాత్రము శ్రీపండిత పీతాంబర పురుషోత్తమ్ గారు లక్షణములు చెప్పినారు-చూడండి. లేదా శ్రీగురుముఖముద్వారా తెలిసికొనుట చాలా ఉత్తమము.

ఈగ్రంథముయొక్క అనువాద కార్యములో మాకు సహకరించిన మా విద్యార్థులకు మరియు గ్రంథముద్రణములో ఆర్థిక సహాయమునందజేసిన భక్తులకు,ఈశ్వరుడు భక్తి జ్ఞాన యోగ వైరాగ్యములను ప్రసాదించి రక్షించుగాక! గ్రంథ నిర్మాణ కార్యములో మాచేత భ్రమప్రమాదాది బుద్ధిగత దోషములు యేవైనా దొరలినచో సుహృదులగు విద్వత్పురుషులు క్షమించగలరు.

యదత్ర సౌష్టవం కించిత్తద్గురోరేవ మే నహి ।
యదత్రాసౌష్టవం కించిత్తన్మమైవ గురోర్నహి ॥

చరాచరసుఖాభిలాషియగు శ్రీసద్గురు మహర్షి మలయాళ సద్గురుదేవుల చరణారవిందములకు సమర్పిస్తూ విరమిస్తున్నాము.

శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వాములవారి
పాద పాంసువు
స్వామి బ్రహ్మవిద్యానన్ద



# అద్వైత మకరన్దమ్

## ఉపోద్ఘాతము

**"అద్వైతమకరన్దమ్"**అనబడు ప్రకరణాత్మక సద్గ్రంథము శ్రీ లక్ష్మీధర కవీంద్రులవారిచే రచింపబడినది.వీరు ఒరిస్సారాష్ట్రం లోని శ్రీజగన్నాథపురికి చెందినవారు.పదిహేడవశతాబ్దం ఉత్త రార్ధంలో వీరు జీవించియుండిరని వినికిడి.కూర్మాచల ప్రదే శమునకు ఆనాటి ప్రభువగు రాజా బాజబహాద్దూర్ యొక్క కొలువులో శ్రీలక్ష్మీధరకవీంద్రులవారు ఆస్థానకవిగా ఉండిరని తెలియబడుచున్నది.దానితో తృప్తిజెందని కవీంద్రులు **'త్రిపుర'**కు వెళ్ళి పోయినాడు.శ్రీఅనంతానంద రఘునాథ స్వాములవారు వీరి శ్రీగురుదేవులు. వారి పట్ల కవీంద్రులవారికి అకుంఠిత శ్రద్ధ గలదు.

శ్రీలక్ష్మీధరకవీంద్రులవారు మూడుగ్రంథములను రచించా రు.౧.కేవలము ఇరువదిఎనిమిది శ్లోకములతోకూడిన సూక్త నిబంధము,లఘుభూతమగు వేదాన్తపరగ్రంథము ఈ "అద్వైత మకరన్దమ్".౨.శ్రీమద్భాగవతమునకుటీకారూపంలో వ్రాయబ డినది"అమృతతరఙ్గిణి"అనబడుగ్రంథము.౩.భగవన్నామమహి మను వర్ణిస్తూ"భగవన్నామకౌముదీ"అనబడు కావ్యగ్రంథము శ్రీ కవీంద్రులవారిచే రచింపబడినది.

ఉపరోక్త గ్రంథత్రయములో "అద్వైతమకరన్దమ్" అనబడు

సకలోపనిషత్సారరూప,జీవబ్రహ్మైక్యప్రతిపాదక,అతిగంభీరమగు (మకరందమునుబోలు)మధురాతిమధురమైన గ్రంథరత్నమును మనమిప్పుడు విచారము(చింతనము)జేయబోతున్నాము.

అద్వితీయ పరబ్రహ్మతత్త్వమును బోధించే ఏదైన ఒక ప్ర కారము అనగా ఒక పద్ధతిని "ప్రక్రియ"అంటారు. ఇటువంటి ప్రక్రియలు ఉపనిషత్తుల్లో వందలకొలది ఉన్నాయి. ఉదాహర ణకు:—దేహత్రయవివేచన,అవస్థాత్రయవివేచన, పంచకోశవివే చనము,సచ్చిదానందవర్ణనము,ప్రపంచమిథ్యాత్వవర్ణనము,అవా చ్యసిద్ధాన్తవర్ణనము,సామాన్య—విశేషచైతన్యవిచారణ,అంతర్యా మి ప్రక్రియ, జగత్కారణ ప్రక్రియ, నేతినేతి ప్రక్రియ, ఆత్మనః స్వప్రకాశత్వవిచారణ,తత్త్వంపదార్థశోధన, అఖండార్థవిచారణ మరియు జీవన్ముక్తి-విదేహముక్తివిచారణ మొదలుకొని అనేక ప్రక్రియలున్నాయి.

దాదాపుగా ఇప్పుడుపేర్కొన్న ప్రక్రియలద్వారా సకలోపని షత్ప్రతిపాద్య వస్తువగు పరబ్రహ్మతత్త్వమును శ్రీలక్ష్మీధర కవీం ద్రులవారు "అద్వైతమకరన్దమ్" అనబడు సంగ్రహరూపమగు ప్రకరణాత్మక గ్రంథములో కుదించి మనకందించారు.ఈగ్రంథ పరిశీలనద్వారా శ్రీకవీంద్రులవారు ఎంతటి విద్వాంసులో మనకు ముమ్ముందు అవగతమౌతుంది.

శ్రీకవీంద్రులవారు ఈ సద్గ్రంథమునకు"అద్వైతమకరన్దమ్" అను అద్భుతమైన నామకరణ చేసారు."అద్వైతమేవమకరన్దం

అద్వైతమకరన్దమ్". అద్వితీయమగు ప్రత్యగభిన్న పరమాత్మయే మకరందము(మధువు,తేనె)లాంటిది.ఎట్లు సకలజీవులు తేనెను ఆస్వాదించుటకు ఇష్టపడతారో(అభిలషిస్తారో)అట్లే సకలప్రాణి కోట్లకు ఆత్మయే అనగా తన స్వరూపమే పరమప్రీతికి విషయ మున్నది. ఆ బ్రహ్మాస్తంబ పర్యంతమిది సుప్రసిద్ధం.

"తదేతత్ప్రేయఃపుత్రాత్ప్రేయోవిత్తాత్ప్రేయోఽన్యస్మాత్సర్వస్మాదన్తరత రం యదయమాత్మ".(బృ.ఉ.౧-౪-౮)

అర్థం:-ఆ యీ ఆత్మతత్త్వమే అన్నిటికంటే ప్రియమున్నది. పుత్రధనాదిపదార్థముల అపేక్షచేత ప్రాణము మరియు స్థూల, సూక్ష్మ శరీరరూప పిండసముదాయము అంతరము (అభ్యంత రము)అనగా ఆత్మకు సమీపవర్తియైయున్నది. మరియు ఈ సం ఘాతముకంటెకూడ ఆత్మ అంతరతరమున్నది. అనగా "స్వయం హి తత్"అది తానేయై యున్నాడు. లోకంలో పుత్రమిత్ర కళత్రా దులకంటె, ధనకనక వస్తు వాహనాదులకంటె ఆత్మయే అనగా తానే పరమ ప్రీతికి విషయము(న్నది)న్నాడు.

శ్లో ॥ విత్తాత్పుత్రః ప్రియః పుత్రాత్పిండః పిండాత్తథేంద్రియమ్।
ఇంద్రియాచ్చప్రియఃప్రాణఃప్రాణాదాత్మాప్రియఃపరః॥(వే.పం.౧౨-౬౦)

అర్థం:- పైన చెప్పబడినది.

ప్రత్యగభిన్న పరబ్రహ్మము పరమానంద స్వరూపమున్నది. అని అంటూ శ్రుతిమాత ఉద్ఘోషిస్తున్నది."విజ్ఞానమానన్దం బ్రహ్మ" (బృ.3-౯-3౪;మహోపనిషత్౨-౯),"ఆనన్దోబ్రహ్మేతివ్యజానాత్(తై.౨-

౬)"రసోవై సఃరసంహ్యేవాయంలబ్ధ్వాऽऽనన్దీ భవతి"(తై.౨-౭)
ఆనన్దరూపమమృతమ్(ముం.ఉ.౨-౨-౭)ఇత్యాది శ్రుతిప్రమాణము లచేప్రత్యగభిన్నపరబ్రహ్మము నిరతిశయానందరూపమని నిర్వి వాదముగా సిద్ధమగుచున్నది.కావున,"అద్వైతమేవమకరన్దమ్" అనగా అద్వైతపరబ్రహ్మమే పరమానందరూపము.ఎట్లు తేనె (మకరందము)సుఖహేతువున్నందున సర్వులచేకోరబడుచున్న దో(ఇచ్ఛకు విషయమగుచున్నదో),అట్లే ప్రత్యగభిన్న పరమాత్మ సకలజీవులచే పరమప్రీతికివిషయమున్నది.ఈగ్రంథముయొక్క నామధేయాంతర్గత"మకరన్దమ్"అను శబ్దతాత్పర్యమునుసంక్షే పముగా తెలిసికున్నాము.

ఇప్పుడు"అద్వైత"శబ్దార్థమును తెలుసుకొందము."న విద్య తే ద్వైతం-ద్విధాభావో యత్ర తదద్వైతమ్".లేదా"నాస్య ద్వితీ యంవస్త్వన్తరం విద్యత ఇత్యద్వైతమ్".అనగా-దేనికి సజాతీయ విజాతీయవస్త్వంతరము లేదోఅది అద్వితీయమని వ్యుత్పత్త్యర్థ ము.పరమాత్మ ఏకమే;అయినప్పటికిని అనాదికల్పిత మాయా యోగముచే ద్విధాభావమును పొందింది."ద్విధాఇతం-గతం ద్వీతం,తద్భావోద్వైతమ్".రెండవదిగా అనగా ప్రపంచాకారము గా అయ్యింది. ఏవిధంగా నిద్రాదోషముచే స్వప్నములో సాక్షి యే,కల్పిత స్వాప్నికపదార్థముల ఆకారమును పొందునో,అట్లే పరమాత్మ తనయొక్క మాయను తీసుకొని నానా నామరూ పాత్మక ద్వైతప్రపంచరూపంలో అయ్యి, గోచరించుచున్నది.

"తదైక్షతబహుస్యాంప్రజాయేయ"(ఛాం.ఉ.౬-౨-3)"తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్,తదనుప్రవిశ్యసచ్చత్యచ్చాభవత్"(తై.ఉ.౨-౬)," అనేనజీవేనాఽఽత్మనాఽనుప్రవిశ్యనామరూపేవ్యాకరవాణి" (ఛాం. ఉ.6-3-౭)మొదలగు ఉపనిషత్ప్రమాణములు పరమాత్మయే స్వయముగా స్వమాయాయోగముచేత జగద్రూపములో(ద్వైతరూపములో)అయినాడని చెబుతున్నాయి.కాని,"నతుపరమార్థతః". స్వరూపముచే శుద్ధం,ఏకం మరియు అద్వితీయమయ్యే ఉన్నాడు.

శ్లో॥ పరమాత్మాద్వయానన్దపూర్ణః పూర్వం స్వమాయయా ।
స్వయమేవ జగద్భూత్వా ప్రావిశజ్జీవరూపతః ॥(వే.పం.౧౦-౧)

అర్థము:-కల్పాదియందు అద్వితీయానందస్వరూపుడైనట్టి, పరిపూర్ణుడైనట్టి పరమాత్మయే స్వమాయచేత స్వయముగా జగద్రూపముగా అయ్యి, స్వరచిత జగత్తులో జీవరూపముచే తానే ప్రవేశించెను.

ఇట్లు,అవివేకిపురుషులయొక్క మిథ్యానుభవమును అనువాదముచేసిన పిమ్మట"అధ్యారోపాపవాదన్యాయము"చేఆరోపిత ప్రపంచమును నిషేధిస్తూ ఉత్తరత్ర అపవాదము చేయబడినది."విచారేణవినష్టాయాం మాయాయాంశిష్యతేస్వయమ్" ॥ (వే.పం.౧౦-3)

అర్థం:-విచారజనితజ్ఞానముచేమాయనశించగా తత్కార్యమగు ద్వైతప్రపంచము నివర్తింపబడగా స్వయం అనగా అద్వ

యానందపరిపూర్ణపర బ్రహ్మమే అవశిష్టమైఉంటుంది. కావు న,"మాయామాత్రమిదంద్వైతమద్వైతంపరమార్థతః":|(మాం.కా.ఆ. ప్ర.౧౭)

అర్థం:-రజ్జువునందుభ్రాంతిదృష్టిచేత కల్పింపబడినసర్పము ఎట్లు వాస్తవముగా లేదో, అట్లే బ్రహ్మమునందు అవివేకులచే కల్పితమగు ఈప్రతీయమానమగు ద్వైతప్రపంచము పరమార్థ ముచే లేనిదేయగును.అద్వైతపరమాత్మయే పరమార్థము(సత్య ము).అందుకే,శ్రీసురేశ్వరాచార్యులవారు ఉపరోక్తవిషయమును తమ వార్తికములో స్పష్టము చేయుచున్నారు.

శ్లో|| ద్విధేతం ద్వీతమిత్యాహుస్తద్భావో ద్వైతముచ్యతే ।
తన్నిషేధేనచాద్వైతంప్రత్యగ్వస్త్వభిధీయతే॥ (బృ.వా.౪-౩-౧౯౬)

అర్థం:-రెండుప్రకారములుగా అయిన వస్తువునకు ద్వీత మందురు. ఆద్విధాభావమునకే ద్వైతమంటారు"ద్విధా ఇతం-గతం ద్వీతం(ద్విప్రకారమ్)".పారమార్థిక నిత్యవస్తువగు అద్వి తీయ పరబ్రహ్మమే,జగదీశజీవభేదముచే చిదచిద్రూపముగా ద్వైధీభావమును పొందినది.కాని, సద్గురు సచ్ఛాస్త్రములనాశ్ర యించి సమ్యగ్విచారముచేసినచో,తజ్జనితచరమ సాక్షాత్కార రూప అప్రతిబద్ధ దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానముచే జగదీశజీవభేద భిన్న జడాజడరూప ద్వైతము నిషేధింప(బాధింప)బడగా అద్వి తీయ ప్రత్యగభిన్న పరమాత్మయే శేషించును.

"న విద్యతే ద్వైతం-ద్విధాభావో యత్ర తదద్వైతమ్"అను వ్యుత్పత్త్యర్థమును యింతవరకు తెలిసికుంటూ వచ్చాము.ఇప్పు

డు,"లక్షణప్రమాణాభ్యాంవస్తుసిద్ధి:" అను నియమానుసారము "అద్వైత"శబ్దముయొక్క లక్షణ,ప్రమాణములనుగూర్చియథామతిగా విచారించెదము.

"**మానాధీనామేయసిద్ధిః మానసిద్ధిశ్చ లక్షణాత్ । తచ్చాధ్యక్షాది మానేషు గీర్వాణైరపి దుర్ఘణమ్॥**"(చిత్సుఖీ ౨-౧౮) అను వచనానుసారము- మొదలు—

అద్వైత శ్రుతి ప్రమాణములను కొన్నింటిని అవలోకించెదము."ఏకమేవాద్వితీయం బ్రహ్మ"(ఛాం.౬-౨-౧) ఏకం,ఏవ మరియు అద్వితీయం అను యీ మూడుశబ్దములయొక్క ప్రయోగప్రయోజనము ఇలా ఉంది."ఏకమిత్యనేన స్వగతభేద శూన్యం"ఏకం అనుపదము స్వగతభేదరాహిత్యమును; "ఏవేత్యనేన సజాతీయభేదశూన్యం"ఏవ అను పదము సజాతీయ భేదరాహిత్యమును;"అద్వితీయమిత్యనేన విజాతీయ భేదశూన్యం పరిగృహ్యాతే"అద్వితీయమనుపదము విజాతీయ భేదమును నిషేధించుచున్నదని తెలియవలెను.

శ్లో॥ వృక్షస్య స్వగతోభేదః పత్రపుష్పఫలాదిభిః ।

వృక్షాన్తరాత్సజాతీయోవిజాతీయశ్శిలాదితః॥(వే.పం.౨-౨౦)

అర్థము:--స్వగతాదిభేదములు అనాత్మవస్తువులలో ఈ ప్రకారంగా ఉంటాయి. ౧.వృక్షములో శాఖలు,పత్రములు,పుష్పములు మరియు ఫలములు మొదలగు వాటిలో పరస్పరభేదమున్నది.వృక్షము ఒకటే అయినప్పటికిని దాని అవయవము

లగు పత్రపుష్పఫలాదులందుగల భేదమును స్వగతభేదమం దురు.(స్వ=వృక్షము;గత=వృక్షగత=వృక్షములోఉన్న; అవయవ భేదమునకు స్వగతభేదమందురు.)లేదా తనలోని పదార్థము లతో తనకుగలుగుభేదము స్వగతభేదమనబడును.౨.ఒక వృ క్షమునకు మరొక వృక్షమునకు వృక్షత్వజాతి ఏకమే అయిన ప్పటికిని రెంటిలో వ్యక్తిభేదమున్నది.అనగా ఆవృక్షమంటే ఈ వృక్షముగాదు.ఈవృక్షమంటే ఆవృక్షంగాదు.దీనికి సజాతీయ భేదమందురు.సజాతి అనగా సమానజాతి(ఒకేజాతి)గల అనేక వస్తువులలోగలభేదము—సజాతీయభేదమనబడును.౩.వృక్షము నకు మరియు వృక్షేతరములకు అనగా శిలాదులకు(వృక్షత్వ ము మరియు శిలాత్వాది)జాతిభేదముండి వ్యక్తిభేదము గూడ ఉన్నందున,వీటిలో విజాతీయ(విరుద్ధజాతీయ) భేదమున్నది.

శ్లో ॥ తథా సద్వస్తునో భేదత్రయం ప్రాప్తం నివార్యతే ।
ఐక్యావధారణద్వైతప్రతిషేధైస్త్రిభిఃక్రమాత్ ॥(వే.పం.౨-౨౧)

అర్థము:-అనాత్మ వస్తువులలో భేదత్రయమును ప్రదర్శిం పజేసి, సద్వస్తువగు పరమాత్మకుగూడ వస్తుత్వసామాన్యము చే ఆ భేదత్రయము ప్రసక్తమగునను శంకను నివారించుటకు పదత్రయప్రయోగముచే భేదత్రయమును నిషేధిస్తూ"ఏకమేవా ద్వితీయంబ్రహ్మ"(ఛాం.ఉ.6-2-1)అంటూప్రవృత్తమైనది—శ్రుతిమా త. ఏకం, ఏవ మరియు అద్వితీయం అను మూడుపదము లు క్రమంగా ఐక్య,అవధారణ మరియు ద్వైతప్రతిషేధములకు

అభిదాయకములు(వాచకములు)అగుచున్నవి.ఎట్లనగా—ఐక్యం =సత్పదార్థము"ఒక్కటి"అని చెప్తూ శ్రుతిలోని"ఏకం"అను పద ము బ్రహ్మమునందు అవయవములులేవని స్వగతభేదమును నివారించుచున్నది. అవధారణ=సత్పదార్థము"ఒక్కటియే" అని నిశ్చయమును భోధిస్తూ"ఏవ"పదము బ్రహ్మమునకు(సమాన మైన)సజాతీయ రెండవవస్తువు లేదని సజాతీయ భేదమును నిరాకరించుచున్నది.ద్వైతప్రతిషేదః="సత్పదార్థముకంటేభిన్నమై నది లేదు"అనంటూ బ్రహ్మమునకు భిన్నజాతీయమైన రెండవ వస్తువు ఉండదని నిరూపిస్తూ "అద్వితీయం" అను పదము విజాతీయ భేదమును నిషేధించుచున్నది.

అట్లే,"సలిలఏకోద్రష్టాఽద్వైతః"(బృ.౪-౩-౩౨)అను శ్రుతిగూడ పరమాత్మ"అద్వైతము"అని ప్రతిపాదించుచున్నది. "సలిల"ము అనగా పరబ్రహ్మము జలమువలె నిర్మలము(స్వచ్ఛము, శుద్ధ ము)అని అర్థము."అస్నావిరం శుద్ధమపాపవిద్ధమ్" (ఈశావాస్య. ఉ.౮)స్వాతిరిక్తకల్మషాభావాత్"=ఆత్మకంటేఅన్యమగు అవిద్యా, తత్కార్యమగు ప్రపంచము కల్పితమై, పరమార్థముచే సత్యం- తాభావమున్నందున మరియుదానితోఏమాత్రముగూడ సంస్ప ర్శలేనిదై(అసంగమై)యున్నందున"ఆత్మ"నిర్మలము.పరమాత్మకు సమానమైన అన్యవస్తువులేదని"ఏకో"అను పదము చెప్తుంది. స్వాజ్ఞదృష్టిపరికల్పిత ద్వైతముయొక్క భావాభావాలను ప్రకా శించుచున్నందున ద్రష్టృత్వమును అనువాదముచేసి చెప్తుం ది. "ద్రష్టా" అను పదము.

"అధ్యస్తమునకుద్రష్టయేఅధిష్ఠానముంటుంది"-అను నియమానుసారము ద్రష్టయైన ఆత్మకంటె వ్యతిరిక్తమగు అజ్ఞానము,తత్కార్యమగు ప్రపంచము అధిష్ఠానజ్ఞానానంతరము బాధితమగుచున్నందున మిథ్యయే.మిథ్యాభూతమగు(అధ్యస్తమగు) పదార్థములకుఅధిష్ఠానాతిరిక్తసత్త(స్వతంత్రసత్త=అస్తిత్వం)ఉండదు గనుక ద్రష్టయగు పరమాత్మకంటే అన్యమగు విజాతీయ వస్తువులను నిషేధిస్తుంది"అద్వైతః"అను పదము.

"సలిలఏకోద్రష్టాఽద్వైతః"అను యీ శ్రుతి సారాంశమిట్లున్నది:-సుషుప్తిఅవస్థలోనిఆత్మస్వరూపమును వర్ణిస్తున్నది-శ్రుతిమాత.కావున"సలిలఏకోఽద్రష్టా"అని పదచ్ఛేదముచేయుటలో అనుపపత్తియేమియులేదు.ఆత్మవ్యతిరిక్త అవిద్య మరియు అవిద్యా కల్పితప్రపంచమే ఆత్మకు మలము.సుషుప్తిలోఅవిద్య ఉపశాంతిని పొందినందున ఆత్మనిర్మలమైయున్నది.అక్కడ దృశ్యజాతము అదర్శనమైపోవుటవలన దృశ్యసాపేక్ష ద్రష్టృత్వము గూడలేదు.ఆత్మ కేవలము దృఙ్మాత్రమై,ఏకమే అయి ఉన్నది. సుషుప్తిలో ఆత్మ సలిలము=నిర్మలము అని చెప్పబడినందున, ఆత్మకు విజాతీయములగు అవిద్య తత్కార్యరూప జగత్తును నిషేధిస్తూ విజాతీయ భేదరాహిత్యమును సూచించడమైనది. మరియు అచ్చట ఆత్మ నిర్ధర్మకమై యున్నందున స్వగతభేదము నిషేధింపబడినది."ఏక"అను పదప్రయోగముచే నానాత్మవాదమును నిరాకరిస్తూ సజాతీయ భేదశూన్యమును తెలుపడమైనది.ఈప్రకారంగా సజాతీయ,స్వగత,విజాతీయ భేదరా

హిత్యమునే"అద్వైతః"అను పదము దృఢపరుచుచున్నది. కావున, ప్రత్యగభిన్న పరమాత్మయే "అద్వైతము".

అట్లే,"ప్రపఞ్చోపశమం శాన్తం శివమద్వైతమ్" (మాం.౭) "అద్వైతమనిర్వాచ్యంబ్రహ్మ","అద్వైతపరమానందో విభుర్నిత్యో నిష్కలఙ్క నిర్వికల్పో నిరఞ్జనోనిరాఖ్యాతః శుద్ధోదేవ ఏకో నారాయణో న ద్వితీయోఽస్తి కశ్చిదితి"(త్రి.మ.నా.౧అధ్యా),"అద్వితీయమనాద్యన్తమ్"(అన్నపూర్ణ.౫-౬౪)"అద్వితీయ ఓతశ్చప్రోతశ్చ"(నృసింహో.౮-౧)"అద్వైతే బోధితేతత్త్వే వాసనా వినివర్తతే"(వరా.౨-౭౦)"అద్వయానన్దమాత్రోఽహంచిద్ఘ నైకరసోఽస్మ్యహమ్"(తే.బిం.౬-౬౫)ఇత్యాద్యనేక శ్రుతులు పరమాత్మను అద్వితీయ స్వరూపముగా వర్ణించుచున్నవి.

కావున,"మానాధీనా మేయసిద్ధిః" అను వచనానుసారము ఉపరోక్త అద్వైత ప్రతిపాదక శ్రుతిప్రమాణములను విచారించగా పరమాత్మ "అద్వైతస్వరూపము" అని సిద్ధమైనది. మరియు "విజాతీయ సజాతీయ స్వగతభేదశూన్యత్వం అద్వైతత్వమ్" అని అద్వైతము యొక్క "లక్షణము" గూడ అర్థతః నిష్పన్నమైనది.

౧."సర్వస్యప్రపఞ్చస్య బ్రహ్మవ్యతిరిక్తస్య కల్పితత్వేన మిథ్యాత్వాద్విజాతీయ భేదశూన్యతా" "వాచారమ్భణం వికారో నామ ధేయంమృత్తికేత్యేవసత్యం"(ఛాం.౬-౧-౪) "తదనన్యత్వమారమ్భణ శబ్దాదిభ్యః"(బ్ర.సూ.౨-౧-౧౪)ఇత్యాది శ్రుతి సూత్రాభ్యాం కార్యస్య కారణాదవ్యతిరేకాత్సర్వస్య కల్పితత్వమ్.

బ్రహ్మమునందు విజాతీయభేదము సంభవించదు— ఎందు కనగా! బ్రహ్మ భిన్నమగునొక సత్య వస్తువుండినచో విజాతీయ భేదము సిద్ధించును.కాని,బ్రహ్మభిన్న (మరొక) సద్వస్తువనునది లేదు.అవిద్యాసహిత సంపూర్ణకార్యప్రపంచము బ్రహ్మరూప అధి ష్ఠానమునందు కల్పితము కావున"మిథ్యా"అయివున్నది. పైను దహరించిన ఛాందోగ్య(౬-౧-౪) మరియు బ్రహ్మసూత్రము(౨-౧-౧౪) లు-బ్రహ్మమునందు విజాతీయ భేదము లేదనుటలో ప్రమాణములు.

**శ్లో ॥ సతోర్హి భేదః పరికల్పనీయో**

**నాఽసత్సతోర్వాస్తవ భిన్నతా స్యాత్।**

**గఙ్గోదకస్యాఽథ మృగోదకస్య**

**భేదః కథం వాస్తవతాముపైతి॥**(స్వానుభవాదర్శః ౧౩౮)

అర్థం:- రెండు సద్వస్తువుల యందే భేదము సంభవిస్తుంది. కాని, ఒక సద్వస్తువునకు మరొక అసద్వస్తువునకు భేదము ఎలా సంభవించును? సత్యమగు గంగా జలమునకు మరియు మిథ్యాయగు మృగజలమునకు వాస్తవభేదము ఎట్లు సంభవిం చును? ఘటిల్లదని భావము.

"కార్యకారణయోరనన్యత్వమ్" అను నియమానుసారము

ఈపరిదృశ్యమాన నామరూపాత్మక ప్రపంచము (కార్యము), "యతోవా ఇమాని భూతాని జాయన్తే"(తైత్తరీయ౩-౧)మరియు "జన్మాద్యస్య యతః" బ్ర.సూ.౧-౧-౨) ఇత్యాది శ్రుతి సూత్ర ప్రసిద్ధ

జగత్కారణమగు బ్రహ్మముకంటె-జగత్తు పృథక్సత్తలేనిదై, కల్పితమైయున్నది.కల్పితవస్తువు అధిష్ఠానస్వరూపమయ్యే ఉండును. కావున, అనాద్యనిర్వచనీయ అవిద్యగూడ బ్రహ్మ వ్యతిరిక్తముగ పరమార్థతః సిద్ధించుట లేదు. మరియు "ఏకమేవాఽద్వితీయం "(ఛాం.౬-౨-౧)"నేహనానాస్తికించన"(బృ.౪-౪-౧౯)ఇత్యాదిశ్రుతులు బ్రహ్మభిన్న సర్వమును నిషేధించుచున్నందున బ్రహ్మము విజాతీయ భేదరహితమని నిర్వివాదముగా సిద్ధమైనది.

౨."తత్త్వమసి"(ఛాం.౬-౮-౭;౬-౯-౪)"అహంబ్రహ్మాస్మి"(బృ. ౧-౪-౧౦)"క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి"(గీత.౧౩-౩)ఇత్యాదిశ్రుతిస్మృతిభిర్జీవపరమాత్మనోరత్యంతైక్యప్రతిపాదనేనచేతనాన్తరస్యాసమ్భవా జ్జీవభావస్యమిథ్యాత్వేనాఽజ్ఞాన కల్పితత్వాద్బ్రహ్మణః సజాతీయ భేదశూన్యత్వమ్.

జీవచైతన్యము,ఈశ్వరచైతన్యము మరియు బ్రహ్మచైతన్యము అను చైతన్యసాజాత్యమున్నందున బ్రహ్మమునందు సజాతీయ భేదమున్నది గదా! అను నీ శంక సముచితముగాదు. ఎందుకనగా!రెండు వస్తువులుండిననే గదా భేదము చెప్పటకు వీలుపడును.కాని,"తత్త్వమసి" "అహంబ్రహ్మాస్మి", "అయమాత్మా బ్రహ్మ"(మాం.౨)మరియు"క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి"ఇత్యాది శ్రుతిస్మృతులు జీవబ్రహ్మలకు అత్యంత ఐక్యమును ప్రతిపాదించుచున్నవి.ఒకేవస్తువునందు భేదము చెప్పటకువీలుపడదు గదా!జీవభావముగాని ఈశ్వరభావముగానిమిథ్యాఽజ్ఞానకల్పితములు గావున, చేతనాంతరము ఘటిల్లనేరదు.

శ్లో॥ మాయాభాసేన జీవేశౌ కరోతీతి శ్రుతత్వతః ।

కల్పితావేవ జీవేశౌ తాభ్యాంసర్వంప్రకల్పితమ్॥(వే.పం.౭-౩)

"**జీవాభాసేనకరోతి మాయాచావిద్యా చ స్వయమేవ భవతి**" (నృ.ఉ.తా.౯)అర్థము:-త్రిగుణాత్మకమైనప్రకృతి జీవేశ్వరుల నిరువురను చిదాభాసులుగా(చిత్ప్రతిబింబములుగా)చేసినదని శ్రుతియందుచెప్పబడినందున జీవేశ్వరులుభయులును మాయాకల్పితులగుచున్నారు.

శ్లో॥ కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః॥

కార్యకారణతాంహిత్వా పూర్ణబోధోఽవశిష్యతే॥(శుకర.౧౨)

అర్థము:-అవిద్యా అథవా అంతఃకరణోపాధికుడు జీవుడని,మాయోపాధికుడు ఈశ్వరుడని వ్యవహరింపబడుచున్నారు. సమ్యగ్విచారము(శ్రవణ,మనన,నిధిధ్యాసనము)చేసి కార్యకారణోపాధులను(అవిద్య,మాయలను)పరిత్యజించినచో నిష్ప్రతియోగిక పూర్ణబోధయే మిగిలియుండును.

కావున,జీవేశ్వరవిభాగము మిథ్యాఽజ్ఞానకల్పితమున్నందున జీవేశ్వరులను ప్రతిపాదించుటయందు శ్రుతిమాతకు తాత్పర్యములేదు.శ్రుతిషడ్లింగములచేతజీవబ్రహ్మైక్యమునందే పరమతాత్పర్యంగలదు.ఇట్లు,చేతనాంతరముసిద్ధింపక పోవుటవలన బ్రహ్మమునందు సజాతీయభేదరాహిత్యము నిరాటంకంగా సిద్ధించుచున్నది.

3.“నిష్కలంనిష్క్రియంశాన్తంనిరవద్యంనిరఞ్జనమ్”(శ్వే.ఉ.౬-౧౯)“కేవలోనిర్గుణశ్చ”(శ్వే.ఉ.౬-౧౧)“అసంగోహ్యయంపురుషః” (బృ.౪-3-౧౫;౧౬)“నిత్యఃసర్వగతఃస్థాణురచలోఽయం సనాతనః” (గీత.2-24)ఇత్యాదిశ్రుతిస్మృతిభిరవయవగుణక్రియాజాతిసంబంధ ప్రతిషేధేన సృష్ట్యాదివాక్యైర్జ్ఞాయమాన అవయవగుణాదీనాం శ్రుతిప్రతిపాద్యత్వాభావేన మాయాకల్పితత్వేన చ మిథ్యాత్వా ద్బ్రహ్మణః స్వగతభేదశూన్యత్వమితిభావః ।

అవయవము,గుణము,క్రియ,జాతి మరియు సంబంధము ఈ ఐదింటిలో యే ఒక్కటైనను ఉన్నయెడల స్వగతభేదము సంభవిస్తుంది. కాని,పైనుదహరించిన “నిష్కలం నిష్క్రియం” ఇత్యాది శ్రుతిస్మృతివచనములచే బ్రహ్మమునందు అవయవాది ఐదింటిని అత్యంత నిషేధముచేయుట జరిగింది. అచ్చటచ్చట సృష్ట్యాది ప్రసంగమునందు బ్రహ్మమునకు అవయవగుణాదుల ను చెప్పినప్పటికినీ-అవిఆరోపితములేగాని వాటిని ప్రతిపాదిం చే తాత్పర్యం శ్రుతిమాతకులేదు. మరియు అవయవగుణాదు లు మాయాకల్పితములు.కావున,మిథ్యాభూతములే.అందువల్ల బ్రహ్మము స్వగతభేదశూన్యమై యున్నది.

లక్షణపరీక్ష:-“సజాతీయ విజాతీయస్వగతభేదశూన్యత్వం అద్వైతత్వమ్”అను అద్వైత లక్షణముయొక్క పదకృతి(పరీక్ష) ఈ క్రింది విధంగానున్నది.

“స్వగతభేదశూన్యత్వమద్వైతత్వమ్”అనిఇంతమాత్రమే అద్వై

త లక్షణము చేసినయెడల సాంఖ్యాభిమత ఆత్మయందు అతి వ్యాప్తి గలుగుచున్నది.ఎందుకనగా!సాంఖ్యులుకూడ ఆత్మను అవయవగుణక్రియజాతిసంబంధ శూన్యమని స్వీకరించెదరు. కావున,స్వగతభేదశూన్యత్వము సంభవించుచున్నది.అందువల్ల, వారి ఆత్మయందుకలుగు అతివ్యాప్తిదోషపరిహారార్థము అద్వై త లక్షణములో"సజాతీయ భేదశూన్యత్వం"అనిఇంతభాగము నుఅవశ్యముగా నివేశింపనైనది.సాంఖ్యులు జీవనానాత్వము ను స్వీకరించినందున(జీవులలో పరస్పరభేదమును స్వీకరించి నందున)సజాతీయ భేదశూన్యత్వాభావము ప్రసక్తమగుచున్నది. అనగా,సజాతీయభేదమే సిద్ధించుచున్నది. కావున, అతివ్యాప్తి దోషం ప్రాప్తించదు.

"సజాతీయ స్వగతదభేదశూన్యత్వమద్వైతత్వమ్"అని అద్వై తముయొక్క లక్షణముచేసినచో ఆకాశమునందు అతివ్యాప్తి కలుగుచున్నది.ఎందుకనగా!ఆకాశము ఒక్కటేగదా.నానా(అనే క)ఆకాశములు లేనందున ఆకాశమునకు సజాతీయ భేదశూ న్యత్వము సిద్ధించుచున్నది.మరియు నిరవయవము, నిష్క్రియ ముగూడ ఉన్నందున స్వగతభేదశూన్యత్వంగూడ ప్రాప్తిస్తుంది. అందువల్ల లక్షణము అతివ్యాప్తిదోషగ్రస్తమగుచున్నది. తన్నివా రణార్థము'అద్వైత'లక్షణమునందు"విజాతీయభేదశూన్యత్వమ్" అనికూడా అవశ్యముగాజోడించవలెను.అప్పుడు ఆకాశమున కు విజాతీయ భేదశూన్యత్వము సిద్ధింపకపోవుటవలన అతి వ్యాప్తి దోషము ప్రసక్తము కాజాలదు.ఎందుకంటే,పృథ్వీ,జలం

మొదలగు విజాతీయద్రవ్యపదార్థములున్నందువలన-అని గమనించవలెను.

ఒకవేళ"విజాతీయ భేదశూన్యత్వమద్వైతత్వమ్"అని ఇంత మాత్రమేలక్షణముచేసినచో,సజాతీయస్వగతదభేదములను అంగీకరించినట్లవుతుంది.అట్లగుచో"ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" (త్రి.మ.నా.3),(ఛాం.6-2-1),(పైంగ.౧)అను అద్వైతశ్రుతికి విరోధమేర్పడును.కావున,ఆశ్రుతి విరోధపరిహారముకొఱకు "సజాతీయ భేదశూన్యత్వము"చెప్పబడింది.మరియు బ్రహ్మమునందు ఏకరసత్వసిద్ధికొఱకు"స్వగతభేదశూన్యత్వము"చెప్పబడింది.ఈప్రకారంగా"సజాతీయ,విజాతీయ,స్వగతభేదశూన్యత్వమద్వితీయత్వమ్"అని సంపూర్ణమైన,నిర్దుష్టమైన సల్లక్షణము చేయబడినది. ఇంతదనుక"అద్వైతమకరన్దమ్"అనుఈగ్రంథముయొక్క నామధేయాంతర్గతమైన"మకరన్దమ్"శబ్దతాత్పర్యమును సంక్షేపముగా తెలుసుకొని,అట్లే"అద్వైత"శబ్ద విస్తృత వివేచనము చేస్తూవచ్చాము.దీనితో గ్రంథకర్తయగు శ్రీలక్ష్మీధరకవీంద్రుల వారికి యీ సద్గ్రంథముద్వారా విజాతీయ సజాతీయ స్వగత భేదరహితమైన మరియు నిత్యనిరతిశయ నిర్విషయక నిరావృత పరిపూర్ణానందస్వరూపమగు ప్రత్యగభిన్నపరబ్రహ్మమే ప్రతిపాద్యవిషయమని,దానిని ప్రతిపాదించుట**యే** ముఖ్యఉద్దేశమని మరియు తద్విషయక సమ్యక్ జ్ఞానమును బోధించి సకల ముముక్షువులనుద్ధరించుటయే వారియొక్క లక్ష్యమని సుస్ప

ష్టముగా తెలియబడుచున్నది.

"అద్వైతమేవ మకరన్దమ్=అద్వైతమకరన్దమ్"అద్వితీయము గు ప్రత్యగభిన్నబ్రహ్మమే మకరందము అనగా ఆనందరూప ము.తేనె ఏవిధంగా సుఖహేతువున్నందున సర్వులకు ఈప్సిత మై(అభిలషితమై)యున్నదో,అట్లే"ఆనన్దోబ్రహ్మ"(తై.3-౬)అనిచెప్ప బడినట్లుగా ఆనందరూపబ్రహ్మము ఆబ్రహ్మస్తంబ పర్యంతము సకలజీవులచేత కోరబడుచున్నది.సమస్తప్రాణికోట్లుసహజము గాసుఖమునే కోరుతాయి.ఎందుకనగా!సుఖరూప బ్రహ్మము వారియొక్క ఆత్మయే అయిఉన్నందున."ఆత్మాహినామస్వరూప మ్".(బ్ర.సూ.భాష్యము౧-౧-౬)ఆత్మఅనగా స్వరూపమనియర్థము. కావున,సకలజీవులయొక్క స్వరూపము ఆనందరూపబ్రహ్మ మే..అందుకే, అందరూ ఎల్లప్పుడు సుఖమునే కోరుచున్నారు. దుఃఖమును లేశమాత్రము గూడ ఇష్టపడరు.

"మా న భూవం హి భూయసమితి ప్రేమాత్మనీక్ష్యతే"। (వే.పం.౧-౮)పరమప్రీతికి విషయమున్నందున ఆత్మ పరమానం దరూపము అనగా!నిరుపాధిక సుఖస్వరూపమున్నది.ఏది పర మానందరూపముండదో,అది ఘటమువలె పరమ ప్రేమాస్ప దమైయుండదు. అందువల్ల ఈ ఆత్మ పరమానందరూపము లేదు-అనేదిలేదు.మరేమనగా,పరమానందరూపమే ఉన్నది. మ రియు సకలజీవులయొక్క అనుభవము గూడ—నేను భూమిపై నుండనక్కఱ లేదు-అను ఉద్దేశము ఎవరికిని కలుగదు. ఎల్ల ప్పుడూ జీవించియేయుండాలి-అను ప్రీతి సర్వానుభవసిద్ధమై

కానవచ్చుచున్నది. తన నాశనమును ఎవరునూ కోరరుగదా! ఏది యెట్లు పోయినను తానుమాత్రము చక్కగానుండిన చాలు నని ప్రతివాడును కోరుచుండునుగదా!

"రసోవై సః రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనన్దీ భవతి" (తై.౨-౭)ఆబ్రహ్మము నిశ్చయముగా రస(ఆనంద) స్వరూపము ఆ బ్రహ్మానందమును పొందియే ఈపురుషుడు ఆనందితుడగు చున్నాడు.ఇత్యాది శ్రుతి,స్మృతి,అనుభవములచేత ప్రత్యగభిన్న బ్రహ్మము నిరతిశయానందస్వరూపమని సిద్ధమైనది.ఆ బ్రహ్మా నందమే మకరందము.దానిని గ్రంథకర్తయగుశ్రీలక్ష్మీధర కవీం ద్రులవారు"అద్వైతమకరన్దమ్"అనుసద్గ్రంథరూపములో బ్రహ్మా నంద రసామృత(మకరంద)మునుగ్రోలి సకల ముముక్షువులు తరించాలి—అని నిర్హేతుక అపారకరుణాహృదయముతో మన కరకమలములకందించుచున్నారు.ఏ అధికారిపురుషుడు అద్వి తీయ బ్రహ్మతత్త్వమును శాస్త్రోక్తప్రకారంగా శ్రుతి షడ్లింగము లచే శ్రీగురుదేవుని ముఖారవిందముద్వారా తత్త్వమస్యాది మహావాక్యములను శ్రవణము,మననము మరియు నిధిధ్యా సనాదులను గావించునో, అతడు సంశయము మరియు విపరీతభావన నివృత్తమై అప్రతిబద్ధ దృఢ అపరోక్షబ్రహ్మజ్ఞాన మను చరమ సాక్షాత్కారముచే అజ్ఞానము ధ్వంసము కాగా నిరతిశయానంద బ్రహ్మానుభూతినొంది కృతకృత్యుడు(ముక్తుడు) కాగలడు.

లోకంలో,తేనెటీగలు రకరకాలైన అనేక పుష్పముల నుండిసారభూతమైన మకరందమును(తేనియలను) సేకరించి, తీసుకొచ్చి తేనెతెట్టెలో భద్రపరచును.అయితే,శ్రీ కవీంద్రులవారు బ్రహ్మానందరసామృతమను మకరందమును ఎక్కడనుండి సంగ్రహించి"అద్వైతమకరన్దమ్"అను యీగ్రంథరూప తేనెతెట్టెలో పొందుపరచి సకల ముముక్షుజనులకు వితరణము చేయుచున్నారు?అనియిట్లు శంక ప్రాప్తముకాగా సమాధానము చెప్పబడుతుంది. వేదశిరస్సులనబడు సకలోపనిషత్తులను వివిధపుష్పములలో నిహితమైన అతిగోప్యమైన సారభూతమైన బ్రహ్మానందరసామృతము(మకరందము)ను సేకరించి(క్రోడీకరించి)కేవలముఇరువది యెనిమిది శ్లోకములతో కూడిన సంగ్రహరూప "అద్వైతమకరన్దమ్"అను యీ ప్రకరణ గ్రంథముద్వారా ముముక్షులోకమునకందజేయుచున్నారు.

ఈశ కేన కఠ ప్రశ్న ముండక మాండూక్య తిత్తిరి ।

ఐతరేయంచఛాందోగ్యంబృహదారణ్యకంతథా॥(ముక్తి.౧-౩౦)

ఇవి ప్రసిద్ధమైన దశోపనిషత్తులనబడుతాయి. వీటిపై శ్రీ ఆదిశంకరాచార్యులవారు,ప్రసన్నమగు,గగంభీరమగుభాష్యమును రచించారు. ఈ దశోపనిషత్తులే కాకుండా నూటఎనిమిది ఉపనిషత్తులుగూడ ఉన్నాయి.వాటి నామసంకీర్తనము ముక్తికోపనిషత్తులోగనందగును.ఇంతేకాకుండా ఇంకా అధికము గూడ ఉన్నాయి. కావున ఈ ఉపనిషత్తులే నానావిధ పుష్పములని

తెలియవలెను."తంత్వౌపనిషదం పురుషం పృచ్ఛామి"(బృ.౩-౯-౨౬)ఉపనిషద్గమ్య పురుషున్నిగూర్చి అడుగుచున్నాను—అని శ్రుతిలో చెప్పబడినట్లుగా పరబ్రహ్మతత్త్వము కేవలము ఉపనిషద్వేద్యము.అటువంటి తత్త్వమును ఎవరుగూడ సంప్రదాయమును వదలి స్వతంత్రముగా ఉపనిషత్తులను తిరగవేసి అనుభూత మొనర్చుకొనుటకుసమర్థులుకారు."ఆచార్యవాన్ పురుషోవేద" (ఛాం.౬-౧౪-౨)"ఆచార్యస్తు తే గతింవక్తా"(ఛాం.౪-౧౪-౧). ఎవరికైతే ఆచార్యుడు (శ్రీగురువు)గలడో,అతడే ఉపనిషత్తులలోని రహస్యతత్త్వమును తెలిసికుంటాడు.ఆచార్యుడే నీకు మోక్షమార్గమును బోధించు వక్త"తద్విజ్ఞానార్థంసగురుమే వాభిగచ్ఛేత్" (ముం.౧-౨-౧౨)ఆత్మజ్ఞాన సంపాదనకొఱకు అధికారిపురుషుడు శ్రోత్రియబ్రహ్మనిష్ఠ సద్గురువులనేఆశ్రయించవలెను. ఇత్యాది శ్రుతులు సంప్రదాయులగు శ్రోత్రియుడు మరియు బ్రహ్మనిష్ఠుడు అయిన సద్గురువులద్వారానే వేదాన్తములనభ్యసించవలయునని ఢంకా మ్రోగించి చెప్తున్నాయి.

"**మధుకరః ఏవ పుష్పరసం గృహ్ణాతి నేతరత్**" ఎట్లు లోకంలోతుమ్మెదలు,తేనెటీగలుతప్ప మరియేయితర ప్రాణులు, పుష్పములలోని సారభూతమైన తేనియలను గ్రహించుటకు సమర్థములు కావో,అట్లే వేదశిఖలగు ఉపనిషద్రూప సుగంధ పుష్పములలోని రహస్యతత్త్వమను మకరందమును సేకరించుటకు(అవగతమొనర్చుకొనుటకు) కేవలము అనుభవజ్ఞులగు సద్గురువులుతప్ప అన్యులెవరుగూడ సమర్థులుకాజాలరు.అందు

కే శ్రీలక్ష్మీధర కవీంద్రులవారు సద్గురు స్థానమునలంకరించి ఉపనిషద్ కుసుమ నిహిత గోప్యతత్త్వమగు బ్రహ్మామృతరస మను మకరందమును సంగ్రహించి యీ సద్గ్రంథరూపములో ఆవిష్కరించారు.ఈగ్రంథము ఉపనిషత్తుల సారసంగ్రహమేయ నుటకు నిదర్శనమేమనగా!ఈగ్రంథములో కొన్నిశ్లోకములు సాక్షాత్తుగా ఉపనిషన్మంత్రములే ఉద్ధృతము గావింపబడినవి. మిగతా శ్లోకాలు వాటిసారమును గ్రహించి రచించనైనది.

శ్లో॥ న ప్రకాశేఽహ మిత్యుక్తిర్య త్ప్రకాశనిబంధనా ।
స్వప్రకాశం తమాత్మానమప్రకాశః కథం స్పృశేత్ ॥
(అద్వైతమకరన్దమ్. శ్లో.౧౬);(వరాహోపనిషత్.౨-౯&౧౦)

శ్లో॥ అహమేవ సుఖం నాన్య దన్యచ్చేన్నైవ తత్సుఖమ్ ।
అమదర్థం న హి ప్రేయో మదర్థం న స్వతః ప్రియమ్ ॥
(అద్వైతమకరన్దమ్.౨౪) (వరాహోపనిషత్.౨-౭&౮)

శ్లో॥ న హి నానాస్వరూపం స్యాదేకంవస్తు కదాచన ।
తస్మాదఖండ ఏవాస్మి(యస్మదన్యన్న కించన) (వరా.౩-౧)
(విజహజ్జాగతీం భిదామ్)(అద్వైతమకరన్దమ్.౨౫)

ఈ శ్లోకంలో కించిత్ పాఠాంతరమైనది.

పైశ్లోకముల పర్యాలోచనద్వారా"అద్వైతమకరన్దమ్"ఉపని షత్తుల సారసంగ్రహమగు ప్రకరణగ్రంథము-అని నిర్ణయింపబ డినది. ప్రసంగవశమున ప్రకరణ మంటే యేమిటి?

శ్లో॥ శాస్త్రైకదేశసంబద్ధం శాస్త్రకార్యాన్తరే స్థితమ్ ।

ఆహుఃప్రకరణంనామగ్రంథభేదవిచక్షణాః॥(పరాశర ఉపపు.౧౮-౨౧)

అర్థము:-శాస్త్రముయొక్క ఏకదేశముతో సంబంధపడి యుండి,శాస్త్రముయొక్క కార్యమును అంశతః పూర్తిజేయున దై మరియు శాస్త్రముయొక్క కొన్నిప్రక్రియలచేమాత్రము శాస్త్ర ప్రతిపాద్యవిషయమును ప్రతిపాదించు గ్రంథవిశేషమునకు"ప్రక రణము"అని గ్రంథభేదము నెఱింగిన విద్వత్పురుషులు చెబు తారు.

వేదాన్తశాస్త్రములో ప్రసంగమునుబట్టి అనేకప్రతిపాద్య విష యములుంటాయి.కర్మ,ఉపాసన,జ్ఞానము మరియు ఆయావిష యములకు ఉచితమగు ప్రయోజనములు,ఆయావిషయముల ను ప్రతిపాదించు అనేకప్రక్రియలుగూడ ఉంటాయి.అందులో—

ప్రస్తుత గ్రంథమున వేదాన్తశాస్త్రముయొక్క ఏకదేశ విష యమగు జీవబ్రహ్మైక్యమును ప్రతిపాదిస్తూ, వేదాన్తశాస్త్రముయొ క్క కార్యము=ముఖ్యప్రయోజనమగు జీవునియొక్క ముక్తికి ఉ పాయమును ప్రతిపాదించడమైనది.కావున,''అద్వైత మకరన్ద ము'' ప్రకరణ గ్రంథము.

ప్రకరణముగూడ౧.శ్రవణాత్మకము,౨.మననాత్మకము మ రియు౩.నిదిధ్యాసనరూపము-అనుభేదముచేమూడువిధములు.

౧.తత్త్వబోధ, ఆత్మబోధ,అపరోక్షానుభూతి,వివేకచూడామ ణిః,వేదాన్తసారము,విచారచంద్రోదయము మొదలగునవి.

౨.అద్వైతమకరన్దము,స్వానుభవాదర్శః,సిద్ధాన్తబిన్దు,వేదాన్త పరిభాష,శ్రీవిచారసాగరము,శ్రీవృత్తిప్రభాకరము మొదలగునవి.

౩.శ్రీవేదాన్త పఞ్చదశి,మాండూక్యకారికా,దక్షిణామూర్తి స్తోత్రము(మానసోల్లాసము),అష్టావక్ర గీత,అవధూత గీత,పక్షపాత రహిత అనుభవ ప్రకాశము మొదలగునవి.

తెలుగువారికి తెలుగు అంకెల పరిచయముగూడ ఉండాలి, అను అభిప్రాయముతో, గ్రంథములో తెలుగు అంకెలు ఇవ్వబడినవి. వాటికి బదులుగా ఆంగ్లములో ౧ = 1; ౨ = 2; ౩= 3; ౪ = 4; ౫ = 5; ౬ = 6; ౭ = 7; ౮ = 8; ౯ = 9; ౧౦ = 10 ఇట్లు తెలుసుకోగలరు.



# విషయానుక్రమనిక

# విషయానుక్రమనిక

## విషయానుక్రమనిక

## విషయానుక్రమనిక

## విషయానుక్రమనిక

## విషయానుక్రమనిక

## విషయానుక్రమనిక





**అద్వైత మకరన్దమ్** (మూల శ్లోకములు)

శ్లో॥కటాక్షకిరణచాన్తః నమన్మోహాబ్ధయే నమః ।
అనన్తానన్దకృష్ణాయ జగన్మఙ్గలమూర్తయే ॥ ౧ ॥

శ్లో॥అహమస్మి సదాభామి కదాచిన్నాహమప్రియః।
బ్రహ్మైవాహమతః సిద్ధం సచ్చిదానన్దలక్షణమ్ ॥౨ ॥

శ్లో॥మయ్యేవోదేతిచిద్వ్యోమ్ని జగద్గంధర్వపత్తనమ్ ।
అతోఽహం న కథం బ్రహ్మ సర్వజ్ఞం సర్వకారణమ్ ॥

శ్లో॥న స్వతః ప్రత్యభిజ్ఞానాన్నిరంశత్వాన్న చాన్యతః ।
నచాశ్రయవినాశాన్మే వినాశస్స్యాదనాశ్రయాత్॥ ౪ ॥

శ్లో॥న శోష ప్లోష విక్లేదచ్ఛేదాశ్చిన్నభసో మమ ।
సత్యైరప్యనిలాగ్న్యమ్భః శస్త్రైః కిముతకల్పితైః ॥ ౫ ॥

శ్లో॥అభారూపస్యవిశ్వస్య భానం భాసన్నిధేర్వినా ।
కదాచిన్నావకల్పేత భాచాహం తేన సర్వగః ॥ ౬ ॥

శ్లో॥నహి భానాదృతే సత్త్వం నర్తేభానం చితోఽచితః ।
చిత్సంభేదోఽపినాధ్యాసాదృతే తేనాహమద్వయః॥౭॥

శ్లో॥న దేహో నేన్ద్రియంచాహం నప్రాణో న మనో న ధీః।
మమతాపరిరబ్ధత్వాదాక్రీడత్వాదిదం ధియః ॥ ౮ ॥

శ్లో॥సాక్షీ సర్వాన్వితః ప్రేయానహం నాహం కదాచన ।
పరిణామపరిచ్ఛేద పరితాపైరుపప్లవాత్ ॥ ౯ ॥

శ్లో॥సుప్తేహమి నదృశ్యన్తే దుఃఖదోషప్రవృత్తయః ।

అతః తస్యైవ సంసారో నమే సంసర్తు సాక్షిణః ॥౧౦॥

శ్లో॥సుప్తః సుప్తిం న జానాతి నాసుప్తే స్వప్నజాగరౌ ।

జాగ్రత్స్వప్నసుషుప్తీనాం సాక్ష్యతోఽహమతద్దశః॥౧౧॥

శ్లో॥విజ్ఞానవిరతిః సుప్తిస్తజ్జన్మ స్వప్న జాగరౌ ।

తత్సాక్షిణః కథం మే స్యుర్నిత్యజ్ఞానస్య తే త్రయః॥౧౨॥

శ్లో॥షడ్వికారవతాం వేత్తా నిర్వికారోఽహమన్యథా ।

తద్వికారానుసంధానం సర్వథా నావకల్పతే ॥ ౧౩ ॥

శ్లో॥తేన తేన హి రూపేణ జాయతే లీయతే ముహుః ।

వికారి వస్తు తస్యైషామనుసంధాతృతా కుతః॥౧౪॥

శ్లో॥నచ స్వజన్మ నాశం వా ద్రష్టుమర్హతి కశ్చన ।

తౌ హి ప్రాగుత్తరాభావ చరమప్రథమక్షణౌ ॥ ౧౫ ॥

శ్లో॥న ప్రకాశేఽహమిత్యుక్తిర్యత్ప్రకాశనిబంధనా ।

స్వప్రకాశం తమాత్మానమప్రకాశఃకథం స్పృశేత్॥౧౬॥

శ్లో॥తథాప్యాభాతి కోఽప్యేష విచారాభావజీవనః ।

అవశ్యాయశ్చిదాకాశే విచారార్కోదయావధిః॥౧౭ ॥

శ్లో॥ఆత్మాజ్ఞానమహానిద్రా జృంభితేఽస్మిన్ జగన్మయే ।

దీర్ఘస్వప్నే స్ఫురన్త్యేతే స్వర్గమోక్షాదివిభ్రమాః ॥ ౧౮ ॥

శ్లో॥జడాజడవిభాగోఽయమజడే మయి కల్పితః ।

భిత్తిభాగే సమే చిత్ర  చరాచరవిభాగవత్ ॥ ౧౯ ॥

శ్లో॥చేత్యోపరాగరూపా మే సాక్షితాపి న తాత్త్వికీ ।

ఉపలక్షణమేవేయం నిస్తరఙ్గచిదంబుధే: ॥ ౨౦ ॥

శ్లో॥అమృతాబ్ధేర్న మే జీర్ణిర్వృషాడిండీరజన్మభి: ।

స్పటికాద్రేర్నమే రాగః స్వప్న సంధ్యాభ్రవిభ్రమైః ॥౨౧॥

శ్లో॥స్వరూపమేవ మే సత్త్వం న తు ధర్మో నభస్త్వవత్ ।

మదన్యస్య  సతోఽభావాన్నహి సా  జాతిరిష్యతే॥౨౨॥

శ్లో॥స్వరూపమేవ మే జ్ఞానం న గుణః స గుణో యది ।

అనాత్మత్వమసత్వం వా జ్ఞేయాజ్ఞేయత్వయోః పతేత్ ॥

శ్లో॥అహమేవ సుఖం నాన్యదన్యచ్చేన్నైవ తత్సుఖమ్ ।

అమదర్థం నహి ప్రేయో మదర్థం న స్వతః ప్రియమ్ ॥

శ్లో॥నహి నానా స్వరూపం స్యాదేకం వస్తు కదాచన ।

తస్మాదఖణ్డ ఏవాస్మి విజహజ్జాగతీం భిదామ్॥౨౫ ॥

శ్లో॥పరోక్షతాపరిచ్ఛేద శాబల్యాపోహనిర్మలమ్ ।

తదసీతిగీరా లక్ష్యమహమేకరసం మహః ॥ ౨౬ ॥

శ్లో॥ఉపశాంత జగజ్జీవ  శిష్యాచార్యేశ్వరభ్రమమ్ ।

స్వతః సిద్ధమనాద్యన్తం పరిపూర్ణమహం మహః॥౨౭॥

శ్లో॥లక్ష్మీధరకవేః సూక్తి శరదంభోజసంభృతః ।

అద్వైతమకరందోఽయంవిద్వద్భృఙ్గైర్నిపీయతామ్॥౨౮॥

ఇతి శ్రీ లక్ష్మీధరకవి విరచిత అద్వైతమకరన్దం సంపూర్ణమ్

Discourses of "Advaitamakranda" are available at :-

https://www.youtube.com/watch?v=0Af1P1XEWBM&list=PLdTXt2w4FlExp_mOI2ixacN8w-Znj9Zj7

https://archive.org/details/@swami_brahmavidyananda

---

అద్వైతమకరన్దములో ప్రమాణరూపముగా ఉద్ధృత గ్రంథములు :—

| | |
|---|---|
| ౧.ఉపనిషత్తులు | ౨.బ్రహ్మసూత్రములు |
| ౩.శ్రీమద్భగవద్గీత | ౪.శ్రీ వేదాన్త పఞ్చదశి |
| ౫.సంక్షేపశారీరకము | ౬.శ్రీ యోగవాసిష్ఠము |
| ౭.తత్త్వప్రదీపిక (చిత్సుఖీ) | ౮.సూతసంహిత (బ్రహ్మగీతలు) |
| ౯.స్వానుభవాదర్శః | ౧౦.వివేకచూడామణిః ఇత్యాదులు |



ఔం శ్రీ గురుభ్యో నమః

శ్రీలక్ష్మీధర కవి విరచిత

# అద్వైత మకరన్దః

## శ్రీమత్ స్వయంప్రకాశ యతి విరచిత

రసాభివ్యఞ్జికా టీకా ప్రారమ్భః

నిత్యం నిరన్తరానన్దం చిద్ఘనం బ్రహ్మనిర్భయమ్ ।
శ్రుత్యాతర్కానుభూతిభ్యామహమస్మ్యద్వయం సదా ॥౧

అమ్బాగృహీతవామార్ధం వన్దే చన్ద్రకలాధరమ్ ।
లావణ్యమధురాకారం కారుణ్యరసవారిధిమ్ ॥ ౨ ॥

కైవల్యానన్దయోగీన్ద్రపాదకఞ్జరజోరవిః ।
రాజతే మే హృదాకాశే మోహధ్వాన్తనివర్తకః ॥ ౩ ॥

శుద్ధానన్దపదామ్బోజద్వన్ద్వం సేవే యదుద్భవమ్ ।
నిర్వాణరసమాస్వాద్యహృష్టాః శిష్యాలిపఙ్క్తయః ॥ ౪ ॥

సచ్చిదానన్దయోగీన్ద్రా జయన్తి భువి కేచన ।
యత్కృపాలవతస్తీర్ణో మయా సంసారవారిధిః ॥ ౫ ॥

**భావార్థము:**–త్రికాలాబాధ్యము, అంతరము=వ్యవధానము లేనిదియు,ఆనందరూపమును,జ్ఞానస్వరూపమును, నిర్భయము ను అనగా దుఃఖసంబంధరహితమును మరియు అద్వితీయ మునగు యేపరబ్రహ్మము గలదో,శ్రుతి,యుక్తి మరియు అనుభ

వములసహాయముచే ఆ నిత్యమగు బ్రహ్మమును నేనే అయి ఉన్నాను ॥ ౧ ॥

ఇట్లు, నిర్గుణ పరబ్రహ్మమును స్మరించి, ఇప్పుడు సగుణ బ్రహ్మమునకు వందనమాచరించుచున్నాడు. ఎవరు తన వామ భాగమున పార్వతీదేవిని ధరించియున్నాడో,శిరమున చంద్రుని ధరించియున్నాడో, ఎవరి స్వరూపము సుందరమై, మధురమై, సర్వులకు మోహమును కలిగించునదై యున్నదో మరియు యెవరు సాక్షాత్ కరుణాసముద్రుడో–అట్టి భగవంతుడగు శ్రీ శంకరునికి నాయొక్క వందనములు ॥ ౨ ॥

ముందర మూడుశ్లోకములచే పరమేష్ఠి గురువు, పరమగురువు మరియు స్వగురువులను వర్ణించుచున్నాడు. నా హృదయాకాశములోనున్న అజ్ఞానాంధకారమును నాశనము చేయగల శ్రీకైవల్యానంద యోగీంద్రులవారి దివ్యచరణకమల యుగళముయొక్క రజోరూపసూర్యుడు ప్రకాశించుచున్నాడు ॥ ३ ॥

ఎవరి చరణకమలయుగళమునుండి వెలువడిన మోక్షమను రసమును ఆస్వాదించి అనంతశిష్యబృందము సంతుష్టచిత్తులై భవసాగరమును తరించిరో, అట్టి బ్రహ్మనిష్ఠులగు శ్రీ శుద్ధానందుడను పరమగురువులయొక్క చరణకమలయుగళమును నేను సేవించుచున్నాను. ॥ ४ ॥

ఎవరియొక్క కృపాకటాక్షలేశముచే నేను భవసంద్రమునుండి ఉత్తీర్ణుడనైతినో,అట్టి ఒకానొక శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు

(అవాఙ్మనస గోచరమగు)సచ్చిదానంద యోగీంద్రులు జగత్తులో విరాజిల్లుచున్నారు ॥ ౫ ॥

ఇట్లు, టీకాకారులగు శ్రీప్రకాశానందయతీంద్రులు మంగళ మాచరించి, మూలగ్రంథ కర్తయగు శ్రీలక్ష్మీధర కవీంద్రుల వారి యొక్క"**అద్వైతమకరందమ**"ను ఈప్రకరణసద్గ్రంథమున ప్రథమ శ్లోకమునకు అవతారిక వేయుచున్నారు.

**టీక:**—ఇహఖలు లక్ష్మీధరోనామకశ్చిత్కవీంద్రోనిరన్తర నిత్యాద్యనుష్ఠానశుద్ధస్వాన్తతయా సఞ్జాత వివేకవైరాగ్యశమాది ముముక్షావత ఆత్మవివిదిషయా సంత్యక్తలోకవేదధర్మాన్ గురువర చరణోపసర్పణపురఃసరం సమ్యక్ శ్రుతవేదాన్తతత్త్వేఽప్యసంభావనాది ప్రతిబద్ధ జ్ఞానతయాఽపరితుష్యతః కాంశ్చిత్పురుషధౌరేయానుపలభ్య సఞ్జాత కరుణస్తేషాం కరతలబిల్వ ఫలవత్స్ఫుటం వేదాన్తప్రతిపాద్యం బ్రహ్మ సచ్చిదానన్దలక్షణం సర్వజ్ఞంసర్వోపాదానం నిత్యం సర్వగమద్వయం దేహేన్ద్రియప్రాణమనోబుద్ధ్యహఙ్కారసాక్షి ప్రత్యగభిన్నతయా తర్కైః సంభావయితుం కిఞ్చిత్ప్రకరణం అద్వైత మకరన్దాఖ్య మారభమాణః, చికీర్షితస్యతస్యావిఘ్నేన పరిసమాప్తయే స్వేష్టదేవతాప్రణామరూపం మఙ్గళం స్వయమనుష్ఠాయ శిష్యశిక్షాయై గ్రన్థతో నిబధ్నాతి—కటాక్ష కిరణా, ఇతి.

**భావార్థము:**—ఈ జన్మలోగాని,పూర్వజన్మలలోగాని నిత్య నైమిత్తికాది కర్మలను నిష్కామముచేననుష్ఠించుటవలన అంతః

కరణము శుద్ధిపడి, ఆ శుద్ధాంతఃకరణములో ఆత్మానాత్మ వివే
కము, విషయవైముఖ్యరూప వైరాగ్యము, శమాదిషట్కసంపత్తి
మరియు ముముక్షుత్వము-అను సాధనచతుష్టయసంపత్తి ఉద
యించిన పురుషుడు ఆత్మ(బ్రహ్మ)జిజ్ఞాసచేత,ఆత్మజ్ఞానమునకు
ప్రతిబంధకములగు లౌకికవైదిక కర్మధర్మములను పరిత్యజించి,
అధీతవేద్యుడు,బ్రహ్మనిష్ఠుడును-అగు శ్రీగురుదేవులకు శరణువె
ళ్ళి, ఆయన చరణములనుపాసించి, వారి శ్రీ ముఖమునుండి
**"ఆత్మావాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః"**
(బృ.౨-౪-౫; ౪-౫-౬)అను శాస్త్రానుసారము వేదాంతతత్త్వమును
శ్రవణాదులుచేసి, జీవబ్రహ్మైక్యజ్ఞానమును బడసినాడు. కాని,
కించిత్ అసంభావనాది ప్రతిబంధకముల వలన జీవబ్రహ్మైక్యజ్ఞా
నమునకు ఫలమగు నిరతిశయానందము ప్రాప్తము కాకున్నది.
దానిచే అసంతుష్టుడై యుండియు అప్రతిబద్ధ దృఢాపరోక్షబ్రహ్మ
జ్ఞానమును బడసి, నిత్యము, నిర్విషయకము, నిరతిశయము,
నిరావృతమునగు బ్రహ్మానందమును బడయవలయునను ధైర్య
మునుగలిగి యున్నాడు. అట్టి,అసంతుష్ట శ్రేష్ట ధీరముముక్షు
పురుషులనుగాంచి, ఒకానొక పరమకృపాళువగు శ్రీ లక్ష్మీధరుడ
ను మహాకవియొక్క హృదయము ద్రవించి, పైనజెప్పబడిన సాధ
నచతుష్టయసంపన్నులగు ధీరముముక్షువులకు కరతలామలక
మువలెనిఃసంశయ జీవబ్రహ్మైక్యజ్ఞానము కలుగుటకొఱకై, సచ్చి
దానంద(లక్షణము)స్వరూపముగల,స్వప్రకాశమైన,సకలపదార్థ-
ములకుపాదానమైన,త్రికాలాబాధ్యమైన,సర్వగతమైన మరియు

స్వగత సజాతీయ విజాతీయ భేదరహితమైన యే పరబ్రహ్మము గలదో–అదియే దేహేంద్రియ ప్రాణ మనో బుద్ధ్యహంకారాది సంఘాతమునకు సాక్షియగు ప్రత్యగాత్మచైతన్యముచేత అభిన్న మున్నది–అనగా, పరమాత్మ మరియు జీవాత్మ రెండు వేరుగా దు, మరేమనగా ఒక్కటేయని యుక్తులచేత సిద్ధిజేయుట కొఱకై, ఈ**"అద్వైత మకరందము"**ను లఘు ప్రకరణగ్రంథమును 'శ్రీలక్ష్మీ ధరకవి'గారు ప్రారం భించుచున్నారు.అట్లే,**"నిర్విఘ్నపరిసమాప్తి కామోమఙ్గళమాచరేత్"**అను అనుమితశ్రుతి, మరియు శిష్టాచా ర సంప్రదాయానుసారము, గ్రంథము నిర్విఘ్నముగా పరిసమా ప్తమగుటకై, స్వఇష్టదేవతా నమస్కారాత్మక మంగళమునాచరి స్తూ, గ్రంథారంభమున అవశ్యముగా మంగళమునాచరించవ లయుననుకర్తవ్యమును స్వశిష్యులకుబోధించుటకొఱకు గ్రంథా రంభమున లిఖితపూర్వకముగా–కటాక్షకిరణాచాన్త–అను మం గళ శ్లోకమును జోడించుచున్నారు.

మఙ్గళాచరణము

**కటాక్షకిరణాచాన్త నమన్మోహాబ్ధయే నమః ।**

**అనన్తానన్దకృష్ణాయ జగన్మఙ్గళమూర్తయే ॥ ౧ ॥**

**అన్వయః :**–కటాక్షకిరణాచాన్త నమన్ మోహాబ్ధయే,జగన్మ ఙ్గలమూర్తయే అనన్తానన్దకృష్ణాయ నమః (అస్తు) ॥ ౧ ॥

**భావార్థము:**–ఎవరియొక్క కృపాకటాక్షముచేత శరణాగ తులయొక్క మొహాబ్ధి అనగా సంసారసముద్రము శోషింపబడు

నో, మరియు ప్రత్యక్షమంగళమూర్తియై,అనంతానందస్వరూపు డై సమస్తవిశ్వమునకు ఆనందమును ప్రసాదించుచున్నాడో,అట్టి శ్రీకృష్ణునకు నాయొక్క నమస్కారము.ఇచ్చట శ్రీలక్ష్మీధర కవీం ద్రులవారి శ్రీగురుదేవులగు శ్రీస్వామి అనంతానందులవారిని గూడ స్మరించినట్లుగా ఇంగితమగుచున్నది.

**టీక:**–కటాక్షః=భక్తేషు తిర్యక్పతితాకృపాదృష్టిః,తస్యాః కిరణే న=ప్రభయాఽఽచాన్తః=శోషితో నమతాం=నమస్కర్తౄణాం మో హోఽజ్ఞానం,సఏవాబ్ధిః=సముద్రో యేన స తథా తస్మై।శ్రీగు రుపరమేశ్వరప్రసాద రహితానాం దుస్తరత్వాద్భ్రాన్తి పరమ్పరా తరఙ్గయుక్తత్వాద్రాగాది మహాగ్రాహాదియోగాచ్చ,యుక్తమజ్ఞాన స్య సముద్రత్వమ్ ॥

కటాక్షము అనగా భక్తులపై ప్రసరింపజేయు వక్రమగుకృపా దృష్టి. ఏ విధముగా తల్లి తన శిశువునకు స్తన్యపానము చేయి స్తూ, ప్రేమపూర్వకమైన వక్రదృష్టిని సారించునో, అట్లే-ఎవరు, తనకు నమస్కరించిన భక్తులపై వక్రమైన కృపాదృష్టినిప్రసరించి, దాని ప్రభావముచే వారియొక్క మోహమును అనగా సముద్ర మువంటి అజ్ఞానమును శోషింప=ఎండింప (నశింప)జేయునో, అట్టి శ్రీకృష్ణునకు నమస్కారము. శ్రీ గురుదేవునియొక్కమరియు పరమేశ్వరునియొక్క ప్రసాద(అనుగ్రహ)శూన్యపురుషులకు దుస్త రమగు అనగా భ్రాన్తిపరంపరారూప తరంగములచేయుక్తమై, రాగద్వేషలోభాది గొప్పమొసళ్ళచేకూడియుండుటవలన అజ్ఞాన

మునకు సముద్రముతో పోల్చి చెప్పుట ఉచితమేయగును.

దేహముపట్ల ఆత్మత్వబుద్ధి అనగా అహంబుద్ధి మరియు దేహసంబంధియగు పుత్ర మిత్ర కళత్రాదులపట్ల మమత్వబుద్ధి(అహమధ్యాస మరియు మమాధ్యాస) యేది గలదో, ఇది ఆత్మస్వరూపముయొక్క అనాదిఅజ్ఞానమువల్లకలుగుచున్నది.ఇట్టి అజ్ఞానమే మహాసముద్రము వంటిది.కావున,శ్రీగురు,పరమేశ్వర ప్రసాదరహితపురుషులకు దీనినిదాటుట కష్టతరమని-భావము.

యస్యదేవే పరాభక్తి యథాదేవే తథాగురౌ ।

తస్యైతే కథితాహ్యర్థా ప్రకాశన్తే మహాత్మనః॥(శ్వే.౬-౨౩)

దేవమివాచార్యముపాసీత ॥(ఆపస్తంబ సూత్రము.౧-౬-౧౩)

అనన్తానన్దకృష్ణాయ, అనన్తః=దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్య ఆనన్దఃస్వరూపం యస్య సోఽనన్తానన్దః; సచాసౌ కృష్ణశ్చానన్తానన్దకృష్ణో వసుదేవకుమార స్తస్మై; జగన్మఙ్గలమూర్తయే=జగతాం=లోకానాం,మఙ్గలభూతా=సుఖాభివృద్ధికరీ మూర్తిః=విగ్రహో యస్య స తథా; జగన్మఙ్గలమూర్తి స్తస్మై నమోఽస్తు ॥

అనంతానంద కృష్ణాయ:-దేశముచేతగాని,కాలముచేతగాని,మరియు వస్తువుచేతగాని అంతము=పరిచ్ఛేదము-మర్యాద-పరిమితి)లేనిది అనంతమనబడును.అట్టిదిపరబ్రహ్మమేయగును.

న వ్యాపిత్వాద్దేశతోఽన్తో, నిత్యత్వాన్నాపికాలతః ।

న వస్తుతోఽపిసార్వాత్మ్యాదానన్త్యంబ్రహ్మణిత్రిధా ॥(వే.పం.౩-౩౫)

ఇట్టి అనంతుడును మరియు ఆనందస్వరూపుడునగు వసు దేవనందనుడైన శ్రీకృష్ణునకు నమస్కారము.

జగన్మంగళమూర్తయే:- జగత్తునకు అనగా సకలప్రాణులకు మంగళమును అనగా సుఖమును వృద్ధిజేయు సగుణ సాకార మూర్తియగు శ్రీ కృష్ణునకు నమస్కారము.

యద్వా కటాక్షః=ప్రతిభాక్షమమన్తఃకరణమ్, తస్య కిరణో= వాక్యజన్యతద్వృత్తిప్రతిఫలితం చైతన్యమ్,తేనాఽఽచాన్తో=భక్షితో నమతాం=స్వాత్మప్రవణానామన్తర్ముఖానాం=శ్రవణాదిపరాణాం మోహో=ఆత్మాజ్ఞానమేవాబ్ధిరసంఖ్యాధ్యాసపరమ్పరాకల్లోలోద యహేతుత్వాదనేకానర్థదుష్టాహ్యాది(గ్రాహాది)యోగాచ్చ,యేనతస్మై ॥

యద్వా=లేక,కటాక్షము=ప్రతిభాక్షమమ్అంతఃకరణమ్ అన గా ఆత్మజ్ఞానతత్పరులగు యే అంతర్ముఖచిత్తముగల పురుషులు శ్రీగురుదేవునిముఖారవిందమునుండి తత్త్వమస్యాదిమహావాక్య ములను శ్రవణముచేసి, తదనంతరము మనన నిదిధ్యాసము లు చేయగా అంతఃకరణమునందుదయించు యే“అహం బ్రహ్మా స్మి”యను వృత్తిరూపజ్ఞానము గలదో,దానియందు ప్రతిబింబిత చైతన్యము-అనగా ఆభాసరూప జ్ఞానము(కటాక్షము), దానిచే యెవరు-తనకు నమస్కరించినవారియొక్క ఆత్మాజ్ఞానరూప సముద్రమును (ఆచాన్తః భక్షితః) నాశనముచేసెనో, అటువంటి శ్రీకృష్ణునకు నమస్కారము. అగణితమగు అహంమమాధ్యాస పరంపరారూప కల్లోలములను(తరంగములను)ఉత్పన్నము చే

యునట్టి, మరియు కామక్రోధాది అనేక అనర్థరూప దుష్టసర్ప ములు,మొసళ్ళతో కూడియున్న మోహమను ఆత్మాజ్ఞానమును సముద్రమని చెప్పుట యుక్తమేయగును.

యద్వా కటాక్షోఽన్తిమప్రమాణమ్; వాక్యజన్యవృత్తిరేవ,తద నన్తరంసర్వబాధేన ప్రమాణాదివ్యవహారాఽప్రవృత్తేః‘**యత్ర త్వస్య**’ (బృ.౪-౫-౧౫) ఇత్యాది శ్రుతేః ।అన్యత్పూర్వవత్ ॥

యద్వా=లేక,కటాక్షము అనగా అంతిమ ప్రమాణము=“వాక్యజ న్యవృత్తిరేవ”అనగా, ప్రత్యక్షాది ఆరుప్రమాణములలోప్రబలమగు తత్త్వమస్యాది శ్రుతిప్రమాణములనుశ్రవణముచేయగానుత్పన్నమ గు“అహంబ్రహ్మాస్మి”యను వృత్తిరూపజ్ఞానమేకటాక్షము=అంతి మప్రమాణము. ఇటువంటి వృత్తి ఉదయించుటతోడనే సకల ప్ర మాణములు బాధింపబడి, ప్రమాణ ప్రమేయాది సర్వ వ్యవహార ప్రవృత్తి నివర్తించును.“యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్ ”(బృ.౪-౫-౧౫).ఏ అవస్థయందు(ఆత్మజ్ఞానికి)సర్వలోకము లు తన స్వరూపమేయగునో, అప్పుడు దేనిని దేనిచేచూచును? ప్రత్యక్షాదివ్యవహారముఅసంభవమగుననుట.తక్కిన శ్లోకార్థము ను పూర్వమువలెనే తెలియదగును.

యద్వా కటాక్షః=కటాక్షవత్సర్వతః ప్రసృతమక్షమపరోక్షంస్వ రూపచైతన్యమేవ “**దివీవ చక్షురాతతమ్**”(పైజ్ఞలోపనిషత్తు మరియు వరాహోపనిషత్తుల ఉపసంహారములో) “**యత్సాక్షాదపరో క్షాద్బ్రహ్మ**” (బృ.౩-౪-౧)ఇత్యాది శ్రుతేః। తస్య కిరణేనేతి। శేషం పూర్వవత్ ।

అత్ర పక్షే"**కృషిర్భూవాచకఃశబ్దో ణశ్చనిర్వృత్తివాచకఃతయోరైక్యం పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే"** (మహాభా.ఉ.ప. ౭౦-౫; నిరుక్తేఽపి) ఇతి కృష్ణశబ్దార్థో ద్రష్టవ్యః ॥

యద్వా=లేక, కటాక్షము అనగా,కట=సర్వత్ర వ్యాపించిన; అక్ష=అపరోక్షస్వరూపచైతన్యము.ఎందుకనగా,"దివీవచక్షురాతతమ్"ఆకాశమునందు ప్రసరింపబడినచక్షువృత్తివలె పరబ్రహ్మ చైతన్యముసర్వత్రవ్యాపించియున్నది."యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" (బృ.3-4-1)సర్వులకు బ్రహ్మము నిత్యాపరోక్షమున్నది-ఇత్యాది శ్రుతిప్రమాణములు గలవు.అపరోక్షస్వరూప చైతన్యముయొక్క కిరణముచేతసంసారసముద్రముశోషింపబడును.మిగతా శ్లోకార్థమును పూర్వము వలెనే గనందగును.

పక్షాంతరముచేఇచ్చట"కృష్ణ"శబ్దార్థమును గ్రహించవలెను. **"కృషి ర్భూవాచక శబ్దో ణశ్చ నిర్వృత్తివాచకః"**"కృష్"ధాతువు సత్తా వాచకము;"ణ"ఆనందవాచకమున్నది.

ఈపరిభాషానుసారము సచ్చిదానంద పరబ్రహ్మముయొక్క అపరోక్షానుభవముచే అనేకానర్థములకు మూలమగు అజ్ఞాన రూపసముద్రము శోషింపబడి(నశించి),నిరతిశయానందము ప్రాప్తించును.ఎందుకనగా !

జగతాం మఙ్గలకరీ=సుఖకరీ మూర్తిర్యస్య తస్మై।**"ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి"** (బృ.4-3-32) **"ఏషహ్యేవానన్దయతి"** (తై.2-7) ఇత్యాదిశ్రుతేః।జగన్మఙ్గలమూర్తయ

ఇత్యనేన స్మృతిమాత్రేణతస్యైహికాముష్మికపురుషార్థపరిపన్థివిఘ్న నిరాససామర్థ్యముక్తమ్; మఙ్గలస్య తాదృశత్వాత్ ॥ ౧ ॥

సచ్చిదానందపరమాత్మయే జగన్మంగళమూర్తి=సర్వజగత్తునకు(సకలప్రాణకోట్లకు)ఆనందమునుప్రసాదించువాడు."ఏతస్యైవానందస్యాన్యానిభూతాని మాత్రాముపజీవన్తి (బృ.౪-3-3౨)"ఏషహ్యేవానందయతి"(తై.౨-౭) ఆనందరూప పరమాత్మనుండియే సర్వప్రాణులకు సుఖములభించుచున్నది.పరమాత్మయొక్కసుఖ లేశముచేతనే జీవులు వారిజీవనమనుగడను సాగించుచున్నారు.ఆపరబ్రహ్మమేసర్వులనుఆనందితులను చేయుచున్నది.ఇత్యాదిశ్రుతులుప్రమాణములుగానున్నవి."జగన్మంగళమూర్తయే"–ఈ పదముచే శ్రీకృష్ణునియందు, అతనియొక్క స్మరణమాత్రముచేతనే పురుషార్థమునకు(మోక్షమార్గమునకు)ప్రతిబంధకములగు- ఈలోకములోగాని,పరలోకములోగాని చేయబడు సర్వవిఘ్నముల(పాపముల)ను నాశనముజేయు సామర్థ్యము గలదని సూచితమగుచున్నది.ఎందుకనగా,మంగళమునకు అట్టి సామర్థ్యము గలదు.

తాత్పర్యము:-ఆస్తికులైన గ్రంథకర్తలు తమయొక్కగ్రంథము నిర్విఘ్నముగా పరిసమాప్తమగుటకై మరియు లోకములోవిపుల ప్రచారము నొందుటకై గ్రంథారంభమున,మధ్యమున మరియు అంత్యమున స్వగురువుయొక్కగాని, స్వేష్టదేవతయొక్కసగుణ లేదా నిర్గుణ స్వరూపమును స్మరిస్తూ, ఆశీర్వాదరూపము

గాని, నమస్కారాత్మకముగాని లేదా వస్తునిర్దేశరూప మంగళ మునుగాని ఆచరించుదురు."నిర్విఘ్న పరిసమాప్తి కామోమంగ ళమాచరేత్"; "మంగళాదీని,మంగళమధ్యాని,మంగళాంతానిచ శాస్త్రాణిప్రథన్తే,వీరపురుషాణ్యాయుష్మత్పురుషాణ్యధ్యేతారశ్చబుద్ధి యుక్తా యథాస్యురితి"ఇత్యాది అనుమితశ్రుతి మరియు మహా భాష్యకారుల వచనానుసారము,సంప్రదాయమును రక్షించుట కై, అట్లే తమ శిష్యులకు ముమ్మందుమంగళమునాచరించవల యునను శిక్షణను (బోధను)గావిస్తూ, గ్రంథకర్తయగుశ్రీలక్ష్మీధర కవీంద్రులు గ్రంథారంభమున స్వఇష్టదేవతయగు "శ్రీకృష్ణునకు నమస్కారాత్మకమంగళమును చేసెను.మంగళముగూర్చి విస్తృత వ్యాఖ్యానమును మేము"శ్రీవృత్తి రత్నావళి"గ్రంథమున భూమిక లోవ్రాసియున్నాము, జిజ్ఞాస గలవారు అక్కడ గనందగును॥౧॥

ఏవమనుష్ఠితస్వేష్టదేవతానమస్కారలక్షణమఙ్గళనిబర్హితసక లాన్తరాయః ప్రథమం"**తత్త్వమసి**"(ఛాం.౬-౮-౭)ఇత్యాది వాక్యై స్తాత్పర్యయుక్తైర్బోధితం ప్రత్యగాత్మనో బ్రహ్మత్వం యుక్త్యాసమ్భా వయన్నాహ—

మొదటిశ్లోకములోతెలిపినట్లుగా శ్రీలక్ష్మీధరకవీంద్రుల వారు స్వఇష్టదేవతా నమస్కారరూప మంగళమునాచరించి, గ్రంథస మాప్తికి తటస్థపడు విఘ్నములను(ప్రతిబంధకములను) నివృత్తి చేసి,ప్రప్రథమమున తత్త్వమస్యాది వాక్యములకు తాత్పర్యభూత (లక్షణావృత్తిచేగమ్య)మగు ప్రత్యగాత్మను=కూటస్థుని యుక్తిపూ

ర్వకముగా పరబ్రహ్మముచే సభేదమును సాధించుచున్నాడు - అహమస్మీతి ॥

**ఆత్మయొక్క స్వరూపము**

**అహమస్మి సదా భామి కదాచిన్నాహమప్రియః ।**

**బ్రహ్మైవాహమతః సిద్ధంసచ్చిదానన్దలక్షణమ్ ॥ ౨ ॥**

**అన్వయః**:-అహం సదా అస్మి;(సదా)భామి;అహం కదాచిత్ అప్రియః న(భవామి; సదా ప్రియ ఏవ భవామి) అతః అహమ్ సచ్చిదానన్దలక్షణమ్ బ్రహ్మ ఏవ (ఇతి) సిద్ధమ్ ॥ ౨ ॥

**అన్వయార్థము**:-అహమ్=అహంకారాది దృశ్యవర్గమునకు సాక్షినగునేను;సదా=మూడుకాలములందు,అస్మి=సత్ స్వరూపముచే విరాజిల్లుచున్నాను. మరియు సదా=మూడవస్థలయందు సాక్షిరూపముచే,భామి=ప్రకాశించుచున్నాను. దుఃఖాద్యనర్థములు సంక్రమించినప్పటికిని అహమ్=వాటికి సాక్షినగు నేను; కదాచిత్=ఎప్పుడుగూడ అప్రియః=అనిష్టరూపుడను;న(భవామి) =కాదు,అతః=ఇందుచేత; అహమ్=నేను; సచ్చిదానందలక్షణమ్ =సచ్చిదానందస్వరూపుడనగు;బ్రహ్మఏవ=బ్రహ్మమునేయని;సిద్ధమ్=(నా)నిశ్చయము.

**టీక**:-అహమస్మీతి॥ అహంకారాదిసాక్ష్యస్మి,సద్రూపో భవామి, ఆత్మన్యధ్యస్తాహంకారాదేః సత్తాప్రదత్వాత్ సదా=అవస్థాత్రయేఽపి భామి,జాగ్రతి దేహేన్ద్రియాదిసాక్షితయా, స్వప్నేఽన్తఃకరణ వాసనాప్రపఞ్చసాక్షితయా,సుషుప్తావజ్ఞానసాక్షితయా చ ప్ర-

కాశే,కదాచిత్=కదాచిదపి,దుఃఖాద్యనుభవకాలేఽపి,అహం నా ఽప్రియో భవామి,నానిష్టో భవామి;కిన్తు సదా ప్రియఏవ భవామి,దుఃఖాదౌ ద్వేషస్యాత్మస్నేహనిమిత్తత్వాచ్ఛత్రుదుఃఖాదౌ ద్వేషస్యాదర్శనాత్,తథా చ పరమప్రీతివిషయత్వాదానన్దరూపః ॥

అహంకారము, మనస్సు,ఇంద్రియములు మొదలగువాటన్నిటికిని ప్రకాశకుడనై,అహంశబ్దమునకు లక్ష్యార్థమగు ప్రత్యగాత్మ(కూటస్థ=సాక్షి)స్వరూపుడనైయున్నాను. ఎందుకనగా! నాయందధ్యస్తములగు అహంకారాదులకు సత్తనుప్రదానము చేయుదును.నాయొక్కసత్తకంటెవ్యతిరిక్తముగ అహంకారాది సర్వ అనాత్మపదార్థములకు స్వతంత్రసత్త లేదు.కావున,నేను సదా= మూడుకాలములలో విద్యమానమైసద్రూపుడనైయున్నాను.అట్లే, అవస్థాత్రయమును ప్రకాశిస్తూ సదా చిద్రూపుడనైయున్నాను. ఎట్లనగా!జాగ్రత్తుయందు దేహేంద్రియాదులకుసాక్షినై, స్వప్నమునందు అంతఃకరణగతవాసనలచే కల్పితప్రపంచమునకు సాక్షినై మరియు సుషుప్తియందు అజ్ఞానమునకు సాక్షిరూపుడనై ప్రకాశించుచున్నాను.

జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాతే !
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే॥
త్రిషుధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్ ।
తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదా శివః ॥

నేను కదాచిత్=దుఃఖాద్యనుభవకాలములోగూడ అప్రియు

డను=అనిష్టరూపుడను కాదు. మరేమనగా ఎల్లప్పుడూ ప్రియస్వ రూపుడనైయున్నాను.దుఃఖాదులు సంప్రాప్తించినపుడు,ఇవి నష్ట మగుగాక!అని వాటిపట్ల యేద్వేషము కలుగుచున్నదో,అది ఆత్మ యందలి నిరతిశయప్రీతి మూలముగా కలుగుచున్నది. కాని, కేవలదుఃఖమును ద్వేషించుటలేదు.ఎందుకనగా!శత్రుదుఃఖము ను ద్వేషించుటలేదు గదా!ఈ సమగ్ర హేతువులచే నేను పరమ ప్రీతికి విషయమై, ఆనందరూపుడనై యున్నాను.॥ ఇతి సిద్ధమ్ ॥

యస్మాత్ కాలత్రయేఽప్యబాధ్యమానత్వాత్ సద్రూపః,ప్రకా శమానత్వాచ్చిద్రూప;పరమప్రీతీవిషయత్వాదానన్దరూపశ్చ,తస్మా దహం సచ్చిదానన్దలక్షణం=సచ్చిదానన్దస్వరూపం బ్రహ్మేతి సి ద్ధమ్ ॥

ఈప్రకారముగా, మూడుకాలములలో బాధింపబడనందు న నేను సద్రూపుడను.

సత్యత్వం బాధరాహిత్యం జగద్బాధైకసాక్షిణః।

బాధఃకింసాక్షికో బ్రూహి నత్వసాక్షికఇష్యతే ॥(వే.పం.౩-౨౯)

మూడవస్థలను ప్రకాశించుచుండుటవలన చిద్రూపుడను.

చిద్రూపత్వాదకర్మత్వాత్స్వయంజ్యోతిరితి శ్రుతేః ।

ఆత్మనఃస్వప్రకాశత్వం కోనివారయితుం క్షమః॥(చిత్సుఖీ.౧-౩)

మరియు పరమప్రీతికి విషయమగుటవలన ఆనందరూపు డనైయున్నాను.

ఇయమాత్మా పరానన్దః పరప్రేమాస్పదం యతః ।

మానభూవంహిభూయాసమితి ప్రేమాత్మనీక్షతే॥(వే.పం.౧-౮)

ఇట్టి అనుభవమునుబట్టి సచ్చిదానంద లక్షణము(స్వరూపము)గల నేనే సచ్చిదానందలక్షణముగల బ్రహ్మమునై యున్నాను. ఇది నా నిశ్చయము.

అత్రేదమనుమానంవివక్షితమ్ । ప్రత్యగాత్మా బ్రహ్మణోనభిద్యతే, సచ్చిదానన్దరూపత్వాత్,బ్రహ్మవదితి,నచ హేతురసిద్ధిః,అహమస్మీత్యాదినా తస్య సాధితత్వాత్ ॥

ఇచ్చట ఈఅనుమానప్రయోగము చేయవలెను.ప్రత్యగాత్మ బ్రహ్మముకంటె భిన్నము కాదు(ప్రతిజ్ఞావాక్యము); సచ్చిదానంద స్వరూపమున్నందువలన(హేతువాక్యము);బ్రహ్మమువలె దృష్టాంతము). ఇచ్చట సచ్చిదానందత్వమను హేతువు అసిద్ధముకాదు. ఎందుకనగా!"అహమస్మి"యనువాక్యముచేసిద్ధమైనందువలన.

నన్వనుమానస్య నాఽహమీశ్వర ఇతి ప్రత్యక్షవిరోధ ఇతి చేత్,న తావదాత్మనో బ్రహ్మత్వేబాహ్యాప్రత్యక్షవిరోధః,ఆత్మనిరూపాద్యభావేన బాహ్యస్య తత్రాఽప్రవృత్తేః, నాఽపి మానసప్రత్యక్ష విరోధః, మనసో మనఃసాక్షిణ్యాత్మని ప్రవృత్తేరసమ్భవాత్ ॥

శంక:-"నేను ఈశ్వరుడను కాదు" అను ప్రత్యక్ష జ్ఞానముచే ప్రత్యగాత్మ బ్రహ్మల అభేదమునందు విరోధము కనబడుచున్నది గదా!

సమాధానము:-ఆత్మ,బ్రహ్మముల కభేదమునందు బాహ్య ప్రత్యక్ష విరోధమేమియు లేదు. ఏలయన, ఆత్మయందు రూపాదుల అభావమున్నందున, దానియందు బాహ్యప్రత్యక్ష ప్రవృత్తి సంభవించదు.**"అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్"**(కఠ.౧-౩-౧౫);**"యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి"**(కేన.౧-౭); **"యచ్ఛ్రోత్రేణ నశ్రుణోతి"**(కేన.౧-౮);**"నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా"**(కఠ.౨-౩-౧౨)ఇత్యాది.

మానసప్రత్యక్షమునకుగూడ విరోధములేదు.ఎందుకనగా! మనస్సాక్షియగు ఆత్మయందు మనోగతి(ప్రవృత్తి) అసంభవము. **"యతోవాచో నివర్తన్తే"**(తై.౨-౪/౯);**"యన్మనసా న మనుతే"** (కేన.౧-౬);ఇత్యాది.

నను జీవేశ్వరౌభిన్నౌ,కిఞ్చిజ్జ్ఞత్వసర్వజ్ఞత్వాదివిరుద్ధ ధర్మాధారత్వాత్,దహనతుహినవత్,ఇత్యాద్యనుమానవిరోధ ఇతిచేత్, న,విరుద్ధధర్మవతోర్బిమ్బప్రతిబిమ్బయో,రుచ్ఛమన్దశబ్దాధార ఆకాశే చ వ్యభిచారాత్ ।

శంక:-జీవేశ్వరులుభిన్నులు(ప్రతిజ్ఞా);అల్పజ్ఞత్వసర్వజ్ఞత్వాది విరుద్ధధర్మములకాశ్రయమున్నందున(హేతువు); అగ్ని మరియు మంచుగడ్డలవలె(దృష్టాంతము)ఈఅనుమానముచే"ప్రత్యగాత్మా బ్రహ్మణోనభిద్యతే"అను అనుమానమునకువిరోధమున్నదిగదా!

సమాధానము:- విరోధమేమియును లేదు. ఎందుకనగా, బింబత్వ ప్రతిబింబత్వరూప పరస్పర విరుద్ధ ధర్ములుండియు,

ఈరెండు విరుద్ధధర్మములు ఒకేధర్మి(ఆధారము)అగు గ్రీవస్థము ఖమునందు ఉంటున్నవి. అట్లే,మందశబ్దము,ఉచ్ఛశబ్దములకు పరస్పరభేదమున్నప్పటికిని ఒకే ఆధారమగు ఆకాశమునందు ఉంటున్నవి. ఈరెండు ఉదాహరణములందు, పూర్వపక్షియొక్క "విరుద్ధధర్మాధారత్వాత్"అను హేతువు వ్యభిచారమైనది(అనిశ్చి తమైనది) .

నను,**"ద్వాసుపర్ణా"**(ముం.౩-౧-౧;శ్వే.౪-౬)ఇత్యాది శ్రుతివి రోధ ఇతిచేత్ ।న,తస్యా అతత్పరత్వేన తత్త్వమస్యాది శ్రుత్యా బా ధ్యమానత్వాత్।

శంక:-"ప్రత్యగాత్మా బ్రహ్మణోనభిద్యతే"అను మీ (సిద్ధాంతి) యొక్క అనుమానమునకు ప్రత్యక్ష, అనుమానముల విరోధము లేనప్పటికినీ"ద్వాసుపర్ణా"ఇత్యాదిశ్రుతులచే విరోధమేర్పడుచున్న ది గదా! ఎందుకుంటే, సకలప్రమాదములకంటే ప్రబలమగు శ్రుతిచేతనే జీవేశ్వరులకు భేదము ప్రతిపాదించబడినది.

సమాధానము:-విరోధము లేదు. ఎందుకనగా, శ్రుతిమాత కు జీవబ్రహ్మల భేదమును ప్రతిపాదించుటయందు తాత్పర్యము లేదు.తత్త్వమస్యాదితాత్పర్యయుక్త బలవత్ శ్రుతులచేత," ద్వాసు పర్ణా"అను భేదశ్రుతి దుర్బలముగాన బాధింపబడుచున్నది.కావు న, మా అనుమానమునకు శ్రుతివిరోధమేమియును లేదు.

తస్మాన్నాహమీశ్వర ఇతి బుద్ధిర్దేహాద్యుపాధినిమిత్తా భ్రాన్తిః । న తు జీవస్వరూప విషయా। తదుక్తమ్ –

**"త్వయిమయిచగణ్యమానేమశకాన్మశకోఽహమేవదేహదృశా ।విశ్వాధికేశ తే మే సద్బోధానన్దపూర్ణతా తుల్యా"**॥ఇతి॥అతోఽహం బ్రహ్మైవేతి భావః ॥ ౭ ॥

అందువలన, "నాహమీశ్వరః"నేను ఈశ్వరుడను కాదు - అను బుద్ధి దేహాద్యుపాధిని పురస్కరించుకొని కలుగుట వలన భ్రాంతియేయగును. ఇది శుద్ధజీవుని విషయముచేయుట లేదు. ఈ విషయములో ఇట్లు చెప్పబడినది–ఒకవేళ దేహదృష్టిచేత నీ యొక్క మరియు నాయొక్క గణన(తులన)చేసినచో,నేనొక దోమకంటెగూడ తుచ్ఛమైనవాడను. కాని, సంపూర్ణ విశ్వముకంటె గూడ శ్రేష్ఠుడవగు నో పరమేశ్వరా!సద్బోధానందపూర్ణత్వముచే నీవు,నేను సమానులమే.భేదము లేశమాత్రమును లేదు.పై సమగ్ర వివేచనముద్వారా"నేను బ్రహ్మమునే" అను-నిశ్చితాభిప్రాయము నిష్పన్నమైనది॥౨ ॥

నను,**"యఃసర్వజ్ఞః సర్వవిత్"**(ము౦.౧-౧-౯)ఇత్యాది శ్రుత్యా హి బ్రహ్మ సర్వజ్ఞతయావగమ్యతే,**"యతోవా"**(తై.౩-౧) ఇత్యాది శ్రుత్యా చ సర్వజగత్కారణతయా చ, ప్రత్యగాత్మా తు స్వశరీరాదికమపి సాకల్యేన న జానాతి, స్వాతన్త్ర్యేణ కించిత్ కర్తుమపి న శక్నోతి,తత్కథమస్య సర్వజ్ఞేన సర్వకారణేన చ బ్రహ్మణాభేద ఇత్యాశఙ్క్య, ప్రత్యగాత్మనోఽపి తద్ద్వయముపపాదయతి —

రెండవశ్లోకములో ఆత్మ సచ్చిదానంద(లక్షణము)స్వరూపమున్నది మరియు బ్రహ్మముగూడ''సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ''

(౨-౧-౧);''విజ్ఞానమానందంబ్రహ్మ''(బృ.౩-౯-౩౪);''ఆనందోబ్రహ్మేతి వ్యజానాత్''(తై.౩-౬) ఇత్యాది శ్రుతులచే సచ్చిదానందస్వరూపము గా తెలియబడుచున్నందున,ఆత్మ,బ్రహ్మరూపమేయని చెప్పబడి నది.కాని,''యఃసర్వజ్ఞఃసర్వవిత్''(ము౦.౧-౧-౯);మరియు''యతో వా ఇమాని భూతాని''(తై.౩-౧);ఇత్యాదిశ్రుతులచే బ్రహ్మము స ర్వజ్ఞము మరియు సర్వజగత్కారణము-అని తెలియబడుచున్న ది.ప్రత్యగాత్మఅయితే తనశరీరమునుగూడ పూర్ణరూపముచేయె ఱుగజాలదు మరియు స్వతంత్రముగా ఏమియు చేయజాలదు. ఇట్లున్నచో, ఇతనికి మరియు సర్వజ్ఞ, సర్వకారణ బ్రహ్మముచే అభేదమెట్లు సంభవించును? ఇట్లు శంక ప్రాప్తము కాగా, ప్రత్య గాత్మయందుగూడ సర్వజ్ఞత్వము, సర్వకారణత్వమును ఉపపా దనము(తర్కముచే స్థాపనము)చేయుచున్నాడు-మయ్యేవోదేతి చిద్వ్యోమ్నీతి :—

**మయ్యేవోదేతి చిద్వ్యోమ్ని జగద్గన్ధర్వపత్తనమ్।**

**అతోఽహం న కథం బ్రహ్మ సర్వజ్ఞం సర్వకారణమ్** ॥౩॥

**అన్వయః :—**చిద్వ్యోమ్ని మయిఏవ జగత్ గంధర్వ పత్తనమ్ ఉదేతి।అతః అహం సర్వజ్ఞమ్ సర్వకారణమ్ బ్రహ్మ కథమ్ న (భవామి) ?

**అన్వయార్థము:-**చిద్వ్యోమ్ని=చిదాకాశరూప(మయిఏవ=ప్ర త్యగాత్మయగునాయందే;జగద్గంధర్వపత్తనమ్=జగద్రూపగంధర్వ నగరము;ఉదేతి=అజ్ఞానముచేనుత్పన్నమయినట్లుప్రతీతమగుచు

న్నది, అతః=ఇందువలన;అహమ్=నేను;సర్వజమ్=సర్వజ్ఞము; సర్వకారణమ్=మరియు సర్వకారణమగుబ్రహ్మమును ఎందుకు కాను?(అవశ్యముగా నేను బ్రహ్మమునే అగుదును).

**టీకా:**–చిద్వ్యోమ్ని=చిదాకాశేమయిప్రత్యగాత్మన్యేవ జగద్గన్ధర్వపత్తనం=జగదేవగన్ధర్వపత్తనమ్,ఐన్ద్రజాలికవిక్షుబ్ధమాయయాఽఽవరణావస్థాయాంచ మేఘేషుప్రతీయమానంనగరం–గన్ధర్వపత్తనం నామ,తాదృశమిదం జగదుదేతి=ఉత్పద్యత ఇత్యర్థః।

చిదాకాశరూప ప్రత్యగాత్మయగు నాయందే జగద్గంధర్వపత్తనమ్=ఈజగద్రూపగంధర్వనగరముత్పన్నమై,ఇంద్రజాలికునిచే ప్రదర్శింపబడు మాయికనగరమువలె,మేఘములయందు వస్తుతః లేని నగరము కనుపించునట్లు,ఆత్మమాయా(ఆవరణ)యోగముచే భ్రాంతిచే ప్రతీతమగుచున్నది. ముఖ్య సిద్ధాంతరీత్యా పరమార్థతః జగత్తు ఉత్పన్నమే కాలేదు.

న నిరోధో న చోత్పత్తిః నబద్ధోనచసాధకః ।

న ముముక్షుర్నవై ముక్తః ఇత్యేషా పరమార్థతః॥(మాం.కా)

అయం భావ:–మిథ్యాపదార్థస్య హి ద్రష్టైవోపాదానమ్,యథా స్వప్నప్రపఞ్చస్య తత్సాక్షీ,తథా జాగ్రత్ప్రపఞ్చస్యాపి సర్వస్య దృశ్యత్వేన మిథ్యాత్వాత్ తద్ద్రష్టా ప్రత్యగాత్మైవో పాదానమితి వక్తవ్యమ్ ।తదుక్తమ్–**యథా స్వప్నప్రపఞ్చోఽయం మయి మాయా విజృమ్భితః ।ఏవం జాగ్రత్ప్రపఞ్చశ్చ మయి మాయా విజృమ్భితః** ॥(సర్వదర్శనసంగ్రహః-పాణినీయదర్శనాంతే)**ఇతి** ॥ఏవం చ ప్రత్యగా

త్మనస్తద్ద్రష్టృత్వలక్షణం సర్వజ్ఞత్వం తదధిష్ఠానత్వలక్షణం సర్వకారణత్వం చ సిధ్యతి ॥

తాత్పర్యమేమనగా, ఎట్లు స్వప్నప్రపంచమునకు ద్రష్టయే (సాక్షియే)ఉపాదానమగునో,అట్లే సకలమిథ్యాపదార్థములకు ద్రష్టయే ఉపాదానమగును. ఈ నియమానుసారము జాగ్రత్ప్రపంచము దృశ్యమగుటవలన మిథ్యయేయగును. ఇట్టి మిథ్యాజగత్తునకు(సంపూర్ణజాగ్రత్ప్రపంచమునకు)ద్రష్టయగు ప్రత్యగాత్మ(సాక్షి)యే ఉపాదాన కారణమని చెప్పవలసియుండును.

ఈవిషయంలో ఇట్లు అభియుక్తోక్తిగలదు:-ఎట్లు, మాయచే స్వప్న ప్రపంచము నాయందు ఉత్పన్నమై ప్రతీతమగుచున్నదో అట్లే,ఈజాగ్రత్ప్రపంచముగూడ నాయందే మాయచేతఉత్పన్నమై ప్రతీతమగుచున్నది.కావున,ప్రత్యగాత్మకు జగత్సాక్షిత్వరూప సర్వజ్ఞత్వము మరియు వివర్తోపాదానత్వ(అధిష్ఠానత్వ)రూప సర్వకారణత్వము సిద్ధించుచున్నది.

నను,బహుదూరవ్యవహితదేశవర్తిమేర్వాదీనామదృశ్యమానానాం కథం ప్రత్యగాత్మా ద్రష్టా కథం వా తదుపాదానమితి చేత్,శృణుతర్హి రహస్యమ్-'ఏతావన్తం కాలం మేర్వాదికమహం నాజ్ఞాసిషమ్'ఇతి హ్యజ్ఞానవిశేషణతయా మేర్వాదికం స్మర్యతే; తచ్చ స్మరణం మేర్వాద్యనుభవంవినాఽనుపపద్యమానం సన్మేర్వాద్యనుభవం కల్పయతి,తత్ర చేన్ద్రియాదీనామప్రవృత్తేః, ప్రత్యగాత్మచైతన్యేఽధ్యస్తతయైవ మేర్వాద్యనుభవో వక్తవ్యః ।అధ్యస్తస్య

చాధిష్ఠానమేవోపాదానం తద్భానాదేవ చ భానం భవతి ।తథా చ ప్రత్యగాత్మా స్వాధ్యస్త మేర్వాదేరప్యజ్ఞాత తయాసాక్షీ,తదుపాదానంచ భవతి ।తదుక్తం(సూతసంహితాబ్రహ్మగీతాయాం ౬-౪) **"జ్ఞాతరూ పేణ చాజ్ఞాతస్వరూపేణ చ సాక్షిణః । సర్వం భాతి తదాభాతి తతస్తద్వ్యాపి సర్వదా"**ఇతి ॥

శంక:-అత్యంతదూరదేశములో పరోక్షముగానున్నఅదృశ్యమాన మేరుపర్వతాది పదార్థములకు ప్రత్యగాత్మ సాక్షి యెట్లగును? మరియు ఉపాదానమెట్లగును?

సమాధానము:-ప్రత్యగాత్మకు జగత్తుయొక్క ద్రష్టృత్వము మరియు ఉపాదానత్వము చెప్పుటలో ఈరహస్యమున్నది. ఏమనగా! ఒకానొక పురుషుని మేరుపర్వతము దగ్గరకు తీసుకెళ్ళి, ఏమయ్యా!ఇంతదనుక నీవు మేరుపర్వతముగూర్చి వినియుంటివి గదా!ఇదిగో,ఇదియే ఆమేరుపర్వతము-చూడుము,అని-చెప్పినచో,అప్పుడు ఆపురుషుడు ఇట్లుచెప్పును-''ఇంతకాలము పర్యంతము మేరుపర్వతమును నేనెఱుగకుంటిని(తెలియనైతిని)''.మేరుపర్వతమునకుసంబంధించిన ఆఅజ్ఞానము ప్రత్యక్షమా?లేక స్మృతిరూపమా? వర్తమాన కాలమందైతే మేరుపర్వతముయొక్క అజ్ఞానములేదు.కావున, ప్రత్యక్షముకాదు.ఎందుకనగా!ఇప్పుడు ప్రత్యక్షజ్ఞానమునకు మేరుపర్వతమేవిషయమగుచున్నది. అందువలన,''ఇంతకాలము పర్యంతము మేరుపర్వతమును నేను తెలియకుంటిని''-అను జ్ఞానము స్మృతిరూపము-అని అవశ్యముగా చెప్పవలయును.

స్మృతిజ్ఞానము నియమముచే పూర్వానుభూత విషయము నకు సంబంధించినదైయుండును.అననుభూత విషయముయొ క్క స్మృతి ఎవరికిని ఎప్పుడునూ కలుగదు.కావున, ఎందువల్లనై తే''ఇంతకాలము పర్యంతము మేరుపర్వతమును నేను తెలియ కుంటిని''అనునది స్మృతియేయగునో,అందువల్ల ఈస్మృతి కలు గుటకు పూర్వకాలమున మేరుపర్వతముయొక్క జ్ఞానము,''అ జ్ఞానవిశిష్టమై''యుండెనని అవశ్యముగాఅంగీకరించాలి.ఇప్పు డు అజ్ఞానమను విశేషణముతో యుక్తమగు మేరుపర్వతము (విశేష్యము)పట్ల ఇంద్రియముల (ప్రత్యక్షప్రమాణముల) ప్రవృత్తి క లుగదు. ప్రత్యగాత్మయందు అధ్యస్తమగు మేరుపర్వతముయొక్క అనుభవము ప్రత్యగాత్మకే యుండును.ఎవరికి అనుభవముం డునో వారికే కాలాంతరములో స్మృతికలుగును-ఇది సర్వలోక ప్రసిద్ధము. ఒకరి అనుభవముయొక్క స్మృతి వేరొకరికి కలుగదు గదా!

''ఇంతకాలము పర్యంతము మేరుపర్వతమును నేనెఱుగ కుంటిని.మరియు ఇప్పుడు మేరుపర్వతమును నేనెఱుగుదును''. ఇచ్చట నేను'తెలియకుంటిని''తెలియుదును' అను జ్ఞానమునకు విషయము ఒకే మేరు పర్వతము. ఇది నిర్వివాదము.

ఇది మేరుపర్వతమను ప్రత్యక్షజ్ఞానమునకు విషయము మే రుపర్వతము.''ఇంతకాలముపర్యంతముమేరుపర్వతమునునేను తెలియకుంటిని''అనుస్మృతిజ్ఞానమునకుగూడ విషయము మేరు

పర్వతమే.ప్రత్యక్షజ్ఞానములోమేరుపర్వతము‘జ్ఞాతత్వము’చే;మరియు స్మృతిజ్ఞానములో‘అజ్ఞాతత్వము’చే తెలియబడుచున్నది.

మేరుపర్వతము జగత్తుయొక్క అంతర్గతమున్నది. కావున, మేరుపర్వతముచేఉపలక్షణముగా సంపూర్ణజగత్తును గ్రహించవలెను. ఎందువల్లనైతే బ్రహ్మావ్యతిరిక్త జగదాదిసర్వపదార్థములకు అధిష్ఠానము(ఉపాదానము)ప్రత్యగాత్మయేఉన్నదో,మరియు “తమేవబాన్తమనుభాతి సర్వం,తస్యభాసా సర్వమిదం విభాతి” (శ్వే.౬-౧౪;కఠ.౨-౨-౧౫;ముం.౨-౨-౧౦)దానియొక్క ప్రకాశముచేతనే జగత్తు ప్రకాశింపబడుచున్నదో, అందువల్లనే తనయందు అధ్యస్తమైన మేర్వాదులకు అజ్ఞాతత్వముచే ప్రత్యగాత్మ, సాక్షి=ద్రష్టయై,ఉపాదానముగూడ ఉన్నది. బ్రహ్మగీతలోగూడ ఇట్లు చెప్పబడినది-జ్ఞాతరూపముచే మరియు అజ్ఞాతరూపముచే సాక్షికి సర్వపదార్థములుతెలియబడును.అట్లే,సాక్షిప్రకాశములోనే సర్వపదార్థములుప్రకాశింపబడును.కావున,“మయాతత మిదం సర్వం”(గీత.౯-౪)సర్వపదార్థములలో సాక్షియొక్కవ్యాప్తిగలదు.సువర్ణమునందు కల్పింపబడినఆభరణములలోబంగారమే ఎట్లు వ్యాప్తమైయుండునో, అట్లే, ప్రత్యగాత్మయందు అధ్యస్త జగదాది సకల పదార్థములలో అధిష్ఠాన(ఉపాదాన)మగు ప్రత్యగాత్మయే వ్యాప్తమైయున్నది.

తథా చ ప్రత్యగాత్మా సర్వజ్ఞః సర్వకారణం చేతి ।యత ఉక్త ప్రకారేణ సర్వజ్ఞం సర్వకారణం చాహమతః కథం తద్రూపం

బ్రహ్మ న భవామి? భవామ్యేవేత్యర్థః ॥ ౩ ॥

పై సమగ్ర విచారముచే ప్రత్యగాత్మ,సర్వజ్ఞము మరియు సర్వకారణమని సిద్ధించినది.కావుననే, నేను సర్వజ్ఞము మరియు సర్వకారణమగు బ్రహ్మస్వరూపుడను ఎందుకు కాదు. తప్పకుండా నేను బ్రహ్మమునే అగుదును॥౩ ॥

## ఆత్మయొక్క అవినాశిత్వము

నను **"నిత్యంవిభుంసర్వగతం సుసూక్ష్మమ్"**(ముం.౧-౧-౬) ఇత్యాద్యుపనిషత్సు నిత్యంబ్రహ్మ శ్రూయతే, ఆత్మా చ మరణాది ధర్మకత్వాదనిత్య ఏవానుభూయతే। తతశ్చ న తయోరైక్యమిత్యాశఙ్క్య, కిమాత్మనో బౌద్ధపక్ష ఇవ స్వతఏవ నాశం బ్రవీషి?ఉత దణ్డసంయోగాద్ఘటస్యేవాన్యసంబన్ధాదాత్మనో నాశంబ్రవీషి?అథ వా, పటనాశాత్పటగతరూపాదివదాశ్రయనాశాన్నాశం బ్రవీషి? ఇతి వికల్ప్యాద్యం ప్రత్యాహ —

''నిత్యంవిభుం సర్వగతంసుసూక్ష్మమ్''(ముం.౧-౧-౬) ఇత్యాద్యుపనిషత్తులలో బ్రహ్మమునిత్యము=అవినాశి=మరణధర్మరహితము అని వినబడుచున్నది.మరియు ఆత్మయో మరణాదిధర్మములుకలిగియున్నందున అనిత్యమని ప్రత్యక్షఅనుభవమున్నది. కావున, బ్రహ్మాత్మల ఏకత్వము (అభేదము) సంభవించదు. ఇట్లు శంక పాప్తముకాగా,సమాధానము చెప్పుటకై ఆత్మనాశనమునకు సంబంధించిన మూడువికల్పములుచేసి,శంకాకారుని అడుగుచున్నాడు.

౧.బౌద్ధమతమునందుక్షణికవిజ్ఞానరూప బుద్ధిని ఆత్మ అని స్వీకరించి, అది ప్రతిక్షణము నిర్నిమిత్తముగా నాశన మౌతుం దని చెప్పుదురు. ఆ విధంగా ఏనిమిత్తము లేకుండానే స్వతః (స్వభావతః) ఆత్మనాశనమును చెబుతున్నావా?

౨.దండ(కర్ర)ప్రహారముచే ఘటనాశమువలె,న్యాయమతరీత్యా అన్యపదార్థ సంబంధముచే ఆత్మనాశము చెప్పుచుంటివా?

౩.పట(వస్త్ర)నాశముచే పటగత(పటాశ్రిత)నీలపీతాది రూపము నాశనమైనట్లు, ఆత్మకు యేదోఒక ఆశ్రయమును చెప్పి, ఆ ఆశ్రయము నాశనమైతే తదాశ్రిత ఆత్మ నాశనమౌతుంది-అని చెప్పుదువా?

ఇట్లు వికల్పించి, ఖండనపూర్వకముగా ఉత్తరమిస్తున్నాడు-

**న స్వతః ప్రత్యభిజ్ఞానాన్నిరంశత్వాన్న చాన్యతః ।**

**నచాశ్రయవినాశాన్మే వినాశఃస్యాదనాశ్రయాత్ ॥ ४ ॥**

**అన్వయః :-**మే వినాశః ప్రత్యభిజ్ఞానాత్ స్వతో న(స్యాత్); చ నిరంశత్వాత్ అన్యతః న(స్యాత్);చ అనాశ్రయాత్ ఆశ్రయవినాశాత్ (మే వినాశః) న(స్యాత్)॥ ४ ॥

**అన్వయార్థము:-**మే=నాయొక్క;వినాశః=వినాశనము; ప్రత్యభిజ్ఞానాత్=ప్రత్యభిజ్ఞానము కలుగుచున్నందున;స్వతః=స్వయముగా,న(స్యాత్)=సంభవించదు; చ=మరియు;నిరంశత్వాత్= అంశరహితమగుటచే, అన్యతః=అన్యపదార్థముచేత; న(స్యాత్)= నాశనము సంభవించదు.చ=మరియు; అనాశ్రయాత్=ఆశ్రయ

హీనమగుటచే, ఆశ్రయవినాశాత్=ఆశ్రయనాశనమువలన; న (స్యాత్) = (నాకు=ఆత్మకు) నాశనములేదు.

**టీకా:**-ఆద్యం ప్రత్యాహ—న స్వతః ప్రత్యభిజ్ఞానాత్,ఇతి-

ప్రత్యగాత్మనో మే=మమ న స్వతో నాశో భవతి । తత్ర హేతు:-**ప్రత్యభిజ్ఞానాత్,**ఆత్మనఃప్రత్యభిజ్ఞాయమానత్వాత్।ప్రత్యభి-జ్ఞానంనామ,పూర్వమనుభూతస్యకాలాన్తరే ప్రమాణేన తత్తోల్లేఖ పూర్వకంజ్ఞానమ్ ।ఆత్మా హి"యోఽహంబాల్యే పితరావన్వభూవం సఏవేదానీంస్థావిరే ప్రణప్తృననుభవామి,యోఽహం సుప్తః స్వప్నమద్రాక్షం స ఏవేదానీం జాగర్మి"ఇతి బాల్యాద్యవస్థాసు, జాగ్రదాద్యవస్థాసు చ యాప్రత్యభిజ్ఞా జాయతే । తచ్చ ప్రత్యభి-జ్ఞానమాత్మనో నిర్నిమిత్తనాశే నోపపద్యతే । తథాహి—ఆత్మనో హి స్వతోనాశే ప్రతిక్షణమన్యోఽన్య ఆత్మేతివక్తవ్యమ్ । తత్ర కథం వాన్యోఽన్యేన'సోఽహమ్'ఇతిప్రత్యభిజ్ఞాయేత?ఆత్మాచ సోఽహమ్ ఇత్యాత్మానం ప్రత్యభిజానాతి । తస్మాన్న తస్య స్వతో నాశ ఇత్యర్థః ।

ప్రత్యగాత్మనగు నాకు బౌద్ధపక్షమువలె స్వాభావిక నాశనము సంభవించదు.కారణమేమనగా,ఆత్మయొక్క ప్రత్యబిజ్ఞానము కలుగుచున్నందున. ప్రత్యభిజ్ఞానమనగా! పూర్వానుభూత పదార్థములయొక్క కాలాంతరములోకలుగు స్మృతిపూర్వక ఇంద్రియజన్య ప్రత్యక్షజ్ఞానము. (మానసోల్లాసము 7-3) —

భాతస్య కస్యచిత్పూర్వం భాతమానస్య సాంప్రతమ్ ।

సోఽయమిత్యనుసంధానం ప్రత్యభిజ్ఞానముచ్యతే ॥

ఉదా:-"బాల్యావస్థలో యేనేను మా తల్లిదండ్రులను చూచి యుంటినో,ఆనేనే యీవృద్ధావస్థలో నామనుమలను చూచుచు న్నాను". "యే నేనైతే ఇంతకాలము స్వప్నము చూచితినో, ఆ నేనే యిప్పుడు జాగ్రత్తును చూచుచున్నాను".బాల్యావస్థయొక్క మరియు సుషుప్త్యవస్థయొక్క అనుభవముల ప్రత్యభిజ్ఞా-కాలాం తరములో కలుగుట సర్వలోక ప్రసిద్ధము. ఈప్రత్యభిజ్ఞా బలము చేత ఆత్మ నిర్నిమిత్తముగా (స్వాభావికముగా) నాశనమగునని చెప్పుట అసంభవమౌతుంది.ఒకవేళ ఆత్మ ప్రతిక్షణమున నశిం చునని స్వీకరించినచో,ప్రతిక్షణములో ఆత్మభేదమును అంగీక రించవలసియుండును. మరియు ప్రతిక్షణమున భిన్నభిన్న ఆత్మ లను స్వీకరించినచో బాల్యావస్థలో తల్లిదండ్రుల అనుభవము ను పొందిన ఆత్మకంటె, వృద్ధావస్థలో మనుమల అనుభవము ను పొందుచున్న ఆత్మను వేరుగా చెప్పవలసి యుండును. అట్టి భిన్నమైన ఆత్మలకు "బాల్యావస్థలో యేనేనైతే మా తల్లిదండ్రు లనుచూచితినో(అనుభవించితినో),ఆనేనే ఇప్పుడు వృద్ధావస్థలో మనుమలనుచూచుచున్నాను(అనుభవించుచున్నాను)"-అను ప్ర త్యభిజ్ఞానము ఎట్లు కలుగును? కాని, "ఆ నేనే,ఈ నేను" అను ప్రత్యభిజ్ఞానమైతే కలుగుచున్నది. కావున, ప్రత్యగాత్మకు స్వతః (స్వయముగా) నాశనము లేదు - అని సిద్ధమైనది.

నిరంశత్వాన్నచాన్యతః॥నిరంశత్వాదంశరహితత్వాన్నిరవ

యవత్వాత్,అన్యతో హేతుసంయోగాదప్యాత్మనో న నాశ ఇత్య ర్థః। ఆత్మాహి చిద్రూపత్వాన్నిరవయవః । యది చిద్రూపస్యాత్మనః సావయవత్వముచ్యేత తర్హి వక్తవ్యమ్, ఆత్మావయవాశ్చేతనాఅ చేతనావా?నాద్యః,ఆత్మావయవానాం హి ప్రత్యేకం చేతనత్వే, విరుద్ధాభిప్రాయతయా శరీరమున్మథ్యేత ।నద్వితీయః, అచేతనై రవయవైరారబ్ధస్యాత్మనోऽప్యచేతనత్వప్రసఙ్గాత్;నహి అచేతనై స్తన్తుభిరారబ్ధః పటశ్చేతనో దృశ్యతే, తతో నిరవయవ ఏవాత్మా ।నిరవయవేచాత్మని హేతుసంయోగో న సంభవతి,తస్యైకదేశ వృత్తిత్వాత్ ।అతోऽన్యతోప్యాత్మనో న నాశ ఇతి భావః ।

ఆత్మ నిరంశము=అంతహీనము అనగా నిరవయవము న్నందున అన్యహేతుసంయోగముచేతగూడ ఆత్మ నశించదు. ఆత్మ చిద్రూపము(జ్ఞానస్వరూపము)గాన నిరవయవమున్నది. ఒకవేళ చిద్రూప ఆత్మను సావయవము-అని చెప్పినచో, ఆత్మ యొక్క అవయవము చేతనమా? లేక అచేతనమా (జడమా) ? చేతనమనుట సంభవించదు.ఎందుకనగా,ఆత్మయొక్క ప్రతి అవ యవము చేతనమైనచో, విరుద్ధాభిప్రాయముగలవగుటచే, శరీ రముఉన్మథనమగును(నశించిపోవును).ఇక,అచేతనములనుట గూడ సంభవించదు.ఎందుకంటే,అచేతనావయవముల కలయి కచే నేర్పడిన ఆత్మకు చేతనత్వమెట్లు సంభవము? అచేతనావ యవములచే(తంతువులచే)తయారైన పటము(వస్త్రము) చేతన ముగా ఎక్కడనూ అగుపడుట లేదు గదా! అందువలన, ఆత్మ నిరవయవమేయని స్వీకరించదగును.నిరవయవమగు ఆత్మతో

హేతుసంయోగము సంభవించదు.ఎందుకనగా,సావయవపదా ర్థముల సంయోగము అవ్యాప్యవృత్తి గలదైయుండును-అనగా ఏకదేశములోఉండును.వృక్షాగ్రముననున్న కపి వృక్ష సంయోగ ము వృక్షమూలమున లేదుగదా!కావున, నిరవయవమగు ఆత్మ అన్యసంయోగముచే నాశనమగుట సంభవించదని భావము.

నాపి తృతీయ ఇత్యాహ— ఆశ్రయవినాశాదాధారవినాశా దపి మే=మమ వినాశోనస్యాత్ । కుతః?అనాశ్రయాత్–ఆశ్రయ స్యాధారస్యాభావాత్।ఆత్మాహి గుణక్రియాజాత్యాదిష్వన్యతమత్వా భావాదనాశ్రయః,నిరవయవత్వాచ్చ నాపి ఘటాదివదాశ్రయః ।అత ఆశ్రయనాశాదప్యాత్మనో న నాశః ।

మూడవ వికల్పముగూడ నిలువజాలదు.ఎందుకు? ప్రత్య గాత్మనగు నాకు యేఆశ్రయమునూ లేదు."స్వేమహిమ్ని సదా సమాసతే"(నృసింహో 7-6)ఇతిశ్రుతేః। మరియు న్యాయమతము లో గుణము, క్రియ, జాతి మొదలగువాటికి ద్రవ్యము ఆశ్రయ ముండును. పృథ్వీ, జలము, తేజము, వాయువు, ఆకాశము, కాలము, దిశ, ఆత్మ మరియు మనస్సు-ఈతొమ్మిది ద్రవ్యము లు దేనిని ఆశ్రయించుకొని ఉండవు. ఆత్మ ఆ తొమ్మిది ద్రవ్యము లలో లెక్కింపబడినందున దేనిని ఆశ్రయించనిదై,నిత్యమై యు న్నది. న్యాయమతములోవలె వేదాంతమతమున ఆత్మ ద్రవ్యము కానప్పటికిని, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావముగలదై, దేనిని ఆశ్రయించుకొని లేదు. అనాశ్రయమున్నది. అందుకే, ఆశ్రయ

ము నశించినచో ఆత్మ నశించుననుట సంభవించదు.

ఆత్మనో మరణాదిప్రతీతిస్తు దేహాద్యుపాధికృతా । తదుక్తం సూత్రకృద్భిః–**"చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్యపదేశో భాక్తస్త ద్భావభావిత్వాత్"**(బ్ర.సూ.౨-౩-౧౬)ఇతి ।అస్య చార్థోపి విద్యారణ్య గురుభిరధికరణరత్నమాలాయాం దర్శితః"**జీవస్యజన్మమరణేవ పుషో వాఽఽత్మనో హి తే । జాతో మే పుత్ర ఇత్యుక్తేర్జాతక ర్మాదిభిస్తథా"**॥ఇతి పూర్వపక్షే ప్రాప్తే,సిద్ధాన్తమాహ-**"ముఖ్యే తే వపుషో భాక్తే జీవస్యైతే అపేక్ష్యహి । జాతకర్మచ లోకోక్తిర్జీ వాపే తేతి శాస్త్రతః"**॥ఇతి ||**జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియత ఇతి శ్రుతిః**(ఛాం.౬-౧౧-౩)తత స్త్రివిధనాశాభావాన్నిత్య ఏవాత్మేతి తస్య బ్రహ్మణాఽభేదః సమ్యగ్ఘటత ఇతి భావః ॥ ౪ ॥

శంక:-అట్లైనచో,"నా పుత్రుడు మరణించాడు"-ఈవిధమైన ఆత్మయొక్క మరణాదుల-సర్వలోక ప్రత్యక్ష అనుభవము మాటే మిటి?"జాతస్య హి ధ్రువో మృత్యుః"(గీత.౨-౨౭)"అహన్యహని భూతాని గచ్ఛన్తీహ యమాలయమ్"(మహాభారతము-వనపర్వము. ౩౧౩-౧౧౬)

ఉత్తరము:-దేహాద్యుపాధి మూలమున భ్రాంతిచేత ఆత్మ యందు మరణాదులు ప్రతీతియగుచున్నవి.సత్యము కాదు. ఆత్మ యొక్క అవినాశిత్వమును శ్రీబాదరాయణాచార్యులు బ్రహ్మసూ త్రములో ఇట్లు సెలవిచ్చిరి."చరాచర వ్యపాశ్రయస్తు"ఈ సూత్ర మునకు పూర్వసందర్భమున ఆకాశాది పంచభూతములకు ఉ

త్పత్తి నాశములు చర్చించనైనది. అట్లే, ఆత్మకుగూడ ఉత్పత్తి నాశములు గలవా?లేవా?అను సంశయనిరాసార్థము ఈ సూత్రమును ప్రవృత్తముచేసినాడు.''దేవదత్తుడు జన్మించాడు లేక దేవదత్తుడు మరణించాడు''అను యీ లౌకికవ్యవహారముచేత మరియు జాతకర్మాదులను విధానముచేసిన శాస్త్రప్రమాణముచేత-ఆత్మకు జన్మమరణాదులున్నవి-అను భ్రాంతి కలుగుట కవకాశమున్నది.అట్టి భ్రాంతిని నిరాకరించుటకుగాను జీవునికి అనగా జీవపద లక్ష్యమగు ప్రత్యగాత్మకు జన్మమరణములు లేవని ఈ సూత్రముచే ప్రతిపాదించనైనది.స్థూలసూక్ష్మశరీరమునకు సంబంధించిన జన్మమరణములు దేహతాదాత్మ్యసంబంధము వలన ప్రత్యగాత్మయందు ఉపచారముచే ఆరోపింపబడినవి. వాస్తవములు కావు. జాతకర్మాది శాస్త్రీయ వ్యవహారము స్థూలశరీర అపేక్షచేత జరుగుచున్నది -ప్రత్యగాత్మ అపేక్షచేత కాదు.

ఈ విషయమును స్పష్టము చేస్తూ శ్రీవిద్యారణ్య గురుదేవులు''అధికరణరత్నమాల''యందు-''జీవస్య జన్మమరణే'' జన్మమరణములు జీవుకి గలవా? లేక శరీరమునకా? అని పూర్వపక్షి వికల్పించి,జన్మమరణములు ఆత్మకేఉండును-అని శంకిస్తున్నాడు.ఎందుకనగా,''నాకు పుత్రుడు జన్మించాడు.జాతకర్మాది సంస్కారముల కర్తవ్యమున్నది''అను లోకానుభవమునుబట్టి మరియు జాతకర్మాదులను విధానముచేసిన శాస్త్రాధారముచే జీవునికి జన్మమరణములు కలవు-అని పూర్వపక్షము ప్రాప్తము కాగా, సిద్ధాంతి సమాధానమిస్తూ-జన్మమరణాదులుగాని, జాతక

ర్మాది సంస్కారములుగాని-ముఖ్యరూపముచే శరీరమునకుగ లవు.గౌణరూపముచే(ఔపచారికముగా)జీవునియందు ఆరోపిత వ్యవహారము జరుగుచున్నది.అందుకే,"జీవుడు పుట్టాడు,జీవుడు చనిపోయాడు"అని యిట్లు గౌణవ్యవహారము కనబడుచున్నది. ఇది జీవునికిగాక, శరీరమునకే యగును. ఎందుకంటే, పుట్టు నది,చచ్చునది ఈశరీరమే. మరియు "జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియతే","నజాయతే మ్రియతే వా"ఇత్యాది శాస్త్రప్రమాణములచే జన్మమరణములు శరీరమునకేగాని ప్రత్య గాత్మకులేవు-అని శ్రీబాదరాయణాచార్యులు(వ్యాసభగవానులు) నిర్ణయించినారు.

ఒకవేళ ఆత్మకు జన్మము చెప్పినచో, జన్మించుటకు పూర్వ ము లేదని(అసత్తని)చెప్పవలెను.అప్పుడు ఈ వర్తమాన దేహము నకు నిమిత్తకారణమగు పుణ్యపాపములు అసంభవమగును. అయినను, నిర్నిమిత్తముగా వర్తమాన జన్మమును ఒప్పినచో, అకృతఅభ్యాగమము=పుణ్యపాపములను(కర్మలు)చేయకుండగనే జన్మ ప్రాప్తించినది-అను దోషము ప్రసక్తమగును.

ఒకవేళ ఆత్మకు నాశము చెప్పినచో, మరణించిన పిమ్మట ఆత్మకు అసద్భావము ప్రాప్తించును. అప్పుడు, వర్తమాన జన్మలో చేసిన కర్మలకు భోక్తయే లేకుండా పోవును. అట్లగుచో, చేసిన కర్మలు ఫలమునివ్వకుండానే నశించిపోవును=కృతవిప్రనాశ ము-అను దోషము ప్రాప్తించును. దీనిని పూర్వమీమాంసకులు గాని మరియు ఆస్తికులెవరుగూడ స్వీకరించరు. ఎందుకంటే,

స్వర్గాదులనుద్దేశించి యజ్ఞయాగాది కర్మలు చేయుదురు. సశరీ రముతో స్వర్గమునకు పోవుట అసంభవము. మరణోత్తరకాల ములోనే స్వర్గమునకు పోవుదురు.ఆత్మకు నాశమును స్వీకరి స్తే, మరణించిన తరువాత ఆత్మ ఉండదు.అట్లైన, వర్తమాన జన్మలో చేసిన కర్మలకు ఫలమగు స్వర్గాది భోగములను అను భవించు వారెవరు?

నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి ।

అవశ్యమేవ భోక్తవ్యం కృతకర్మ శుభాశుభమ్ ॥

(బ్రహ్మవైవర్త పురాణము-ప్రకృతిఖండము ౩౭-౧౭)అను శాస్త్రవచ నమునకు విరోధమేర్పడును.

ఈవిషయమై శ్రీవిద్యారణ్యగురుదేవులుగూడ ఇట్లు చెప్పిరి—

పూర్వజన్మన్యసన్నేతజ్జన్మ సంపాదయేత్కథమ్ ।

భావిజన్మన్యసత్కర్మ న భుఞ్జీతేహ సఞ్చితమ్ ॥(వే,పం.౩-౪)

కావున, ఆత్మకు ఉత్పత్తి వినాశములు లేవు.

ఈప్రకారముగా త్రివిధనాశముల అభావమున్నందున ఆత్మ నిత్యమై(అవినాశియై)యున్నది.మరియుప్రత్యగాత్మకు బ్రహ్మము చేత అభేదముగూడ చక్కగా సిద్ధించుచున్నదని భావము.॥ ౪ ॥

హేతు సంయోగాదాత్మనో న నాశ ఇతి ద్వితీయం పక్షం ప్రపఞ్చయతి ।

అన్యపదార్థముయొక్కసంయోగముచే ఆత్మనాశము సంభ

వించదను-ద్వితీయ పక్షమును విస్తారముచే చెప్పుచున్నాడు —

**న శోషప్లోషవిక్లేదచ్ఛేదాశ్చిన్నభసో మమ ।**

**సత్యైరప్యనిలాగ్న్యమ్భః శస్త్రైః కిముత కల్పితైః ॥ ౫ ॥**

**అన్వయః**:-చిన్నభసఃమమ శోషప్లోషవిక్లేదచ్ఛేదాః సత్యైరపి (వ్యావహారికసత్తాకైః)అనిలాగ్న్యమ్భఃశస్త్రైః న (ఆకాశస్యశోషాద యః న భవన్తి తర్హి) ఉత కల్పితైః కిమ్ ||(చిదాకాశస్య ఆత్మనః కల్పితైః అనిలాదిభిః శోషాదయః న).

అన్వయార్ధము:-చిన్నభసః=చిదాకాశస్వరూపుడనగు;మమ =శోషప్లోషవిక్లేదచ్ఛేదాః=ఎండింపబడుట,దహింపబడుట, తడుపబడుట మరియు చ్ఛేదింపబడుట- అను ధర్మములులేవు, సత్యైరపి=వ్యావహారిక(సమాన)సత్త గలవయ్యును;అనిలాగ్న్యంభః శస్త్రైః=వాయువు,అగ్ని, జలము మరియు శస్త్రములద్వారా,(ఒక భూతాకాశమునకే;న=ఏహానియు లేనపుడు;ఉత=ఇక; కల్పితైః =కల్పితమగు=వాయ్వాదులద్వారా; కిమ్=ఏమగును?(నాకేమియు హాని లేదని భావము).

**టీకా**:-చిన్నభసశ్చిదాకాశస్యమమాత్మనోఽనిలేనవాయునా న శోషః=శోషణంపత్రఫలాదేరివ నభవతి,నాప్యగ్నినా ప్లోషో= దాహః పటాదేరివ భవతి,నాప్యమ్భసా=జలేన సస్యాదేరివ విక్లేదః=క్లేదనం భవతి, నాపి శస్త్రేణాయుధేనేక్షుదణ్డాదేరివ చ్ఛేదో= ద్వైధీభావో భవతి, ఆకాశస్యేవాత్మనో నిరవయవత్వేన వాయ్వాదిభిః సంబంధాభావాదిత్యర్థః ।

చిన్నభసః=చిదాకాశరూపప్రత్యగాత్మనగు నాకు,అనిలము =వాయువుచేత పత్రఫలాదులకువలె శోషణము=ఎండిపోవుట సంభవించదు. వస్త్రాదులకువలె అగ్నివలన దహింపబడుట జరుగదు. జలముచేత ధాన్యమునకువలె తడుపబడుట సంభవించదు. శస్త్రములచే (కొడవళ్ళు, కత్తులు, గొడ్డండ్లు మొదలగు వాటిచే) చెఱుకుగడలు నరుకబడినట్లుగా, నేను చ్ఛేదింపబడువాడనుకాను.ఎందుకనగా!ఆత్మ ఆకాశమువలె నిరవయవము, అసంగము-కావున, వాయ్వాదులచే ఆత్మకు సంస్పర్శగూడ కలుగనేరదని తాత్పర్యము.''నిష్కలంనిష్క్రియం'';(శ్వే.6-19);''నిరవయవం నిరాధారం నిర్వికారం నిర్మలం నిరవద్యం కూటస్థమచలం''(త్రి.మ.నా౭-౭) ''అసంగోహ్యాయం పురుషః''(బృ.౪-౩-౧౫/౧౬) ఇత్యాది శ్రుతులచే ఆత్మ అసంగము,నిరవయవము అని చెప్పబడుచున్నది.

వ్యావహారిక సత్యస్య భూతాకాశస్యాఽపి హి పరమతే నిరవయత్వేనాసంగత్వాదాకాశతుల్యై సత్యైరపిఅనిలాదిభిఃశోషాదయో న భవన్తి। ఆత్మని మాయాకల్పితత్వేన మిథ్యాభూతైర్వాయ్వాదిభిర్వస్తుతోఽద్వితీయస్యాఽసఙ్గస్యాత్మనః శోషాదయో న సంభవన్తీతి కిమువక్తవ్యమిత్యర్థః ।తదుక్తం భగవతా"అచ్ఛేద్యోఽయమదాహ్యోఽమక్లేద్యోఽశోష్య ఏవ చ । నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః"(గీత.౨-౨౪) ॥ ఇతి ॥ ౫ ॥

నైయాయికమతములో-నిరవయవము, అసంగమునగు వ్యావహారికసత్తగల భూతాకాశమునకు సమానసత్తగల అనగా

వ్యావహారికసత్తగల వాయ్వాదులచేత శోషాదులు సంభవించవు. ఇక, పారమార్థికసత్తగల ఆత్మయందు మాయాకల్పిత ప్రాతిభాసికసత్తగల లేదా వ్యాహారికసత్తగల అనగా ఆత్మకంటె భిన్న సత్తగల మిథ్యా వాయ్వాదులచేత అద్వితీయము, అసంగము, నిరవయవమునగు ఆత్మకు శోషాదులు సంభవించవు - అని వేరుగ చెప్పవలెనా? ఈవిషయమున శ్రీ గీతాచార్యులు ఇట్లు సెలవిచ్చియున్నారు.''ఈఆత్మ శస్త్రాదులచే ఛేదింపబడదు, అగ్నిచే దహింపబడదు, జలముచే తడుపబడదు,వాయువుచే ఎండింపబడదు, నిత్యము, సర్వవ్యాపియు, స్థిరస్వభావము గలదియు, అచలము మరియు సనాతనమై(అనాదియై)యున్నది''.

సమానసత్తలోనే సాధకత బాధకత ఉంటుందనే సామాన్య నియమము.వాస్తవముగా బాధ్య బాధకభావము చెప్పుటకు రెండు వస్తువులుండవలెను. కాని,పారమార్థికదృష్టితో విచారించినచో,ఆత్మవ్యతిరిక్తము రెండవ వస్తువే లేదు.ఒకవేళ వ్యావహారికసత్తచే ఆకాశాది ప్రపంచమును స్వీకరించినను, అది ఆత్మయందు అధ్యస్తము. అధ్యస్తవస్తువు అధిష్ఠానమును చెఱుపజాలదు.''యత్ర యదధ్యస్తః తత్కృతేన గుణేన దోషేణ వా స న సంబధ్యతే''(బ్ర.సూ.అధ్యాసభాష్యము);''నహిక్వచిదపి లోకే అవిద్యాధ్యస్తేనధర్మేణ కస్యచిదుపకారోఽపకారో వా దృష్టః- నహ్యుషరదేశం స్నేహేన పంకీకర్తుం శక్నోతి మరీచ్యుదకమ్''(గీతాభాష్యము ౧౩-౨)

ఆరోపితం నాశ్రయదూషకం భవేత్,

**కదాపి మూఢైర్మతిదోషదూషితైః ।**

**నార్ద్రీకరోత్యూషరభూమిభాగం**

**మరీచికావారిమహాప్రవాహః** ॥(వి.చూ.౪౯౯) ॥ ౫ ॥

**నను ప్రత్యగాత్మా పరిచ్ఛిన్నఏవనుభూయతే, 'అహమిహాస్మి' ఇతి ప్రతీతేః । బ్రహ్మ చ సర్వగతమ్, "నిత్యం విభుమ్"**(౧-౧-౬) **ఇత్యాది శ్రుతేః; అతో నాయం బ్రహ్మేత్యాశఙ్క్య, ప్రత్యగాత్మనః సర్వగతత్వం యుక్త్యా సంభావయన్నాహ —**

"నేను ఇక్కడ ఉన్నాను"ఇత్యాద్యనుభవమును బట్టి, నేను మర్యాదితమైన(పరిచ్ఛిన్నమైన)వాడను. కాని,బ్రహ్మమో-నిత్యం, విభుం,సర్వగతం సుసూక్ష్మమ్(ము౦.౧-౧-౬);దేశతః, కాలతః వస్తుత, పరిచ్ఛేద రహితం (త్రి.మ.నా.౭-౭) ఇత్యాది శ్రుతులచే వ్యాపకమని చెప్పబడుచున్నది.అందుకని, ఈ ఆత్మ బ్రహ్మము కానేరదు.ఇట్లు,శంక ప్రాప్తించగా,ప్రత్యగాత్మకు యుక్తిచేత సర్వ గతత్వమును(వ్యాపకత్వమును)సిద్ధిజేయుటకై ఉత్తరశ్లోకమును ప్రవృత్తము జేయుచున్నాడు-అభారూపస్యేతి.

### ఆత్మయొక్క సర్వగతత్వము

**అభారూపస్య విశ్వస్య భానం భా సంనిధేర్వినా ।**

**కదాచిన్నావకల్పేత భా చాహం తేన సర్వగః ॥ ౬ ॥**

**అన్వయః** :-అభారూపస్యవిశ్వస్య భానం భా-సంనిధేర్వినా కదాచిత్ న అవకల్పేత(న సంభవేత్)తేన అహం భా (చైతన్య రూపః) సర్వగః చ ॥ ౬॥

అన్వయార్థము:-అభారూపస్య=స్వయముగా అప్రకాశరూపమగు;విశ్వస్య=జడ ప్రపంచముయొక్క; భానమ్=ప్రకాశము; భాసంనిదేర్వినా=చిద్ఘనమగు=ప్రకాశస్వరూపమగు చైతన్యము యొక్క సంబంధము లేకుండా, కదాచిత్=ఎప్పుడుగూడ; న అవకల్పేత=సంభవములేదు;చ=మరియు;భా=ప్రకాశస్వరూపము;అహం=నేనే ఉన్నాను;తేన=అందుకని;(అహం) సర్వగః=సర్వగతమై=ఉన్నాను.

**టీకా:-**అభారూపస్యాచిద్రూపస్య,జడస్యేత్యర్థః;విశ్వస్య=జగతో భానం=ప్రకాశో భా సంనిధేర్వినా=భా సంనిధిం వినా, చైతన్యసంబన్ధం వినేత్యర్థః । కదాచిత్కదాచిదపి నావకల్పేత=న సంభవేత్ । భా చైతన్యరుపశ్చాహం ప్రత్యగాత్మా । తేన జడసర్వ ప్రపఞ్చ భాసకత్వేన ప్రత్యగాత్మా సర్వగః=సర్వవ్యాపీత్యర్థః ।

భా=ప్రకాశము;అభా=అప్రకాశము(జడము);ఇట్టిది-విశ్వము=ప్రపంచము; దీనియొక్క ప్రకాశము చైతన్య సంబంధము లేకుండా ఎప్పుడునూసంభవించదు. ఊహించుటకుగూడ శక్యములేదు.చైత్యస్వరూప ప్రత్యగాత్మనగు నాచేతనే ఈసర్వ ప్రపంచము ప్రకాశింపబడుచున్నందున,నేను సర్వగతము=సర్వవ్యాపకుడనని యర్థము. ఎందుకనగా!

బహుయోజనదూరవర్తి చన్ద్రసూర్యమణ్డలం తతోఽప్యతిదూరవర్తి ధ్రువాది నక్షత్రాణి చ ప్రత్యగాత్యనా భాసన్తే ।తచ్చ భానం జడానాం తేషాంస్వతో నసంభవతి,కింతు స్వప్రకాశరూపాత్మచై

తస్యసంబన్ధబలేనైవ తద్వక్తవ్యమ్ । స్వతోఽప్రకాశస్య ఘటాదేః స్వప్రకాశదీపాదిసంబన్ధబలేనైవ ప్రకాశదర్శనాత్ ।యది ప్రత్యగాత్మాఽత్రైవ తిష్ఠేత్కథం ధ్రువాదినా సంబధ్యేత?తతో ధ్రువాది భాసకత్వాత్ప్రత్యగాత్మాసర్వగతః ।పరిచ్ఛిన్నతాప్రతీతిశ్చ,ఆత్మనోఽభివ్యఞ్జకోపాధిపరిచ్ఛేదవశాద్భ్రాన్త్యోపపద్యతే ।తదుక్తం సూతసంహితా బ్రహ్మగీతాయామ్(౬-౫&3) **"స్వయం భాతుమశక్తం హి జడాత్మకమిదం జగత్ । చిత్సంబన్ధబలేనైవ ఖలు భాతి న చాన్యథా॥ స్వాభివ్యఞ్జకసంకోచాత్సంకోచప్రతిభాత్మనః॥న స్వరూపేణ చిద్రూపః సర్వవ్యాపీ సదాఖిలు"**॥ఇతి ||తతో జీవాత్మా బ్రహ్మైవేతి భావః ॥ ౬ ॥

అనంతయోజనముల దూరములోనున్న చంద్ర సూర్యాది మండలము మరియు అంతకంటే అతిదూరతరమైన ధృవాది నక్షత్రమండలము ప్రత్యగాత్మచేతనే ప్రకాశింపబడుచున్నవి. చంద్ర,సూర్య,ధృవాదినక్షత్రములన్నియు స్వయముగా అప్రకాశరూపములు(జడములు),కావున,అవి స్వయముగా ప్రకాశించుటకు సంభవములేదు.అందుకే,స్వయంప్రకాశ ప్రత్యక్చైతన్యము చేతనే ప్రకాశింపబడుచున్నవని చెప్పవలయును.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చంద్రమసియచ్చాగ్నౌతత్తేజోవిద్ధిమామకమ్॥(గీ.౧౫-౧౨)
"న తత్ర సూర్యో భాతి, న చంద్ర తారకం,
నేమా విద్యుతో భాన్తి, కుతోఽయమగ్నిః।

తమేవ భాన్తమనుభాతి సర్వం,

తస్యభాసా సర్వమిదం విభాతి'' ||(ముండక,కఠ,శ్వేతాశ్వతర)

''అత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి''| (బృ.౪-౩-౯)

''జ్ఞోఽత ఏవ'' (బ్ర.సూ.౨-౩-౧౮)

వ్యవహారములో స్వతః జడమగు ఘటాదుల ప్రతీతి(జ్ఞానము),స్వప్రకాశమగు దీపాదుల సంబంధబలముచేతనే కలుగుచున్నది.ఇది సర్వలోక ప్రత్యక్షము.అట్లే, స్వయంప్రకాశస్వరూప ప్రత్యగాత్మయొక్క సంబంధబలముచేతనే దేహాదిక సంపూర్ణ జడ ప్రపంచముయొక్క భానము=ప్రతీతి కలుగుచున్నది. (అగుచున్నది).ఒకవేళ ప్రత్యగాత్మ ఒక పరిచ్ఛిన్నదేశమునకు సీమితమై(పరిమితమై)ఇక్కడే ఉన్నది-అని చెప్పినచో,దానిది ధృవాదులతో సంబంధ మెట్లగును?

అందుకే,అభివ్యంజకవృత్తిద్వారా ధృవాదులతో ఆత్మయొక్క సంబంధము కలుగుటవలననే, అవి ప్రకాశింపబడుచున్నవనుట ప్రత్యక్షము మరియు శాస్త్రప్రసిద్ధము. దీనిచే ప్రత్యగాత్మ సర్వగతమున్నదని ఒప్పుకొనక గత్యంతరము లేదు.

శంక:-అయితే,జీవాత్మయొక్క పరిచ్ఛిన్నత్వ ప్రతీతి (అనుభవము)మాటేమిటి?

సమాధానము:-సత్యమే.కాని,పరమార్థసత్యముగాదు.ఆత్మను స్పష్టముగా అభివ్యక్తము(తెలియ)జేయు ఉపాధియగు దేహము,తద్గతఅంతఃకరణము పరిచ్ఛిన్నమున్నందున భ్రాంతిచే జీ

వాత్మ అనగా జీవపదలక్ష్యమగు ప్రత్యగాత్మయొక్క పరిచ్ఛిన్నత్వ ప్రతీతియగుచున్నది. ఈవిషయమై ''బ్రహ్మగీత'' ప్రమాణము:-

జడజగత్తు స్వయముగా ప్రకాశించుటకు అశక్తమున్నది. చైతన్యముయొక్క సంబంధబలముచేతనే ప్రకాశింప బడుచున్న ది.చైతన్యసంబంధములేకుండా ప్రకాశింపజాలదు.అయితే చైత న్యరూప ప్రత్యగాత్మ(జీవాత్మ)యొక్క సంకోచత్వ (పరిచ్ఛిన్నత్వ) భానము(ప్రతీతి)ఎట్లుకలుగుచున్నది?అంటే స్వాభివ్యంజక=ప్రత్య గాత్మను స్పష్టముగా తెలియజేయు అంతఃకరణముయొక్క సం కోచము(పరిచ్ఛిన్నత)వల్లనే,''దూరతాదోషముచేచంద్రప్రాదేశ ప్ర తీతివలె''-భ్రాంతిచే-కలుగుచున్నది.కాని,నిత్యజ్ఞానస్వరూపము న్నందున సర్వగతము=సర్వవ్యాపకమున్నది.కావున, ప్రత్యగాత్మ సర్వవ్యాపక బ్రహ్మమేయని - తాత్పర్యము ॥ ౬॥

---

విశేషము :—

**"నిత్యం విభుం సర్వగతమ్"**ఈశ్రుతియొక్క తాత్పర్య ము:-**నిత్యము=** ప్రాగభావ,ప్రధ్వంసాభావఅప్రతియోగిత్వంనిత్య త్వమ్.అనగా ఉత్పత్తి వినాశములులేనిది-అనియర్థము.దేనికి- ఉత్పత్తి ఉంటుందో,అది ఉత్పత్తికిపూర్వము లేనిదై=అభావము గలదై ఉంటుంది.అనగా ప్రాగభావము గలదై ఉంటుంది. దేనికి నాశనముంటుందో,అది నాశానంతరము (ధ్వంసమైన మీదట) అభావము గలది అనగా ప్రధ్వంసాభావము గలదై ఉంటుంది. ఏది పాగభావము మరియు ప్రధ్వంసాభావము గలదై యుం

డునో, అది అనిత్యమగును. అంటే కాలముచేత మర్యాదితము (పరిచ్ఛిన్నము) ఉంటుంది.ఉదా:-మృత్తికా కార్యమగు ఘటము యొక్క ఉత్పత్తికి పూర్వము,దానియొక్క అభావము అనగా ప్రా గభావమున్నది. మరియు ధ్వంసమైన(నష్టమైన)తరువాత దాని యొక్క అభావము అనగా ప్రధ్వంసాభావమున్నది.ఆ ప్రాగభావ ప్రధ్వంసాభావములకు ప్రతియోగిత్వము ఘటమునకు గలదు. అందుకే, ఘటము కాలపరిచ్ఛేదము గలది.కావున, అనిత్యము. కాని, బ్రహ్మము-ఉత్పత్తి వినాశరహితమై, త్రైకాలికాబాధ్యము గావున "నిత్యము" అనబడును.

**విభుమ్=** వ్యాపకము;అత్యంతాభావఅప్రతియోగిత్వం విభు త్వమ్ అనగా దేశపరిచ్ఛేదములేనిది-యనిఅర్థము.ఉదా:-పృథ్వీ మాత్రవర్తియైన గంధగుణము, జలాదులందు అత్యంతాభాము న్నది.ఆ అత్యంతాభావమునకు ప్రతియోగి గంధగుణము, కావు న,ఏకదేశమునందుండు గంధగుణము దేశపరిచ్ఛేదము గలద గును. కాని,బ్రహ్మమో-అన్నిదేశములలో ఉన్నందున దేశపరిచ్ఛే దశూన్యమగును.

"ఆత్మైవాధస్తాదాత్మోపరిష్టాదాత్మా పశ్చాదాత్మా పురస్తాదా త్మా దక్షిణత ఆత్మోత్తరత ఆత్మైవేదగ్ంసర్వమ్"(ఛాం.౭-౨౫-౨); "పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి"(త్రి,మ.నా. ౪-౪ పు.సూ).

**సర్వగతమ్=**అన్నిటియందు అనుగతమైయుండునది.అనగా వస్తుపరిచ్ఛేదము లేనిదియని అర్థము. అన్యోన్యాభావ అప్రతి -

యోగిత్వమ్ వస్తుపరిచ్ఛేదశూన్యత్వమ్.అన్యోన్యాభావమునకు యేది ప్రతియోగియో, అది వస్తుపరిచ్ఛేదము గలదైయుండును. ఉదా:-ఘట,పట(వస్త్ర)ములకు పరస్పరభేదమున్నది.అంటే ఘట మునందు పటములేదు. పటమునందు ఘటములేదు. అనగా అన్యమునందు అన్యముయొక్క అభావము- అన్యోన్యాభావము గలదు.ఆఅన్యోన్యంభావమునకు ప్రతియోగులు ఘటపటములు. కావున,ఘటపటములు వస్తుపరిచ్ఛేదము గలవైయున్నవి. కాని, బ్రహ్మమో-అన్నివస్తువులలో అనుస్యూతమై,అన్నిటియొక్క (ఆత్మ) స్వరూపమైయున్నది.సకలప్రపంచము బ్రహ్మమునందధ్యస్తము- గావున, అధ్యస్తవస్తువుయొక్క వాస్తవస్వరూపము అధిష్ఠానమే. రజ్జువు(తాడు)నందు భ్రాంతిచేత ప్రతీతమగు సర్పముయొక్క వాస్తవస్వరూపము రజ్జువేయగును.ఎందుకనగా, రజ్జువుకంటె వ్యతిరిక్తముగాసర్పమునకు సత్త(అస్తిత్వము)లేదు.రజ్జువే పాము వలె కన్పట్టుచున్నది.సర్పమను పృథక్ పదార్థములేదు. కావున, తనయందధ్యస్తమగు సర్వపదార్థముల(వస్తువుల)యందుబ్రహ్మ ము అనుగతమై యున్నందున,సర్వగతమ్ -అనిచెప్పబడినది.

మత్తఃపరతరం నాన్యత్కిఞ్చిదస్తి ధనఞ్జయ ।

మయి సర్వమిదం ప్రోతం సూత్రేమణిగణా ఇవ॥(గీ.౭-౭)

మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా॥(గీ.౯-౪)

బహిరన్తశ్చ భూతానామచరం చరమేవ చ ॥ (గీ.౧౩-౧౫)

సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని॥ (గీ.౬-౨౯)

అన్యత్ర"దేశతః కాలతో వస్తుతః పరిచ్ఛేదరహితం శాశ్వతం పరమంపదమ్"(త్రి.మ.నా.౭-౭)గూడ చెప్పబడినది.కావున, ప్రత్యగభిన్నపరమాత్మ దేశ కాలవస్తుపరిచ్ఛేదరహితము-అని సిద్ధమ్.

శ్రుతిస్మృతులలో స్వాజ్ఞత్వదృష్టిచే ప్రత్యగభిన్నపరమాత్మ సర్వగతమున్నదని ఆరోపదశలో చెప్పబడినది. కాని, పరమార్థ దృష్టిచే కాదు.

అవ్యావృత్తాననుగతం వస్తు బ్రహ్మేతి భణ్యతే ।
బ్రహ్మార్థోదుర్లభోఽత్రస్యాత్ ద్వితీయేసతివస్తుని ॥(బృ.వా)

ఘటముకంటె భిన్నము పటమున్నదనిన, పటమునుండి ఘటము వ్యావృత్తము(వేరుగా)ఉన్నది.అట్లే, బ్రహ్మముకంటె భిన్నమైన పారమార్థికవస్తువు మరొకటి ఉంటే,బ్రహ్మము దానినుండి వ్యావృత్తమగును.అట్టి రెండవ వస్తువేదియును లేదు.అందువలన,బ్రహ్మము అవ్యావృత్తమున్నది.మరియు ఎట్లు,ఘటత్వము తనకు ఆశ్రయమగు అనేక ఘటములలో ఏకమై అనుగతమైయుండునో,అట్లు,బ్రహ్మము దేనియందనుగతమై లేదు. ఎందుకనగా,బ్రహ్మమునకు ఆశ్రయమగు అన్యమైన వస్తువే లేదు. అందుకని,బ్రహ్మము దేనినుండి వ్యావృత్తము లేదు, మరియు దేనియందు అనుగతమునూ లేదు.కావున,పారమార్థికసత్తచే విచారించినచో ప్రత్యగభిన్నపరమాత్మ విభు,సర్వగతము అని చెప్పటగూడ సంభవించదు.

నను జీవస్య బ్రహ్మాభేదోఽసంగతః,బ్రహ్మణ ఏవాసిద్ధేః ।దేశ కాలవస్తుపరిచ్ఛేదశూన్యంవస్తు హి బ్రహ్మేత్యుచ్యతే;నచ తత్సంభ వతి। కాలాకాశాదేర్ద్వితీయస్య విద్యమానత్వేన వస్తుపరిచ్ఛేదాభా వస్యాసిద్ధేః;న చాకాశాదేః బ్రహ్మణ్యారోపితత్వేన మిథ్యాత్వాన్న తేన తస్య సద్వితీయత్వమితివాచ్యమ్।ఆకాశాదేరధ్యస్తత్వే మానా భావాత్ ।న చ**"ఆత్మన ఆకాశః సంభూతః"**(తై.౨-౧-౧)ఇతి శ్రుతి స్తత్ర మానమితి వాచ్యమ్, తత్రాకాశాదేః బ్రహ్మకార్యతామాత్ర ప్రతీతేః,ఇత్యాశఙ్క్య, బ్రహ్మణోఽద్వితీయత్వసిద్ధయ ఆకాశాదేర ధ్యస్తత్వం సాధయతి ।

జీవబ్రహ్మలఅభేదము సంభవించదు. ఎందుకనగా, ముఖ్య ముగా బ్రహ్మమునకే అద్వితీయత్వము సిద్ధించుటలేదు. ''దేశకా లవస్తుపరిచ్ఛేదరహితవస్తువు బ్రహ్మము''అని బ్రహ్మముయొక్క లక్షణము. కాని,ఈలక్షణమే సంభవించుట లేదు. ఏలయనగా! బ్రహ్మవ్యతిరిక్తము కాలము, ఆకాశాదులు విద్యమానమైయుండ గా, బ్రహ్మమునకు వస్తుపరిచ్ఛేదశూన్యము-అనిచెప్పుట అసంగ తము. ఒకవేళ సిద్ధాంతి ఇట్లు అనవచ్చును-ఆకాశాదులు బ్రహ్మ మునందు ఆరోపితములు అనగా మిథ్య. కావున, మిథ్యా ఆకా శాదులకు మరియు బ్రహ్మమునకు అన్యోన్యాభావరూప భేద ము అనగా సద్వితీయత్వముసంభవించదు-అని చెప్పుట ఉచిత ము కాదు.ఎందుకనగా,ఆకాశాదులు బ్రహ్మమునందధ్యస్తముల ని శ్రుతిస్మృతులలో ఎక్కడ ప్రమాణము లేదు.''ఆత్మనః ఆకాశః సంభూతః''(తై.౨-౧-౧)ఆ ఈ ఆత్మనుండి ఆకాశము పుట్టినది -

అను శ్రుతి ప్రమాణమున్నదనిన, అదియును యుక్తము కాదు. ఎందుకంటె, శ్రుతియందు బ్రహ్మమునుండి ఆకాశాదులయొక్క ఉత్పత్తి మాత్రము చెప్పబడినదేకాని,అవి బ్రహ్మమునందు (ఆత్మ యందు)అధ్యస్తములని చెప్పబడలేదు. కనుక,ప్రత్యగాత్మకు మరియు బ్రహ్మమునకు అభేదము అయుక్తము-అనియిట్లు శంక ప్రాప్తించగా,సిద్ధాంతి-బ్రహ్మము అద్వితీయమని సిద్ధిజేయుట కొఱకు, మొదట ఆకాశాదులు అధ్యస్తములు-అని తరువాతి శ్లోకము ద్వారా సాధిస్తున్నాడు - నహి భానాదితి.

**చైతన్యముయొక్క అద్వితీయత్వము**

**న హి భానాదృతే సత్త్వం నర్తే భానం చితోచితః ।**

**చిత్సంబంధోఽపినాధ్యాసాదృతే తేనాహమద్వయః ॥ ౭ ॥**

**అన్వయః** :-భానాత్ ఋతే(పదార్థస్య)సత్త్వమ్ న (భవతి, నాస్తి);చితఃఋతే అచితః భానం న(అస్తి)చిత్సమ్బన్ధఃఅపి(చిత్సంభేదోఽపి-ఇత్యపి పాఠః)అధ్యాసాత్ఋతే న (సంభవతి) తేన అహమ్ అద్వయః ॥ ౭ ॥

**అన్వయార్థము:**-భానాత్ ఋతే-ప్రకాశము లేకుండా, (ఏ పదార్థముయొక్క)సత్త్వమ్=సత్తా(అస్తిత్వము) సిద్ధించదు; మరియు,చితఃఋతే=చైతన్యములేకుండా;అచితః=అచేతనముయొక్క;భానమ్=ప్రకాశము;న=సంభవించదు.అట్లే,చిత్సంభేదః=అచేతనముతోచేతనముయొక్కసంబంధము;అపి=కూడ;అధ్యాసాత్ ఋతే=అధ్యాసముకలుగకుండా;న=సంభవించదు;తేన=అందు

వలన;అహమ్=నేను;అద్వయః=అద్వితీయ స్వరూపుడను.

**టీకా:-భానాదృతే**=ప్రకాశంవినా పదార్థస్యసత్త్వం=సద్భావో నాస్తిః అప్రకాశమాన శశవిషాణాదేఃసత్వాదర్శనాదిత్యర్థః । తతః కిమ్?తత్రాహ=నర్త ఇత్యాదినా ।**అచితః**=జడస్య **చితఋుతే**=చైతన్యసంబన్ధం వినా, **భానం**=ప్రకాశోనాస్తి,స్వతో భానవత్త్వే జడత్వాభావప్రసఙ్గాదిత్యర్థః ।**తతోఽపి** కిమ్?తత్రాహ(చిత్సంభేద)**చిత్సంబన్ధ** ఇత్యాదినా।(చిత్సంభేదోఽపి)**చిత్సంబన్ధోఽపి=చైతన్యసంబన్ధోఽప్యధ్యాసాదృతే**=చిత్యారోపితత్వంవినా జడస్య న సంభవతీత్యర్థః ॥

పదార్థములయొక్క జ్ఞానము లేకుండా, వాటి సద్భావము (అస్తిత్వము)సిద్ధించదు.అప్రతీయమాన కుందేలుకొమ్ము, గొడ్రాలు కొడుకుయొక్క సత్త్వము యెచ్చటనూ ప్రసిద్ధిలేదు.చైతన్యసంబంధములేక జడపదార్థముయొక్క జ్ఞానము కలుగదు. ఒకవేళ జడము స్వయముగా ప్రకాశించుచున్నచో,దానికి జడత్వ అభావ ప్రసంగమేర్పడును.అనగా అది చేతనమగునని భావము.అయిననేమి?అంటే,చేతనముతో ఆకాశాది అచేతనముల సంబంధము ఆధ్యాసికము-అనిస్వీకరించవలెను.లేనిచో,జడపదార్థముల భానమే(జ్ఞానమే)సంభవించదు-దీనిచే ఆకాశాది జడపదార్థములు కల్పితములు కావున, అకల్పితమగు చేతనమునకు సద్వితీయత్వము సిద్ధించదని యర్థము.

రెండు పదార్దములు విద్యమానమైయుండిననే వాటికి పర

స్వరభేదముగాని,సంబంధముగాని,సాదృశ్యముగాని చెప్పుటకు వీలుపడును.కల్పితమగుఆకాశాదులకు,అకల్పితమగుచేతనము నకు అన్యోన్యాభావరూప భేదముఘటిల్లదు.కావున, బ్రహ్మము నకు వస్తుపరిచ్ఛేదము సంభవించదు.

సతోర్హి భేదః పరికల్పనీయో,నాసత్సతోర్వాస్తవభిన్నతా స్యాత్,

గంగోదకస్యాఽథ మృగోదకస్య, భేదఃకథం వాస్తవతాముపైతి ॥ (స్వానుభవాదర్శః 159);"సతోర్హి ద్వయోః సంబంధః సంభవతి న సదసతోరసతోర్వా"(బ్ర.సూ.భాష్యము 2-1-18)

అయంభావః:-చిజ్జడయో రాధ్యాసికసంబన్ధాతిరిక్తం సంబ న్ధంవదన్వాదీ ప్రష్టవ్యః, కిం తయోః సంబన్ధః సంయోగః? ఉత సమవాయః?అథ తాదాత్మ్యమ్?అథవావిషయవిషయీభావః? ఇతి ।నాద్యః । చితోఽద్రవ్యత్వేన సంయోగానుపపత్తేర్గుణాశ్రయ స్యైవ ద్రవ్యత్వాత్ ।చితో నిర్గుణత్వాత్ ।నాపి సమవాయః, చిజ్జడ యోర్గుణగుణ్యాదిష్వన్యతమత్వాభావాత్ ।నను చిజ్జడయోః కార్య కారణభావాత్తన్తుపటయోరివ సమవాయోఽస్త్వితి చేన్న, తన్తుప టయోః సమవాయేఽవయవావయవితాయా ఏవప్రయోజకత్వే-న కార్యకారణభావస్యాప్రయోజకత్వాత్।అన్యథాతురీపటయోరపి సమవాయప్రసఙ్గాత్ । అవయవావయవితాయాశ్చ దృగ్దృశ్యయో రభావాత్ ॥

జడచేతనములకు ఆధ్యాసికసంబంధముగాక,మరేవిధమైన సంబంధము కుదురదు.ఒకవేళ బ్రహ్మమునకు సద్వితీయత్వము

ను సిద్ధిజేయుటకై యేదో ఒక సంబంధమును స్వీకరించవలె నని పూర్వపక్షి ఆగ్రహముచేసినచో,అతనిని ఇట్లు వికల్పముజే సి అడుగవలెను.ఏమయ్యా పూర్వపక్షి! జడచేతనములకు సం యోగసంబంధము చెప్పుదువా?లేక,సమవాయ సంబంధమా? అథవా,తాదాత్మ్యసంబంధమందువా?లేదా,విషయవిషయీభా వ సంబంధము ఒప్పుకుందువా?

౧.సంయోగసంబంధము వీలుపడదు,ఎందుకనగా!రూపర సాదిగుణములకు యేది ఆశ్రయమో, దానిని(మీరు)నైయాయి కులు ద్రవ్యమందురు.కాని,వేదాంతరీత్యా చైతన్యము నిర్గుణ మున్నది.''సాక్షీచేతా:కేవలోనిర్గుణశ్చ''(శ్వే.౬-౧౧); ''అనాదిత్వా న్నిర్గుణత్వాత్పరమాత్మాయమవ్యయః''(గీ.౧౩-౩౧).నైయాయికులు చెప్పు ౨౪ గుణములలో యే ఒక్క గుణమునకుగూడ బ్రహ్మము ఆశ్రయము కాదు.''ద్రవ్యయోరేవ సంయోగః''అను నియమాను సారము-బ్రహ్మమునకు ద్రవ్యత్వము సిద్ధంచదు-కావున, అనా త్మయగు ఆకాశాది జడవర్గమునకు మరియు చైతన్యమునకు సంయోగ సంబంధము సంభవించదు.

౨.సమవాయ సంబంధముగూడ కుదురదు. ఎందుకనగా! నైయాయికమతములో నిత్యసంబంధమునకు సమవాయమం దురు.అయుతసిద్ధ పదార్థములలో సమవాయముండును. అది గుణము-గుణి,జాతి-వ్యక్తి,క్రియ-క్రియావాన్,ఉపాదానకారణ ము మరియు కార్యము-ఇత్యాది స్థలములలో సమవాయముం టుందనిచెప్పదురు.అట్టి గుణ-గుణిభావాదులు జడచేతనముల

లో చెప్పుట సంభవించదు.ఎందుకనగా!చేతనము నిరవయవ ము,నిర్గుణము(గుణరహితము)అని ఇప్పుడే చెప్తూవచ్చాము.అట్లే,"నిష్కలం నిష్క్రియమ్"(శ్వే.౬-౧౯)అంటూ శ్రుతిమాత చేతన ము క్రియారహితము అని చెబుతుంది. మరియు అనేక ధర్మిల యందు అనుగతమైన ఏకధర్మమునకు జాతి అందురు. ఉదా:- అనేక ఘటరూప ధర్మిలయందు అనుగతమైన ఏకధర్మము ఘట త్వము.చేతనములు అనేకములుండినగదా, వాటియందు అను గత చేతనత్వ, ఆత్మత్వరూప జాతిని చెప్పుటకు వీలగును, కాని,"ఏకమేవాఽద్వితీయం"(ఛాం.౬-౨-౧)"ఏకోదేవః" (శ్వే.౬-౧౧);"సలిల ఏకో(ఽ)ద్రష్టా"(బృ.౪-౩-౩౨)ఇత్యాది శ్రుతులు చైతన్య ము ఏకమని ఉద్ఘోషించుచున్నందున ఆత్మత్వ, లేదా చేతనత్వ జాతిని అంగీకరించ తగదు.

మరియు పట(వస్త్ర)రూప కార్యమునకు తంతువులు కారణ మైనట్లుగా జగద్రూప కార్యమునకు బ్రహ్మము కారణమని చెప్పి, జగద్బ్రహ్మలకు సమవాయసంబంధము చెప్పవచ్చునుగదా!యని న అది ఘటించదు.ఎందుకనగా! తంతు పటములలో యే సమ వాయసంబంధము గలదో,దానికి కార్యకారణభావము కారణ ముగాదు.మరేమనగా,తంతువులు పటముయొక్క అవయవ ములు,పటము అవయవి.ఈవిధముగా అవయవావయవిభావ సంబంధము సమవాయసంబంధమునకు హేతువున్నది. కార్య కారణభావమువలన సమవాయసంబంధములేదు.ఒకవేళ తం తుపటములలో కార్యకారణభావమున్నందు వలననే సమవా

యసంబంధమున్నది-అని ఆగ్రహము చేసినచో,ఏవిధంగా పట మునకు తంతువులు కారణమో,అట్లే,మగ్గముయొక్క సకలపరి కరములు-తురీ వేమాదులు(కండె-నాడె) మొదలగునవిగూడ కారణములేయగును.అట్లైన,పటమునకు వాటితోగూడ సమవా యసంబంధమును స్వీకరించవలసిన ప్రసంగమేర్పడును.కాని, వాటితోపటమునకు సమవాయసంబంధము(నిత్యసంబంధము) ఎక్కడకూడ దృష్టిగోచరములేదు.మరియు దృగ్దృశ్యములకు అన గా ద్రష్టయు,నిరవయవమునగు చేతనమునకు-దృశ్యములు, జడములు,సావయవములునగు అనాత్మపదార్థములకు అవయ వ అవయవిభావసంబంధ అభావమున్నందున కార్యకారణ భావముగూడ సంభవించదు.

---

విశేషము:-''ఆత్మనఆకాశః సంభూత:''(తై.౨-౧-౧);''యతో వా ఇమానిభూతాని''(తె.౩-౧)ఇత్యాది వచనములచేత ఆకాశాది 'జడప్రపంచమునకు మరియు చైతన్యమునకు కార్యకారణభావ మునుచెప్పి, సమవాయసంబంధమును స్వీకరించవచ్చునుగదా యనిన-అదియును సంభవించదు.ఎందుకనగా!బ్రహ్మమునకు జగత్కారణత్వముచెప్పుటయందు శ్రుతిమాతకుతాత్పర్యములేదు. మరేమనగా,మూఢజనులలోగల కార్యకారణరూప మిథ్యా అను భవమును అనువాదముచేసి ఉపచారమాత్రముగా బ్రహ్మము నకు జగత్కారణత్వము చెప్పడమైనది. కాని సత్యము కాదు.

రోగముయొక్క నిదానమును తెలియకుండా, వైద్యునిచే

చేయబడు చికిత్స అనర్థకరమగునట్లు;ఈ సంసారరూప మహా వ్యాధికిమూలమును తెలియకుండా,దానిని నిర్మూలించుట అశక్యముగాన,శ్రీయోగవాసిష్ఠము-ఉత్పత్తిప్రకరణము ౧౦౧వ సర్గలో చెప్పబడిన దాది కథవలె, సృష్టిని ఆరోపించి,ఆ ఆరోపిత (మిథ్యా)జగత్తునకు బ్రహ్మ కారణమని చెప్పుట జరిగింది.

బ్రహ్మాజ్ఞానాజ్జగజ్జన్మ బ్రహ్మణోఽకారణత్వతః ।

అధిష్టానత్వమాత్రేణ కారణం బ్రహ్మ గీయతే ॥

బ్రహ్మమునందు అధ్యస్త జగజ్జన్మాదులకు బ్రహ్మము అధిష్ఠానము.అజ్ఞానము ఉపాదానకారణము.దానికి అధిష్టానత్వమాత్రముచేత అకారణస్వరూప బ్రహ్మమునందు జగత్కారణత్వము ఉపచారమాత్రముగ చెప్పబడినది.

అస్య ద్వైతేంద్రజాలస్య యదుపాదాన కారణమ్ ।

అజ్ఞానం తదుపాశ్రిత్య బ్రహ్మకారణముచ్యతే ॥

ఈద్వైతప్రపంచరూప ఇంద్రజాలమునకు ఉపాదాన కారణము అనాది అజ్ఞానము.ఆ అజ్ఞానమునకు ఆశ్రయము=వివర్తోపాదానరూప అధిష్ఠానమున్నందున బ్రహ్మమునందు కారణత్వ వ్యవహారము జరుగుచున్నది వాస్తవముగా బ్రహ్మము జగత్కారణము కాదు. (బృ.భాష్యవా.1-4-371) అని శ్రీ ఆద్యగురు శంకర భగవత్పాదులు మరియు శ్రీ సురేశ్వరాచార్యులుగూడ చెప్పియున్నారు.

నాపి తాదాత్మ్యమ్, పరస్పరవిలక్షణయోస్తయోస్తాదాత్మ్యా సంభవాత్ । నాపి విషయవిషయీభావః, తస్యావయవావయవి తాదాత్మ్యమూలసంబన్ధపూర్వకత్వాత్,తదసంభవస్యచోక్తత్వాత్। అన్యథాఽతిప్రసఙ్గాత్ ।తదుక్తం సర్వజ్ఞాత్మమునిభిః–**"నసంకరో నాపిచ సంయుతిస్తయోర్న చాస్తి తద్వత్సమవాయసంభవః । అతో న చిచ్చైత్యసమన్వయం ప్రతి ప్రతీయతే కాచన మూలసంగతిః"**॥ (సం.శా.3-౨33)ఇతి తతస్తయోరాధ్యాసిక ఏవ సంబన్ధ ఇతి వాచ్యమ్ ।

3)తాదాత్మ్యసంబంధముసంభవించదు.ఎందుకనగా!తాదాత్మ్యము అనగా అభేదము. జడచేతనములు పరస్పరము తమః ప్రకాశములవలె విరోధిస్వభావ పదార్థములున్నందున తాదాత్మ్యము ఘటిల్లదు.

४)విషయ విషయీభావసంబంధము కూడ సంభవించదు. కారణమేమనగా!విషయ విషయీభావసంబంధము ఉండుటకు పూర్వము అవయవావయవి లేక తాదాత్మ్యసంబంధము- ఈ రెంటిలో ఏదైన ఒక సంబంధముండవలసి యుండును. ఎందుకంటే,"విషయీ"శబ్దములోమూలధాతువు విష్ట్=వ్యాపనే.అనగా,చైతన్యము మొదలు జడవిషయమును వ్యాపించిన పిదపయే, చేతనము జడమును ప్రకాశించును. ఈ వ్యాప్తికలుగుటకు పూర్వము జడచేతనములలో అవయవావయవి లేక తాదాత్మ్యములలో ఏదో ఒక సంబంధముండి తీరవలయును. అప్పుడే చేతనము తనతో సంబంధముగల జడమును ప్రకాశించు

ను.కాని,ఈ రెండు సంబంధములలో యే ఒక్కటిగూడ సంభ వించదని ఇంతకు పూర్వమే చూపించినాము.

ఇట్లుండగా, ఒకవేళ ఆగ్రహముచే చిజ్జడములకు విషయ విషయీభావసంబంధమును,అంగీకరించినచో,అతిప్రసంగదోష ము ప్రాప్తించును.ఆగ్రహమనగా,"విరుద్ధార్థవిషయకోఽభినివేశః =ప్రగాఢ అనురాగః";అతిప్రసంగమనగా,"ప్రకృతాదన్యత్ర ప్రసఙ్గ నమ్; ప్రస్తుతవిషయాదన్యత్ర ప్రసక్తిర్వా".

ఈ విషయములో సంక్షేప శారీరకకారులు శ్రీ సర్వజ్ఞాత్మ మునీంద్రులవారు ఇలా సెలవిచ్చినారు. జడచేతనములు పరస్ప రము విరుద్ధస్వభావముగలవి-గాన వాటిలోఎప్పుడును తాదా త్మ్యసంబంధము సంభవించదు.సంయోగసంబంధము నియమ ముచే సావయవ సగుణపదార్థములగు రెండు ద్రవ్యములలోనే సంభవము.చేతనేమో నిర్గుణము,నిరవయవము. నైయాయిక మతరీత్యా జ్ఞానము ఆత్మయొక్క గుణము. "గుణేగుణానంగీకా రాత్"అనునియమముచే జ్ఞానము నిర్గుణము.కావున, వ్యాపక ము,నిర్గుణము,నిరవయవమునగు చేతనమునకు-అనాత్మయ గు ఆకాశాది జడజగత్తునకు అవ్యాప్యవృత్తిస్వభావముగల సం యోగసంబంధము అసంభవము.

ఇక అయుతస్సిద్ధ(నిత్యసంబద్ధ)పదార్థములకే సమవాయ సంబంధము స్వీకరించబడినందున, అసంగచేతనమునకు, జడ జగత్తునకు సమవాయసంబంధము(నిత్యసంబంధము) కుదుర దు.మరియు విషయ విషయీభావసంబంధము చెప్పుట తగదు.

ఎందుకంటె, విషయ విషయీభావ సంబంధమునకు పూర్వము మూలసంగతి అనగా,తాదాత్మ్యసంబంధముగాని,సంయోగసం బంధముగాని లేక సమవాయసంబంధముగాని చిజ్జడములకు ఉండి తీరవలయును. మూలసంబంధమును ప్రథమమున స్వీ కరించకుండా విషయవిషయీభావసంబంధముచెప్పుటకు వీలు లేదు. మూలసంబంధ అభావము ఇంతకుముందే చెప్పియున్నా ము,పై సమగ్ర పర్యాలోచనద్వారా జడచేతనములకు యే విధ మైన సంబంధముకూడ చెప్పుటసంభవించదు-అని సిద్ధమైనది.

కావున,చైతన్య సంబంధముచేత జడజగత్తుయొక్క ఉపలబ్ధి -ప్రతీతి కలుగుననుటఅనుచితము.కాని,వేదాంతసిద్ధాంత రీత్యా చిజ్జడములకు ఆధ్యాసికసంబంధమునేస్వీకరించదగినది.అట్లైన, చైతన్య సంబంధముచే జడజగత్తు ప్రకాశించుట సంభవిస్తుంది.

తథా చ జడపదార్థభానాన్యథానుపపత్తిరేవాకాశాదేరధ్యస్త త్వే ప్రమాణమ్ ।తదపి త్రైరేవోక్తమ్"**తతో వియన్ముఖ్యమదో జగ జ్జడం చిదాత్మనోఽస్యైవ వివర్తఇష్యతామ్ ।అనాద్యవిద్యాపటసం వృతాత్మనస్తదోపలభ్యత్వమముష్యకల్ప్యతే ॥**(సం.శా.3-౨౩౫)ఇతి।

కావున, వేదాంత సిద్ధాంతములో చైతన్యము లేకుండా ఈ పరిదృశ్యమాన ఆకాశాది జడజగత్తు ప్రకాశించుట సంభవించ దను అర్థాపత్తియే అనగా సంయోగాది యే యితర సంబంధ ములచే జగత్తుయొక్క భానము=ప్రకాశము అనుపపన్నమగుట యను అన్యథానుపపత్తియే, ఆకాశాది ప్రపంచము అధ్యస్తమను

టలో ప్రమాణము.

అన్యథానుపపత్తిశ్చేదస్తి వస్తు ప్రసాధికా ।

పినష్ట్యదృష్టి వైమత్యం సైవ సర్వ బలాధికా ॥

ఏదైన విషయమును సిద్ధిజేయుటలో అన్యథానుపపత్తిరూప ప్రబల ప్రమాణమున్నచో,అది అన్యత్ర కని విని యెఱుగని విషయమును దురాగ్రహముచే పరిగ్రహించుటయను=అదృష్టి వైమత్యము(వివాదము)ను పిండిజేయును(నాశనమునుజేయును).

ఈ విషయమునుగూడ శ్రీసర్వజ్ఞాత్వ మునీంద్రులవారు సంక్షేపశారీరకములోతెలియజేసారు—ఆకాశాదిజడజగత్తు,పటముచే నావృతఘటమువలె అనాద్యవిద్యావృత చేతనముయొక్క వివర్తము.అవిద్యయొక్క పరిణామము.అధిష్టాన చైతన్యమునందు జగత్తు అధ్యస్తము.అధిష్టాన అధ్యస్తములకు ఆధ్యాసిక(కల్పిత) తాదాత్మ్యము ఉండునుగాన,చేతనముచే-దృశ్యమగు జడజగత్తు ప్రకాశింపబడుట సమంజసమగును.

తేనాకాశాదేరధ్యస్తత్వేన అహం ప్రత్యగభిన్నఃపరమాత్మా,అద్వయః=అద్వితీయఇత్యర్థః ।తతశ్చ బ్రహ్మణోవస్తుపరిచ్ఛేదాభావేన త్రివిధపరిచ్ఛేదశూన్యత్వం సిద్ధమిత్యర్థః ।తదుక్తం శ్రీ విద్యారణ్యగురుభిః పఞ్చకోశవివేకే–**“దేశకాలాన్యవస్తూనాం కల్పితత్వాచ్చ మాయయా । న దేశాదికృతోఽన్తోఽస్తి బ్రహ్మనన్త్యం స్ఫుటం తతః”** (వే.పం.3-3౬) ॥ ఇతి ॥ ౭ ॥

ఈవిధముగా ఆకాశాది ప్రపంచము అధ్యస్తము(మిథ్య)య

ని సిద్ధించినందువలన ప్రత్యగాత్మచేనభిన్నమగు అద్వితీయ పర మాత్మయే నేను.

ఆకాశాది ప్రపంచము ఆధ్యాసికముగాన, దానితో బ్రహ్మ మునకు వస్తుపరిచ్ఛేదము సంభవించదు.కావున త్రివిధపరిచ్ఛేద శూన్యము బ్రహ్మము.ఈవిషయమును శ్రీవిద్యారణ్య గురుదేవు లు శ్రీవేదాంత పంచదశి-పంచకోశ వివేకములో ఇట్లు బోధిం చిరి—దేశము,కాలము మరియు ఘటపటాదిసకలము మాయా కల్పితమున్నందున,మిథ్యాభూతములగు వాటిచే ప్రత్యగభిన్నపర మాత్మకు దేశాదికృత(అంతము)నాశనముసంభవించదు.అందు వలన బ్రహ్మము అనంతము-అని స్పష్టమగుచున్నది.॥ ౭ ॥

## దేహాదులయొక్క అనాత్మత్వము

నను"స్థూలోఽహం, కృశోఽహం, కాణోఽహం, బధిరోఽ హం, బుభుక్షితోఽహం, పిపాసితోఽహం,మన్తాహం,నిశ్చితోఽ హం"ఇతి దేహాదిరూపేణానుభూయమానస్య ప్రతీచః కథంచిదే- కరస బ్రహ్మతా, ఇత్యాశఙ్క్య, దేహాదీనామనాత్మత్వం ప్రత్యేకం సాధయతి ॥ న దేహ ఇతి ॥

నేను స్థూలంగా ఉన్నాను,నేను బక్కగా ఉన్నాను, నేను మెల్ల కన్నువాడను,నేను చెవిటి వాడను,నేను మూగవాడిని. నేను ఆకలిగల వాడను;నేను దప్పికగల వాడను; నేను మనన ము చేయువాడను,నేను నిశ్చయము గలవాడను-ఇత్యాది అను భవములనుబట్టి దేహాదిరూపముచే ప్రతీతమగు అనేకధర్మము

లు అనగా వికారములుగల ప్రత్యగాత్మకు-నిర్వికారము ఏకరస మగు బ్రహ్మముతోఐక్యమెట్లు సంభవము?ఇట్లుశంక ప్రాప్తము కాగా, పైన తెలుపబడిన దేహాదులలో ప్రతిఒక్కటి అనాత్మయే యని సిద్ధిచేయుచున్నాడు.

**న దేహో నేన్ద్రియం చాఽహం న ప్రాణో న మనో న ధీః ।**

**మమతాపరిరబ్ధత్వాదాక్రీడత్వాదిదం ధియః ॥ ౮ ॥**

**అన్వయః** :-అహమ్(సాక్షీ)మమతా పరిరబ్ధత్వాత్ ఇదమ్ ధియః ఆక్రీడత్వాత్ దేహః న, ఇన్ద్రియమ్ న,ప్రాణః న, మనః న, చ ధీః న ॥ ౮ ॥

**అన్వయార్థము:**-అహం=నేను(ప్రత్యగాత్మను);మమతాపరిర బ్ధత్వాత్=మమత్వముచే ఆక్రాంతమైనందున, మరియు, ఇదం ధియః=ఇదం(ఇదియను)బుద్ధికి;ఆక్రీడత్వాత్=లీలాస్థానమగుటచే ;దేహః న=దేహమును కాను,ఇంద్రియం న=ఇంద్రియమును కా ను; ప్రాణః న=ప్రాణమును కాను; మనః న=మనస్సును కాను, మరియు, ధీః న-బుద్ధిని కూడ కాను.

**టీకా:**-దేహః సశిరస్కపిణ్డః ।ఇన్ద్రియం ద్వివిధం-జ్ఞానసాధ నం చక్షురాది, కర్మసాధనం పాణ్యాది చ । ప్రాణః పఞ్చవృత్తిః । మనః సంకల్పవికల్పాత్మకమ్(సంశయాత్మకమ్) । ధీర్బుద్ధిర్నిశ్చి యాత్మకా ।అహంశబ్దస్య దేహాదిభిఃప్రత్యేకం సంబన్ధః ।ఏతే దేహా దయో బుద్ధిపర్యన్తాః పఞ్చాఽపి పదార్థా అనాత్మాన ఇత్యర్థః । కుత ఇత్యత ఆహ–మమతేత్యాదినా ।మమతాపరిరబ్ధత్వాత్,

మమతయా=మమేతిబుద్ధ్యాపరిరబ్ధత్వాదాలిఙ్గితత్వాత్=విషయీకృతత్వాదితియావత్। ఇదంధియ ఇదంబుద్ధేః ఆక్రీడత్వాల్లీలాస్థానత్వాత్, ఇదం బుద్ధివిషత్యాదిత్యర్థః ।

శిరస్సుతో కూడిన పిండమును దేహమందురు. ఇంద్రియములు రెండువిధములు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అను పంచవిషయముల జ్ఞానమును కలుగజేయుటకు సాధనములగు శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా మరియు ఘ్రాణములనబడు జ్ఞానేంద్రియములు ఐదు; వచన, ఆదాన, గమన, రతి, మలవిసర్జనాది క్రియలకు సాధనములగు వాక్, పాణి, పాద, ఉపస్థ మరియు గుదేంద్రియములనబడు కర్మేంద్రియములుఐదు; మరియు ప్రాణ, అపాన, ఉదాన, సమాన, వ్యానములనబడు పంచవృత్యాత్మక ప్రాణము; సంశయాత్మక మనస్సు మరియు నిశ్చయాత్మకమగుబుద్ధి.ఇచ్చట దేహము,ఇంద్రియములు, ప్రాణము, మనస్సు మరియు-బుద్ధి-వీటియందు ప్రతిఒక్క దానితో అహం శబ్దమును జోడించవలెను.అనగా నేను దేహమును కాను;నేను ఇంద్రియమును కాను-ఇత్యాది. తాత్పర్యమేమనగా! దేహము మొదలుకొని బుద్ధి పర్యంతము-ఈ ఐదు పదార్థములు ఆత్మ కాదు. మరేమనగా,అనాత్మలేయగును.ఎందుకనగా? మమతాపరిరబ్ధిత్వాత్=నాది,నాది,అను ఈ విధమగు మమత్వ బుద్ధికి (నాదియను బుద్ధికి) విషయమగుచున్నందువలన; అట్లే,ఇదంధియ:ఆక్రీడత్వాత్=లీలాస్థానత్వాత్=ఇదియనుబుద్ధికి విషయమగుచున్నందువలన దేహాదులు అనాత్మలే యని తెలియాలి.

అత్రేదమనుమానం వివక్షితమ్—'దేహాదయః ప్రత్యేకమనాత్మానో,మమతాబుద్ధివిషయత్వాదిదంబుద్ధివిషయత్వాచ్చ,ఘటాదివత్'ఇతి।'దేహోఽనాత్మా,రూపాదిమత్త్వాద్ఘటవత్''ఇన్ద్రియాణ్యనాత్మానః కరణత్వాత్కుఠారవత్', 'ప్రాణోఽనాత్మా, వాయుత్వాద్బాహ్యవాయువత్'।

ఇచ్చట,మూలగ్రంథకర్తయగు శ్రీలక్ష్మీధరకవీంద్రులవారి అభిప్రాయానుసారము దేహాది పంచపదార్థముల అనాత్మత్వ విషయక సాముదాయిక అనుమానప్రయోగము చేయబడుచున్నది "దేహాదయః ప్రత్యేకమనాత్మానో, మమతా బుద్ధివిషయత్వాత్, ఇదం బుద్ధివిషయత్వాచ్చ; ఘటాదివత్" దేహాదులు ప్రతిఒక్కటి అనాత్మయగుటకుయోగ్యములున్నవి.ఎందుకనగా!"నాదినాది" యను మమత్వబుద్ధికి మరియు"ఇదిఇది"యను ఇదంబుద్ధికి విషయములగుచున్నందున,ఘటాదులవలె-దృష్టాంతము. ఘటము ఏవిధముగా నాదియను మరియు ఇదియను బుద్ధికి విషయమగుచున్నదో,అట్లే,ఈ దేహాది సంఘాతము నాది మరియు ఇది (మమ, ఇదం) అను బుద్ధికి విషయమగుచున్నది.

ఇప్పుడు టీకాకారులగు శ్రీస్వయంప్రకాశానంద యతీంద్రుల వారు దేహాది పంచపదార్థములలో ప్రతిఒక్కటిగూడ అనాత్మయే యని-చూపెడుతూ వేరువేరుగఅనుమానప్రయోగములు చేయుచున్నాడు."దేహోఽనాత్మా,రూపాదిమత్త్వాత్,ఘటవత్"ఈస్థూల దేహము అనాత్మయగుటకు యోగ్యమున్నది,ఎందుకనగా! రూ

పాదులు=పొడుగు, పొట్టి, దొడ్డు, సన్నము, ఎరుపు, నలుపు ఇత్యాది రూపములు గలిగియున్నందున, ఘటమువలె.

పితృభుక్తాన్నజాద్వీర్యాజ్జాతోఽన్నేనైవ వర్ధతే ।

దేహఃసోఽన్నమయో నాత్మా పాక్ చోర్ధ్వంతదభావతః॥

(వే.పం.3-3)తల్లిదండ్రులు భుజించిన ఆహారముచే ఉత్పన్నమైన వీర్యముచేజన్మించిన యీ అన్నమయశరీరము ఆత్మయగుటకు యోగ్యము కాదు.ఎందుకనగా!ప్రాగభావ,ప్రధ్వంసాభావములు గలదై కార్యమున్నందున,ఏవిధముగా ఘటము ఉత్పత్తికి పూర్వము ప్రాగభావము మరియు నాశానంతరము ప్రధ్వంసాభావముగలదై కార్యమున్నదో, నాది, ఇదియను బుద్ధికి విషయమున్నదో, అట్లే, ఈ అన్నమయ శరీరముగూడ ఉన్నది. కావున, ఇది అనాత్మయగును.

శ్రీ ఆద్య జగద్గురు శంకరాచార్యులవారు శ్రీమండనమిశ్రుల వారికి తురీయాశ్రమమును ప్రదానముజేసి, సురేశ్వరాచార్యులని నామకరణము గావించి,వారికి ఆత్మోపదేశముజేస్తూ ఇలా బోధించినారు-

త్వన్నాసి దేహో ఘటవద్యనాత్మా,

రూపాదిమత్వాదిహ జాతిమత్వాత్ ।

మమేతి భేదప్రథనాదభేద

సంప్రత్యయం విద్ధి విపర్యయోఽస్తు ॥(శంకరవిజయము)

ఓ సురేశ్వరా!ఈ పంచభూతాత్మక దేహము నీవు కాదు.

ఎందుకనగా!స్థూలము,కృశము,దీర్ఘము,హ్రస్వము,గౌరము మరియు శ్యామాదిరూపముగలదియై, మనుష్యత్వ,బ్రాహ్మణత్వాది జాతిగలదియై, నాదియను మమత్వబుద్ధికి మరియు ఇదియను ఇదంబుద్ధికి విషయమై,ఘటమువలె దృశ్యము,మరియు జడమై యున్నందున దేహము ఆత్మగాదు-అది నీవు గాదు. ''అస్థూల మనణ్వహ్రస్వమదీర్ఘమలోహితమ్''(బృ.౩-౮-౮).

కేవలశరీరముగాకుండా రూపజాత్యాదిధర్మములను పురస్కరించుకొని,అహంప్రతీతికి విషయమగుచున్నది,కావున, దీనిని ఆత్మయనవచ్చునుగదా!యనిన ఇది యుక్తముగాదు.ఎందుకనగా, ''రక్తః స్ఫటికః''అను విపర్యయ=భ్రాంతి వ్యవహారమువలె నున్నది. కాని, వాస్తవము గాదు.

ఇట్లు,పంచీకృతపంచభూతముల కార్యమగు స్థూలదేహము అనాత్మయని సిద్ధిజేసి,ఇప్పుడు అపంచీకృతభూతముల కార్యమగు సూక్ష్మశరీరముయొక్క అనాత్మత్వసిద్ధి కొఱకు, తదంతర్గత దశేంద్రియములుఆత్మకాదు-అని చూపెడుతున్నాడు.''ఇంద్రియాణ్యనాత్మానః,కరణత్వాత్,కుఠారవత్''ప్రత్యేక ఇంద్రియము ఆత్మకాదు,ఎందుకు?కరణము=జ్ఞానమునకు,కర్మకు సాధనమున్నందువలన, ఉదా:-ఇంధనమును=కట్టెను నఱుకుటకు, చీల్చుటకు గొడ్డలి,ఱంపము మొదలగు సాధనములవలె.కావున, ఇంద్రియములు ఆత్మలు కావు.ఇవిగూడ''మమ నేత్రమ్, ఇదం నేత్రమ్'' అని మమత్వ, ఇదంత్వ బుద్ధికి విషయమగుచున్నందువలన,

ఆత్మకంటెభిన్నములై,దృశ్యములు,జడములైనందువల్ల అనాత్మలే యగును.

"ప్రాణోఽనాత్మా, వాయుత్వాత్,బాహ్యావాయువత్" పంచ వృత్త్యాత్మక ప్రాణముగూడ అనాత్మయే యగును. వాయురూప మున్నందున, బాహ్యావాయువువలె.

ఈ ప్రకారముగా శ్రీలక్ష్మీధర కవీంద్రులవారు"న దేహో నేంద్రియం చాహమ్"అను యీప్రస్తుత శ్లోకములో దేహము మొదలుకొని బుద్ధిపర్యంతము, పంచపదార్థములు అనాత్మలని సిద్ధి జేయుటచే నుపలక్షణముగా పంచకోశవివేకముగూడ అర్థతః సిద్ధించినదని తెలియవలెను.

పూర్ణో దేహే బలం యచ్ఛన్నక్షాణాం యః ప్రవర్తకః।

వాయుః ప్రాణమయో నాసావాత్మా చైతన్యవర్జనాత్ ॥

(వే.పం.౩-౫)ఏవాయువు శరీరమంతటను వ్యాపించినదై, ఇంద్రియములకు బలమునిచ్చుచూ,వాటిని,వాటివాటి విషయములలో ప్రవర్తింపజేయుచున్నదో,అప్రాణమయకోశమనెడివాయువు జడమున్నందున ఆత్మ కాదు.

అహంతాం మమతాం దేహే గేహాదౌ చ కరోతి యః।

కామాద్యవస్థయా భ్రాంతో నాసావాత్మా మనోమయః ॥

(వే.పం.౩-౬)ఏ మనస్సు శరీరమునందు నేననెడి భావమును, గృహారామక్షేత్రాదులందు నాదియనెడి అభిమానమును చేయుచున్నదో,మరియు కామక్రోధాదివికారములుకలిగి, చంచలస్వ

భావముగల ఈ మనోమయకోశమనెడి మనస్సు ఆత్మగాదు.

లీనా సుప్తౌ వపుర్బోధే వ్యాప్నుయాదానఖాగ్రగా ।

చిచ్ఛాయోపేతధీర్నాత్మావిజ్ఞానమయశబ్దభాక్॥

(వే.పం.3-౭)చైతన్యప్రతిబింబముతోకూడిన బుద్ధి సుషుప్తియందు లయించినదై,జాగ్రదవస్థయందు నఖశిఖపర్యంతము శరీరమంతటను వ్యాపించియుండును. విజ్ఞానమయకోశమనబడు ఆ బుద్ధి ఆత్మగాదు.

మనోబుద్ధులురెండునూ అంతఃకరణవిశేషములగుటచే మనోమయ విజ్ఞానమయకోశములుగా(వేర్వేరుగా)కల్పనజేయుట అనుచితముగదాయనిన,కర్తృత్వశక్తిగలది విజ్ఞానమయకోశము ఆంతరమున్నది మరియు కరణత్వశక్తిగలది మనోమయకోశము బాహ్యమున్నది. కనుక,రెంటికి భేదసద్భావము ఉచితమేయగును.

కాచిదన్తర్ముఖావృత్తి రానన్దప్రతిబింబభాక్ ।

పుణ్యభోగేభోగశాన్తౌనిద్రారూపేణలీయతే॥

(వే.పం.3-౯)పుణ్యకర్మయొక్క ఫలానుభవకాలమందు ఒకానొక బుద్ధివృత్తి అంతర్ముఖమై ఆనందరూపమగు బ్రహ్మముయొక్క ప్రతిబింబమును గ్రహించుచు, పుణ్యకర్మలఫలభోగము నశించగా నిద్రారూపముచే లయించుచున్నది.

కాదాచిత్కత్వతో నాత్మా స్యాదానన్దమయోఽప్యయమ్ ।

బిమ్బభూతో య ఆనన్ద ఆత్మాసౌ సర్వదా స్థితేః ॥

(వే.పం.3-౧౦)ఒకప్పుడు ఉండి మరొకప్పుడు లేకుండా పోయే ఈ ఆనందమయకోశముగూడ ఆత్మ కానేరదు. బింబభూతమై సర్వదా ఉండు యే స్వరూపభూత ఆనందము గలదో, అదియే ఆత్మయగును.

ఇక్కడ ముముక్షువులు ఈక్రింది అనుమానప్రయోగము లను అవశ్యముగా జ్ఞప్తియందుంచుకొనదగినవి.

౧.దేహ ఆత్మా న భవతి, కార్యత్వాత్, ఘటవత్ ।

౨.ప్రాణ ఆత్మా న భవతి, జడత్వాత్, ఘటవత్ ।

3.మనోమయ ఆత్మా న భవతి,వికారిత్వాత్,దేహవత్ ।

౪.విజ్ఞానమయ ఆత్మా న భవతి, విలయాద్యవస్థావ త్వాత్, ఘటాదివత్ ।

౫.ఆనన్దమయోఽపి ఆత్మా న భవతి, కాదాచిత్కత్వాత్, అభ్రాదివత్ ॥అలమితి విస్తరేణ.

'దేహోఽహమ్'ఇత్యాది ప్రతీత్యభావాచ్చానాత్మత్వం పఞ్చా నామ్,'కృశోఽహమ్ ఇత్యాది ప్రతీతిస్తు 'రక్తఃస్ఫటికః'ఇత్యాదిప్రతీ తివదాత్మని దేహాదిధర్మాధ్యాసాదప్యుపపద్యతే, నాపి తత్సంఘా తస్యాప్యాత్మత్వమ్ ।అనాత్మసముదాయస్తత్సంఘాతోఽపి నాత్మా, అనాత్మత్వాత్, గృహాదివదితి భావః ॥ ౮ ॥

"నేను దేహము, నేను ఇంద్రియము" అని యిట్లు ఆత్మత్వ ప్రతీతియగుట లేదు. కావున, దేహాది బుద్ధి పర్యంతము పంచ పదార్థములు అనాత్మలేయగును."స్థూలోఽహం కృశోఽహం"

ఇత్యాది ప్రతీతి యేదిగలదో,అది "లోహత స్ఫటికః"అను వ్యవ హారమువలె భ్రాంతిరూపమే. స్ఫటికము స్వయముగా శుద్ధము (స్వచ్ఛమే). అయినను, దాని సాన్నిధ్యములో ఎరుపురంగుగల పుష్పమును లేదా ఎర్రనివస్త్రమునుంచినచో పుష్పము లేదా వ స్త్రముయొక్క ఎరుపువర్ణము(ధర్మము)స్ఫటికమునందు అధ్యాస చే ప్రతీతమగుచున్నది.వాస్తవముగా స్ఫటికమునందు ఎరుపు వర్ణములేదు.అట్లే,అధిష్ఠానచైతన్యముయొక్క సన్నిధిలోఉన్నందు న, దేహము మరియు ఇంద్రియాదులయొక్క ధర్మములు శుద్ధ చైతన్యమగు ప్రత్యగాత్మయందు ఆరోపింపబడి స్వరూప అజ్ఞాన ముచే"స్థూలోఽహం, కృశోఽహమ్, గౌరోఽహం కానోఽహం, మూకోఽహం,అంధోఽహమ్,బధిరోఽహం, బుభుక్షితోఽహం, పిపాసితోఽహమ్,మంతాహమ్,నిశ్చితోఽహమ్"ఇత్యాదిఆధ్యా సిక వ్యవహారము జరుగుచున్నది. సత్యము కాదు.

మరియు దేహము మొదలుకొని బుద్ధి పర్యంతముగల సం ఘాతముగూడ ఆత్మకాదు.ఎందుకనగా!అనాత్మల సముదాయ ము అనాత్మగాక మరేమైయుండును? జడములగు ఇటుకలు, రాళ్ళు కర్రలు మొదలగువాటియొక్క సముదాయాత్మక గృహాదు లు ఎట్లు జడములో,అట్లే,దేహాది సంఘాతముగూడ అచేతన మగుటవలన అనాత్మయేయగును,కాని ఆత్మ కానేరదని భావ ము॥ ౮ ॥

ఇంకను ఈ దేహాదులయొక్క అనాత్మత్వమును "తత్త్వాను సంధానము"యొక్క మంగళశ్లోకములో విస్తారముగా వర్ణించ

బడినది. జిజ్ఞాసగలవారు అక్కడ చూడగలరు.

"దేహో నాహం శ్రోత్రవాగాదికాని,

నాహం బుద్ధిర్నాహమధ్యాసమూలమ్ ।

నాహం, సత్యానన్దరూపశ్చిదాత్మా,

మాయాసాక్షీ కృష్ణ ఏవాహమస్మి ॥(తత్త్వానుసన్ధానము)

**అహంకారముయొక్క అనాత్మత్వము**

నను అహంకారస్యాత్మత్వమస్తు తస్య మమేదంబుద్ధివిషయత్వాభావాదిత్యాశఙ్క్య,సుషుప్త్యాదావాత్మనివిద్యమానేఽప్యహంకారాభావాన్నతయోరైక్యమిత్యభిప్రేత్య,ప్రకారాన్తరేణ తయోర్భేదం సాధయతి —

పూర్వ శ్లోకములో దేహాది పంచపదార్థములు ఆత్మకాదు. ఏలయన,అవి అహంబుద్ధికి విషయమగుట లేవు. కాని, అహంకారము అహంబుద్ధికి విషయమగుచున్నది. మమత్వబుద్ధికిగాని,ఇదంత్వబుద్ధికిగాని విషయమగుట లేదు.కావున,అహంకారము ఆత్మయగుటకు యోగ్యమున్నది-అనియిట్లు శంక ప్రాప్తము కాగా,సుషుప్త్యాద్యవస్థలలో ఆత్మ విద్యమానమైయున్ననూ, అహంకారముయొక్క అభావమున్నది.కావున,ఆత్మకు మరియు అహంకారమునకు అభేదము సంభవించదు-అనియిట్లు అభిప్రాయపడి వేరే ప్రకారముచేత భేదమును సాధించుటకై తరువాతి శ్లోకమును ప్రవృత్తము చేయుచున్నాడు.

**సాక్షీ సర్వాన్వితః ప్రేయానహం నాహం కదాచన ।**

**పరిణామపరిచ్ఛేదపరితాపైరుపప్లవాత్** ॥ ౯ ॥

**అన్వయః** :-సాక్షీ సర్వాన్వితః ప్రేయాన్ అహమ్ కదాచన అహం న(అహఙ్కారఃభవితుమర్హతి)పరిణామ పరిచ్ఛేదపరితాపైః ఉపప్లవాత్ ॥ ౯ ॥

**అన్వయార్థము**:-సాక్షీ=సర్వమునకుద్రష్ట;సర్వాన్వితః=సర్వ అనాత్మ పదార్థములందు అనుగతమై(వ్యాపించి),సర్వమును ప్ర కాశించు సాక్షిరూప ప్రత్యగాత్మ;ప్రేయాన్=పరమప్రీతికి విషయ మగుటవలన ఆనందరూపమైన;అహమ్=ప్రత్యగాత్మనగు నేను; కదాచన=ఎప్పుడుగూడ;అహమ్=అహంకారమును;న=కాలేను, పరిణామ,పరిచ్ఛేద,పరితాపైః=పరిణామము,పరిచ్ఛేదము మరి యు దుఃఖాదులచే;ఉపప్లవాత్=సంబద్ధమగుటవలన (నేను అ హంకారమును కాను).

**టీకా**:-సాక్షీ చిద్రుపోఽన్తఃకరణపరిణామరాగద్వేషాదిద్రష్టా, సర్వాన్వితః=సర్వత్ర ఘటపటాదిష్వన్వితః 'ఘటః స్ఫురతి పటః స్ఫురతి'ఇతి స్ఫురణస్య సర్వత్రానుగతత్వేనానుభవాత్ । ప్రేయాన్ =ప్రియతమ ఆనన్దరూపస్తస్యైవ ప్రేయత్వాత్,అనుభూయతే హ్యా-త్మనః ప్రియతమత్వమ్,**'అహం సర్వదా భూయాసం న కదాచి న్మా భూవమ్'** ఇత్యాత్మని సర్వేషాం ప్రార్థనాదర్శనాదిత్యర్థః । ఏవం భూతోఽహం ప్రత్యగాత్మా కదాచన=కదాచిదపి నాహమ్, నాహంకారో భవామీత్యర్థః।

అహంకారమనగా అంతఃకరణము కామక్రోధ రాగద్వేషా

దులతోయుక్తమై,పరిణామశీలమున్నది. "కామసంకల్పోవిచికిత్సా"(బృ.౧-౫-౩).ఇట్టి రాగాదియుక్తమైన అంతఃకరణమునకు ద్రష్ట-చిత్స్వరూప ప్రత్యగాత్మ=సాక్షి.మరియు దేహాదిసంఘాతమునందు,సర్వఘటపటాది ప్రపంచమునందు సర్వత్రవ్యాప్తమై=అనుగతమై యున్నది.ఎందుకనగా'ఘటఃస్ఫురతి,పటఃస్ఫురతి'యని ఆత్మయొక్క స్ఫురణము లేదా భానము(ప్రకాశము)సర్వత్ర అనుగతమై అనుభూయమానమగుచున్నందున ఆత్మయొక్క సాక్షిత్వము సిద్ధించుచున్నది. మరియు సర్వాధిక(నిరతిశయ)ప్రీతికి విషయమగుచు, ప్రియతమమైయున్నందున,ఆత్మయొక్క ఆనందత్వము అనుభవ సిద్ధమున్నది."తదేతత్ప్రేయః పుత్రాత్ప్రేయో విత్తాత్ప్రేయోఽన్యస్మాత్సర్వస్మాదాన్తరతరం యదయమాత్మా"(బృ.౧-౪-౮) ప్రాణిమాత్రులకు"నేను ఎల్లప్పుడు ఉండాలి.ఎప్పుడు నాశనము కాకూడదు"అను తీవ్రతర ఇచ్ఛ ఉంటుంది. కావున, ఆత్మయొక్క నిత్యత్వము (సత్యత్వము)సిద్ధించుచున్నది."నిత్యత్వాతిరిక్త సత్యత్వాభావాత్ నిత్యత్వం సత్యత్వం తద్యస్యాస్తి తన్నిత్యం సత్యమితివాచస్పతిమిశ్రైరుక్తత్వాత్" (వే.పం.౧-౮ టీకాయామ్)ఈ ప్రకారముగా సదావిద్యమానమై,మూడుకాలములలో స్ఫురణరూపమై మరియు సర్వాధికప్రీతికి విషయమున్నందున ప్రత్యగాత్మనగు నేను సచ్చిదానందస్వరూపుడనున్నాను. ఇట్టి నేను ఎప్పుడు గూడ అహంకారమును కానేకాను.

తత్ర హేతుమాహ పరిణామ–ఇత్యాదినా । అహంకారస్య పరిణామపరిచ్ఛేదపరితాపైః,పరిణామః=రాగద్వేషాదిపరిణామః,

పరిచ్ఛేదః=పరిమితత్వమ్,పరితాపః=దుఖాదిః, ఏతైస్త్రిభిరుప్లవః= సంబన్ధస్తస్మాదిత్యర్థః। ద్రష్టృదృశ్యభావేన సర్వగతత్వపరిచ్ఛిన్నత్వా ద్యాకారేణానన్దరూపిత్వ దుఃఖిత్వాకారేణ చానుభూయమానత్వా దహంకారాత్మనోర్భేదః స్ఫుట ఇత్యర్థః । కిమితి తర్హి తయోర్భేదః సర్వైర్నానుభూయత ఇతిచేత్, అహకారాత్మనోస్తప్తాయఃపిణ్డవద వివేకేనదృఢమేకతయాఽధ్యసనాన్నానుభూయత ఇతి గృహాణేత్య భిప్రాయః ॥ ౯ ॥

ఈవిషయంలో హేతువును చూపెడుతున్నాడు. అంతఃకరణ ము రాగద్వేషాది పరిణామము గలదైయున్నది. మధ్యమ పరి మాణము(శరీరపరిమితి)గలది, గావున పరిచ్ఛిన్నమైనది. మరి యు సుఖదుఃఖాది ధర్మములతో కూడియున్నందున పరితా పముగలది.ఇట్లు,పరిణామ,పరిచ్ఛేద,పరితాపములను మూడు ధర్మములతో సంబద్ధమైనది అంతఃకరణము. కాని, ప్రత్యగాత్మ అంతఃకరణ ధర్మములకు సాక్షియై యున్నది. పరిణామాది ధర్మ ములు ఆత్మకు లేవు.

శోక హర్షభయక్రోధ లోభ మోహస్పృహాదయః ।
అహంకారస్య దృశ్యన్తే జన్మమృత్యుశ్చ నాత్మనః ॥

(శ్రీమద్భాగవతము ౧౧-౨౮-౧౫)ఆత్మ-ద్రష్ట,సర్వగతము,ఆనందరూ పమున్నది.అహంకారము దృశ్యము,పరిచ్ఛిన్నము, దుఃఖరూప మున్నది.ఇట్లు ఆత్మ మరియు అహంకారములకు పరస్పరవిరు ద్ధ ధర్మములు అనుభవ సిద్ధమున్నందున, యీ రెంటికి భేదము

స్పష్టమున్నది.

శంక:-ఇట్లు అహంకార,ఆత్మలకు ఇంతస్పష్టముగా భేద మున్నట్లైతే, సకల జీవులకు ఆత్మానుభూతి ఎందుకు కలుగుట లేదు?

ఉత్తరము:-తప్తాయఃపిండమునందు అగ్ని మరియు లోహ ము(ఇనుము)అత్యంత భిన్నములైయున్ననూ,అవివేకి పురుషుల కు రెండింటియొక్క అభేద భ్రమ యెట్లు కలుగుచున్నదో, అట్లే, ఆత్మాహంకారములకు స్పష్టభేదమున్నప్పటికినీ అవివేకి పురు షులకు అనాద్యజ్ఞానముచే ఆత్మ అహంకారములయొక్క దృఢ ఐక్యాధ్యాస సంస్కారముచే,ఆత్మఅహంకారముల అభేదభ్రమ క లుగుచున్నది.కావున,అవివేకిజీవులకు అహంకార ఆత్మలకుగల భేదము అనుభవగోచరమగుటలేదు.పూర్వపూర్వ అధ్యాస ఉత్త రోత్తర అధ్యాసకుకారణము.పైసమగ్ర పర్యాలోచనద్వారా ఆత్మ, అహంకారము కానేరదు.కావున,ఆత్మ అనగా నేను అహంకార ము కాదు-అని తెలియవలెను॥ ౯ ॥

## ఆత్మయొక్క శుద్ధత్వము

నన్వేవమపి సంసారిణ ఆత్మనః కథం నిత్యముక్తబ్రహ్మతా? న చ సంసారోఽహంకారస్యైవ నాత్మన ఇతి వాచ్యమ్, ఆత్మా-హంకారోభయసంన్నిధానే ప్రతీయమానస్య సంసారస్యాహం కారైకసంబన్ధిత్వేమానాభావాత్,ఇత్యాశఙ్క్యాన్వయవ్యతిరేకావేవ తత్ర మానమిత్యాహ —

పైశ్లోకములో చెప్పినట్లుగా అహంకారము మరియు ఆత్మ లకు భేదమున్నప్పటికిని,సంసారియగు ఆత్మకు నిత్యముక్త బ్ర హ్మస్వరూపత్వమెట్లు సంభవము?ఒకవేళ మీరు ఇట్లు అనవ చ్చును-ఏమనగా,సంసారధర్మము  అహంకారమునకేగలదు,ఆ త్మకు లేదు.కావున,ఆత్మకు నిత్యముక్తబ్రహ్మత్వము సిద్ధించును- ఇట్లు చెప్పుటకు  వీలులేదు.ఎందుకనగా?ఆత్మ మరియు అహం కారముల(రెండింటి)సన్నిధిలో అనగా ఐక్యస్థితియందు ప్రతీతమ గు సంసారము కేవలము అహంకారమునకే సంబంధించినది, ఆత్మకు అణుమాత్రముగూడ సంబంధము లేదు-అనుటకు ప్రమా ణమేమిటి చెప్పండి?ప్రమాణమేమియును లేదు-గావున, సంసా రియగు ఆత్మకు నిత్యముక్త బ్రహ్మముతో అభేదము సంభవిం చదు.

ఇట్లు శంక ప్రాప్తించగా, అహంకారమునకు మరియు సం సారమునకు అన్వయము అనగా ఐక్యమున్నది. ప్రత్యగాత్మ మరియు సంసారమునకు వ్యతిరేకము అనగా భేదమున్నది. అహంకారమునకే సంసారమున్నది మరియు ఆత్మకు నిత్యము క్త బ్రహ్మత్వము సిద్ధిస్తుంది-అని చెప్పుటలో ఈ అన్వయ వ్యతి రేక యుక్తియే  ప్రమాణమున్నది-అని ముందర శ్లోకముద్వారా చెప్పుచున్నాడు.

**సుప్తేఽహమి న దృశ్యన్తే దుఃఖదోషప్రవృత్తయః ।**

**అతస్తస్యైవ సంసారో న మే సంసర్తృసాక్షిణః ॥ ౧౦ ॥**

**అన్వయః :-**అహమి సుప్తే దుఃఖదోషప్రవృత్తయః న దృశ్యన్తే, అతః తస్యైవ సంసారః, సంసర్తృ సాక్షిణః మే న (సంసారః ఇత్యర్థః) ॥ ౧౦ ॥

**అన్వయార్థము:-**అహమిసుప్తే=అహంకారము సుషుప్త్యాదు లలో ఉపరమించినపుడు, దుఃఖదోష ప్రవృత్తయః=దుఃఖము, దోషము మరియు ప్రవృత్తులు; న దృశ్యన్తే=అగుపడుట లేవు; అతః=అందువలన;తస్యఏవ=ఆ అహంకారమునకే; సంసారః= ఈ సంసారమున్నది; సంసర్తృసాక్షిణః=సంసారమును పొందు అహంకారమునకు సాక్షియగు;మే=నాకు;న=జన్మ మరణరూప సంసారము లేదు.

**టీకా:-**అహమి=అహంకారే సుప్తే=ఉపరతే సతి సుషుప్తి మూర్చ్ఛాదౌ,దుఃఖదోషప్రవృత్తయః=దుఃఖం చ దోషా రాగాద యశ్చ తత్కార్యభూతా ప్రవృత్తిశ్చ దుఃఖదోషప్రవృత్తయః, తా న దృశ్యన్తే, యతః- అతస్తస్యాహంకారస్యైవసంసారః, సంసర్తృసా క్షిణః=సంసర్తురహంకారస్య సాక్షిణః । మే=మమ ప్రత్యగాత్మనో న సంసార ఇత్యర్థః ।తథాహి–అహంకారే సతి,జాగ్రత్స్వప్నయోః సంసారదర్శనాత్తదభావేచ సుషుప్త్యాదౌ కేవలఆత్మని సంసారా దర్శనాదహంకారసంబన్ధ్యేవ సంసారః ।ఆత్మన్యపి తదవివేకాత్ప్ర తీయతే,యథా దగ్ధృత్వమగ్నిసంబన్ధ్యేవ సత్తదవివేకా దయస్యపి ప్రతీయతే,యథా వా రక్తిమా జపాకుసుమసంబన్ధ్యేవ సన్నవివే కాత్స్ఫటికేపి ప్రతీయతే ।తద్వదాత్మన్యప్యహంకారోపాధివశాదేవ సంసారః ప్రతీయతే న స్వతః సుషుప్త్యాదావదర్శనాత్ । తదుక్తం

సర్వజ్ఞాత్మమునిభిః–**“కర్త్రాదిసంనిధిబలేన తవాపి కర్తృభోక్తృప్ర మాతృవపురాపతతిభ్రమేణ।తద్బుద్ధిసంశ్రయమనాత్మగతం ప్రతీచి శుద్ధేఽపి పశ్యతి తమః పటలావృతాక్షః”**(సం.శా.౩-౮౧) ఇతి । అత ఆత్మా నిత్యముక్తం బ్రహ్మైవేత్యభిప్రాయః ॥ ౧౦ ॥

సుషుప్తి,మూర్ఛ,సమాధ్యవస్థలలో అహంకారము లీనమైనపుడు దుఃఖము,రాగద్వేషాది దోషములు, తత్కార్యమగు ప్రవృత్తి మొదలగునవి ఏమియు ప్రతీతియగుట లేదు.

న్యాయశాస్త్రములో అనర్థరూపమగు సంసారము, తన్నివృత్త్యుపాయమగు తత్త్వజ్ఞానమును బోధిస్తూ ఇట్లు సూత్రీకరించబడినది.**సూత్రము:-**దుఃఖ జన్మ ప్రవృత్తి దోష మిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనన్తరాభావాదపవర్గః(న్యా.సూ౧-౧-౨)

దుఃఖము,జన్మము,ప్రవృత్తి,దోషము మరియు మిథ్యాజ్ఞానము-వీటిలో ఉత్తరోత్తరములు నాశనమైతే, పూర్వపూర్వములు అభావములగును,తద్వారా దుఃఖాభావరూప మోక్షము కలుగును.అనగా,తత్త్వజ్ఞానముచే మిథ్యాజ్ఞానమునష్టమైనచో, రాగద్వేషాది దోషములు నశించును. దోషములు నశించినచో పుణ్యపాపరూప కర్మలయందలి ప్రవృత్తి నష్టమగును. పుణ్యపాపరూప ప్రవృత్తి నశించినచో, వాటి కార్యమగు జన్మలు అభావమగును. జన్మ అభావమైనచో దుఃఖాభావమగును.అప్పుడు అపవర్గము అనగా మోక్షము ప్రాప్తించును.

శ్రీ శంకరభగవత్పాదులుగూడ‘ఆత్మానాత్మవివేకము’లో చె

ప్పారు గదా!"ఆత్మనః కిం నిమిత్తం దుఃఖమ్? శరీరపరిగ్రహని మిత్తమ్ । శరీరపరిగ్రహః కేన భవతి? కర్మణా । కర్మ కేన భవ తీతి చేత్? రాగాదిభ్యః । రాగాదయః కస్మాత్ భవన్తీతి చేత్? అభిమానాత్ । అభిమానోఽపి కస్మాత్ భవతి? అవివేకాత్ । అవివేకః కస్మాత్ భవతి? అజ్ఞానాత్ । అజ్ఞానం కేన భవతీతి చే త్?న కేనాపి । అజ్ఞానం నామ అనాది సదసద్భ్యామనిర్వచనీ యం త్రిగుణాత్మకం జ్ఞానవిరోధి భావరూపం యత్కిఞ్చిదితి వ దన్తి, అహమజ్ఞః ఇత్యాద్యనుభవాత్ ॥" "దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్"(శ్వే.౧-౩)ఇత్యాది శ్రుతేః ॥ ఇట్లు,జీవునికి సర్వానర్థ ములకు మూలము అజ్ఞానము-అని చెప్పి,ఆ అజ్ఞానము మన స్సుకంటె భిన్నము కాదు.

నహ్యస్త్యవిద్యా మనసాతిరిక్తా,
మనోహ్యవిద్యా భవబన్ధ హేతుః ।
తస్మిన్ వినష్టే సకలం వినష్టం,
విజృమ్భితేఽస్మిన్ సకలం విజృమ్భతే ॥(వి.చూ.౧౭౧)

అంటూ సెలవిచ్చాడు. సుషుప్తియందు కారణావిద్య ఉన్నను బంధము లేదు.కావున,ఆ కారణావిద్యయొక్క కార్యమగు మన స్సేబంధహేతువు.మనస్సు లీనమైతేబంధము=సంసారము లేదు. మనస్సు ఉంటే జన్మ మరణాది సంసారముంది. ఈ అన్వయ వ్యతిరేకముచే దుఃఖ దోష ప్రవృత్తిరూప సంసారము(అనర్థము) నకు కారణము మనస్సు=అంతఃకరణము అనగా అహంకార

ము.కనుక,అహంకారమునకే సంసారముగలదు,గాని సంసారమునుపొందు-దుఃఖ జన్మ ప్రవృత్తి రాగాది దోషసహిత అంతఃకరణమునకు సాక్షియగు ప్రత్యగాత్మనగు నాయందు సంసారము లేదు.

ఈ విషయమునే మరింత స్పష్టము చేయుచున్నాడు. జాగ్రత్తు, స్వప్నములలో అహంకారమున్నది. అప్పుడే సంసారము, తత్ఫలితముగా దుఃఖము, ప్రవృత్తి, రాగాది దోషములు ప్రతీతములగుచున్నవి.సుషుప్తి మూర్ఛ సమాధి మొదలగు అవస్థలలో అహంకారముయొక్క అభావమున్నది.అప్పుడు కేవల' ఆత్మ విద్యమానమైయున్నను,సంసారముయొక్క ప్రతీతిలేదు. "యత్సత్త్వే యత్సత్త్వం-అన్వయః । యదభావే యదభావః-వ్యతిరేకః"॥ యథా-మృత్తికా సత్త్వే ఘట సత్త్వం-అన్వయః । మృత్తికా అభావే ఘటాభావః-వ్యతిరేకః ॥ అట్లే, యెక్కడ అహంకారముండునో (జాగ్రత్స్వప్నములలో), అక్కడ సంసారముండును-అన్వయము । ఎక్కడ అహంకారము లేదో(సుషుప్త్యాద్యవస్థలలో), అక్కడ సంసారము లేదు-వ్యతిరేకము ॥ ఈ అన్వయ వ్యతిరేక యుక్తిచే సంసారము అహంకారమునకే సంబంధించినదని తేటతెల్లమగుచున్నది. ఈ అన్వయ వ్యతిరేక యుక్తియే సంసారము అహంకారమునకే సంబంధించినదనుటలో ప్రమాణము.

అహంకారస్య తాదాత్మ్యం చిచ్ఛాయా దేహ సాక్షిభిః ।
సహజం కర్మజం భ్రాంతి జన్యం చ త్రివిధం క్రమాత్ ॥

(వాక్యసుధ-8)లో ఆచార్యులు చెప్పినట్లుగా, అహంకారము నకు మరియు సాక్షికి భ్రమజ తాదాత్మ్యసంబంధమున్నది. ఈ సంబంధమున్నదను వివేకాభావమువల్లనే,అహంకారముయొక్క సంసారధర్మము ఆత్మయందు ప్రతీతమగుచున్నది.ఏ విధముగా దాహకత్వధర్మము అగ్నియందేగలదు.కాని,అగ్ని సంబంధియగు అయోగోళము(ఇనుపగుండు)నందు"అయోదహతి" యని మరియు జపాకుసుమముయందలి రక్తవర్ణము స్ఫటికమునందు"రక్తఃస్ఫటికః"అని గోచరించునట్లు, అహంకారోపాధి సంబంధము=భ్రమజతాదాత్మ్య సంబంధమువలన అహంకారముయొక్క సంసారధర్మములు శుద్ధాత్మయగు ప్రత్యగాత్మయందు ప్రతీతియగుచున్నవి. వాస్తవముగా ఆత్మ నిర్ధర్మకమున్నది. "సాక్షీ చేతాఃకేవలో నిర్గుణశ్చ"(శ్వే.౬-౧౧);"కేవలోஉహం సదా శివః" (అధ్యాత్మోపనిషత్ ౬౯),

ఈ విషయమునే శ్రీ సర్వజ్ఞాత్మమునీంద్రులవారు సంక్షేప శారీరకములో చెప్పియున్నారు.కర్తృత్వాదులు బుద్ధి ధర్మములు, ప్రత్యగాత్మ స్వయంప్రకాశమై, కర్తృత్వ ప్రమాతృత్వాది ధర్మములకు సాక్షియైఉన్నది. స్ఫటికముయొక్క సాన్నిధ్యముననున్న జపాకుసుమముయొక్క రక్తవర్ణము స్ఫటికమునందు దోచునట్లు, ప్రత్యగాత్మయొక్క సాన్నిధ్యములోనున్న బుద్ధిధర్మములు ప్రత్యగాత్మయందు భ్రాంతిచే అనగా అజ్ఞానావృత దృష్టిచే, అహం కర్తా, అహం భోక్తా, అహం దుఃఖీ, అహం సుఖీ ఇత్యాది అహంకారగత సాంసారిక ధర్మములు నీయందు ప్రతీతమగుచున్నవి.

సత్యము కాదు.అహంకారముతోగాని, దాని ధర్మములతోగాని నీకు స్పర్శగూడ లేదు.

న సాక్షిణం సాక్ష్యధర్మాః సంస్పృశన్తి విలక్షణమ్ ।

అవికారముదాసీనం గృహధర్మాః ప్రదీపవత్ ॥(కుండికోపనిషత్ ౨౩)కావున,ఆత్మ నిత్యముక్త బ్రహ్మస్వరూపమున్నదని సతతము చింతనము చేయాలి ॥ ౧౦ ॥

## ఆత్మ అవస్థాతీతము

నన్వేవమప్యాత్మనోజాగ్రదాద్యవస్థావత్త్వంవక్తవ్యమ్ అహంకారస్యసుషుప్తావభావేన సుషుప్త్యవస్థావత్త్వానుపపత్తౌ జాగ్రత్స్వప్నావస్థాద్వయసంబన్ధిత్వస్యాప్యనుపపత్తేస్తాసాంతిసృణామప్యేకాశ్రయత్వనియమాదిత్యాశఙ్క్య,అహంకారస్య సుషుప్తౌ సంస్కారరూపేణ వర్తమానత్వాత్తస్యైవ సుషుప్తిర్నాత్మనః,తస్య సుషుప్తిసాక్షిత్వాత్, తతో జాగ్రత్స్వప్నావప్యహంకారస్యైవేత్యభిప్రేత్యాహ సుప్తేతి —

**శంక:**-పూర్వోక్తరీత్యా సంసారము అహంకారమునకేగాని,ఆత్మకు లేదు-అని సిద్ధించిననూ,ఆత్మ జాగ్రదాద్యవస్థలు గలదియని చెప్పాలి.ఎందుకనిన,సుషుప్త్యవస్థలో అహంకారము యొక్క అభావమున్నందున,దానికి సుషుప్త్యవస్థ గలదని చెప్పుట అయుక్తము. అహంకారమునకు సుషుప్త్యవస్థ లేదు-గావున, జాగ్రత్స్వప్నములు-ఈ రెండవస్థలుగూడ,దానికి చెప్పుట తగదు. ఏలయన,ఈ మూడవస్థలుగూడ ఏకాశ్రయములు=ఒకే ఆశ్రయ

మునందుంటాయను నియమము గలదు.మరియు"సుఖమహ మస్వాప్సమ్,న కించిదవేదిషమ్"అని యే సుప్తోత్థిత పురుషుడు పరామర్శ చేస్తున్నాడో,అతడే"స్వప్నమహమద్రాక్షమ్"అని సుషు ప్తి స్వప్నములు-ఈ రెండవస్థల అనుభవమును జాగ్రదవస్థలో స్మరించి చెప్తున్నాడు.ఈపరామర్శను విచారించినచో, సుషుప్తి, స్వప్నము మరియు జాగ్రత్తు-ఈ మూడవస్థలు ఒక్కరికే గలవని (ఏకాశ్రయములుగా)స్పష్టమగుచున్నవి. అవస్థాత్రయమునకు ఆ శ్రయము ఆత్మయే.ఇది సర్వలోక ప్రసిద్ధముగూడ.అట్లు కానిచో, పై ప్రత్యభిజ్ఞానమునకు విరోధమేర్పడగలదు. పూర్వానుభవము యెవరికి గలదో,అతనికే కాలాంతరమున స్మృతి కలుగుతుంది. ఈనియమానుసారము అవస్థాత్రయము ఆత్మకే గలదు, అహం కారమునకు లేదు.

**సమాధానము:**-సుషుప్తిలోఅహంకారముయొక్క అత్యంతా భావము లేదు. అక్కడకూడ అహంకారము సంస్కారరూపము చేనున్నది.అందువల్ల,అహంకారమునకు సుషుప్తి అవస్థగలదు- అని చెప్పుట తగును.ఆత్మకు లేదు.ఆత్మ సుషుప్త్యవస్థకు సాక్షి యైయున్నది.కావున,అవస్థాత్రయము ఏకాశ్రయమునందుండు నను నియమానుసారము జాగ్రత్స్వప్నములుగూడ అహంకార మునకే గలవు.ఈ అభిప్రాయమునే ముందర శ్లోకముచే చెప్పు చున్నాడు.

**సుప్తః సుప్తిం న జానాతి నాసుప్తే స్వప్నజాగరౌ ।**

**జాగ్రత్స్వప్నసుషుప్తీనాం సాక్ష్యతోఽహమతద్దశః ॥ ౧౧ ॥**

**అన్వయము:-**సుప్తః సుప్తిం న జానాతి అసుప్తే స్వప్నజాగరౌ న, అతః అతద్దశః, అహమ్ జాగ్రత్స్వప్నసుషుప్తీనామ్ సాక్షీ.

**అన్వయార్థము:-**సుప్తః=సుషుప్త్యవస్థలోనిద్రించినవాడు; సుప్తిం=సుషుప్తిని;న జానాతి=తెలిసికోలేడు(కావున, అహంకారమే సుషుప్త్యవస్థ గలది),అసుప్తే=సుషుప్త్యవస్థారహిత ప్రత్యగాత్మయందు;స్వప్నజాగరౌ=స్వప్నము మరియు జాగ్రదవస్థగూడ; న=లేవు;అతః=అందువలన;అతద్దశః=ఈదశలు=అవస్థలు లేని; అహమ్=నేను;జాగ్రత్స్వప్నసుషుప్తీనామ్=అవస్థాత్రయమునకు-సాక్షి మాత్రుడనై యున్నాను.

**టీకా:-**యః సుప్తః సుప్తిం న జానాతి=నవేత్తి సోఽహంకార ఏవ,సుప్తః=సుషుప్త్యవస్థావాన్,నైవాత్మా।కుతః?సుషుప్తితాత్కాలీనాజ్ఞానసాక్షితయా జాగరూకత్వాదిత్యర్థః । తతశ్చాసుప్తే=సుషుప్త్యవస్థారహితే ప్రత్యగాత్మని స్వప్నజాగరౌ న భవతః, తయోఃసుషుప్త్యవస్థాసమానాశ్రయత్వాదిత్యర్థః।

నిద్రించిన అహంకారము నిద్రను తెలిసికోజాలదు. అందువలన,అహంకారమే సుషుప్త్యవస్థ గలది.ఆత్మ కాదు.ఆత్మ సుషుప్తికాలీన అజ్ఞానమునుప్రకాశిస్తూ,నిత్యము జాగరూకమై (అలుప్త ప్రకాశస్వరూపమై)యున్నందున,సుషుప్త్యవస్థారహిత ప్రత్యగాత్మకు జాగ్రత్స్వప్నములు-యీ రెండవస్థలుగూడ లేవు. కారణమేమనగా!మూడవస్థలు సమానాశ్రయము (ఏకాశ్రయము) గలవై

యుండునను నియమము గలదు.కావున,ఆత్మ జాగ్రదాద్యవస్థా రహితమున్నది.

హేత్వన్తరమప్యాహ జాగ్రదిత్యాదినా। యతో జాగ్రత్స్వప్నసుషుప్తీనాంసాక్షీ=ద్రష్టా,అతోఽహమాత్మా అతద్దశః, తా జాగ్రదాద్యా దశా అవస్థా యస్య స తద్దశః;తద్దశో న భవతీత్యతద్దశః= జాగ్రదాద్యవస్థారహిత ఇత్యర్థః । అత్రేదమనుమానం వివక్షితమ్ । ఆత్మా జాగ్రదాద్యవస్థావాన్నభవతి జాగ్రదాద్యవస్థాసాక్షిత్వాత్, 'యో యత్సాక్షీ న స తద్ధర్మవాన్యథా ఘటసాక్షీ న ఘటధర్మవాన్'ఇతి ।

మరొకహేతువేమనగా!ఆత్మ అవస్థాత్రయమునకు సాక్షియై ఉన్నది.అందువల్ల,ప్రత్యగాత్మ''అతద్దశః''=జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు లేనిదైయున్నది. ఈ అవస్థలు దేనికి యుండునో, అది ''తద్దశః''అనబడును.ఇచ్చట ఈ అనుమాన ప్రయోగముచేయవలెను. ఆత్మ జాగ్రదాద్యవస్థలు గలది కాదు(ప్రతిజ్ఞా); జాగ్రదాద్యవస్థలకు సాక్షియై ఉన్నందున(హేతువు);యేది దేనికి సాక్షియై యుండునో అది తద్ధర్మములుగలదై యుండదు(వ్యాప్తి);ఉదా:- ఘటమును చూచువానికి ఘట ధర్మములుండవు గదా!

తదుక్తమన్వర్థనామసర్వజ్ఞాత్మమునిభిః-**'తిస్రోఽపిచిద్ఘనతనోస్తవ దృశ్యభూతా దూరే చకాసతి మతేర్బహిరేవ తావత్ । ఆవిస్తిరోభవనధర్మతయాహ్యవస్థాః కఃసంకరో విమలచిద్వపుషస్తవాభిః** (సం.శా.౩-౧౩౬) ఇతి ॥ ౧౧ ॥

ఈ విషయమును అన్వర్థనామము(సార్థక నామధేయము) గల శ్రీ సర్వజ్ఞాత్మ మునీంద్రులవారు ఇలా సెలవిచ్చియున్నారు. స్వయంప్రకాశ(నిత్యజ్ఞాన)స్వరూపుడవగు నీకు జాగ్రదాద్యవస్థాత్ర యము విషయత్వముచే తెలియబడుచున్నది. అనగా నీవు ఆ మూడవస్థలకంటె వేరుగా ఉండి, వాటిని తెలుసుకుంటున్నావు. కాబట్టి,ఆ అవస్థలతో నీకు తాదాత్మ్యము(అభేదము)లేదు. అన గా, ఆవిర్భావ తిరోభావములుగల ఆ అవస్థాత్రయముతో నిత్య శుద్ధజ్ఞానస్వరూపుడవైన నీకు తాదాత్మ్యమెట్లు సంభవించును?

జాగ్రదాద్యవస్థాలక్షణపర్యాలోచనయాఽపి నాత్మనోఽవస్థా సంబంధ ఇత్యాహ —

జాగ్రదాది అవస్థలయొక్క లక్షణములను విచారించినను గూడ ఆత్మకు అవస్థలతో యే సంబంధమునూ లేదు - అని తెలుపుచున్నాడు.

**విజ్ఞనవిరతిః సుప్తిస్తజ్జన్మ స్వప్నజాగరౌ ।**

**తత్సాక్షిణః కథం మే స్యుర్నిత్యజ్ఞానస్య తే త్రయః ॥౧౨॥**

**అన్వయః** :-విజ్ఞాన విరతిః సుప్తిః, తజ్జన్మ స్వప్నజాగరౌ తే త్రయః తత్సాక్షిణః నిత్య జ్ఞానస్య మే కథమ్ స్యుః ?

**అన్వయార్థము:**-విజ్ఞానవిరతి:=విశేషజ్ఞానముయొక్క ఉప రతి;సుప్తి:=సుషుప్తిఅవస్థ(యనబడును);మరియు, తజ్జన్మ=విశే షజ్ఞానముయొక్కఉత్పత్తియగుట;స్వప్నజాగరౌ=స్వప్నము మరి యు జాగ్రత్తుఅగును;తేత్రయః=ఆ మూడవస్థలు;తత్సాక్షిణ:=వా

టికి సాక్షి; నిత్యజ్ఞానస్య=నిత్యజ్ఞాన స్వరూపుడనగు; మే=నాకు (ఆత్మకు) కథమ్=ఎట్లు; స్యుః=ఉండును?

**టీకా:**-విజ్ఞానవితిర్విజ్ఞాస్య=విశేషజ్ఞానస్య విరతిరుపరతిః సుప్తిరిత్యుచ్యతే;తజ్జన్మ తస్య విశేషజ్ఞానస్య జన్మ=ఉత్పత్తిః స్వప్న జాగరావిత్యుచ్యేతే;తత్రాపి వాసనామయప్రపఞ్చవిజ్ఞానంస్వప్నః, స్థూలప్రపఞ్చవిజ్ఞానంజాగ్రదితి విభాగ ఇత్యర్థః ।తతః కిమ్?తత్రాహ-తత్సాక్షిణ ఇత్యాదినా ।నిత్యజ్ఞానస్యాలుప్తచిద్రూపస్య తత్సాక్షిణ=ఉక్తలక్షణసుషుప్త్యాదిసాక్షిణోమే=మమాత్మనస్తే త్రయః సుషుప్తిస్వప్నజాగరాః కథం స్యుః? న కథంచిదిత్యర్థః ।

అంతఃకరణమునందు ప్రతిబింబిత ఆత్మచైతన్యమునకు విశేషజ్ఞానము అందురు.ఈ విశేషజ్ఞానముయొక్క ఉపరతి(లయము)నకు-సుషుప్తియందురు.విశేషజ్ఞానముయొక్కఉత్పత్తియనగా స్వప్నజాగరములు. అందులోగూడ వాసనారూప ప్రపంచ విజ్ఞానమునకు స్వప్నమందురు.మరియు స్థూలప్రపంచ విజ్ఞానమునకు జాగ్రత్తు అందురు-ఇంత భేదము గలదు.

శ్రీ జగద్గురు ఆద్య శంకరాచార్యులవారు పంచీకరణములో జాగ్రత్తు స్వప్నము మరియు సుషుప్తియొక్క లక్షణములు ఈ ప్రకారముగా చేసియున్నారు.

౧."ఇంద్రియైరర్థోపలబ్ధిః జాగరణమ్"।చక్షురాదీంద్రియములవలన(పదునాలుగు త్రిపుటులచే)గలుగు రూపాది విషయవిజ్ఞానమే జాగ్రదవస్థయనబడును.

౨."కరణేషూపసంహృతేషు జాగరిత సంస్కారజః ప్రత్యయః సవిషయః స్వప్న ఇతుచ్యతే"।ఇంద్రియములు తమతమ వ్యాపార ములను ఉపసంహరించుకొనగా,జాగ్రదవస్థయందలి సంస్కార ములవలన పుట్టినదియు,విషయములతో కూడినదైన,దృఢమైన అనుభూతియే స్వప్నమనబడును.

౩."సర్వప్రకార జ్ఞానోపసంహారే బుద్ధేఃకారణాత్మనా అవస్థా నం సుషుప్తిః"అన్నివిధముల(జాగ్రద్విషయక మరియు స్వప్నసం బంధి)విషయజ్ఞానము సమసిపోయి, బుద్ధి కారణరూపముగా నుండుటయే సుషుప్తియగును.

ఈ లక్షణములవలన యేమి సిద్ధించినది?అంటే,చెప్పుచు న్నాడు."నహివిజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే అవినాశిత్వా త్"(బృ.౪-౩-౩౦)అవినాశిస్వరూపుడనై, ఎప్పుడునూ లోపించని జ్ఞానముచేఅవస్థాత్రయమును నిత్యము ప్రకాశించు సాక్షి స్వరూ పుడనగు నాకు సుషుప్తి, స్వప్నము మరియు జాగ్రదవస్థలు ఎ లా ఉండగలవు? ఎప్పుడునూ ఉండనేరవు.

అయంభావః:-సుషుప్త్యవస్థాయాం తావత్సుషుప్తితాత్కాలి కాజ్ఞానావభాసకం కించిచ్చైతన్యమఙ్గీకార్యంసర్వైరపి అన్యథోత్థి తస్య పురుషస్య'సుఖమహమస్వాప్సం న కించిదవేదిషమ్' ఇతి సుషుప్తితాత్కాలికాజ్ఞానపరామర్శానుపపత్తేః।తచ్చైతన్యం నజన్య మ్,మనశ్చక్షురాదేఃసుప్త్యన్తఃపాతిత్వాత్।అనన్తం చ తదజన్యభా వస్యనిత్యత్వనియమాత్,తచ్చైతన్యమస్మాభిరాత్మేత్యుచ్యతే।**"స వా**

**ఏషమహానజ ఆత్మా"**(బృ.౪-౪-౨౫)ఇతిశ్రుతేః। తథాచ కథమనాది నిత్యజ్ఞానస్వరూపస్యాత్మనోజ్ఞానోపరమరూపా సుషుప్తిః, జ్ఞానోత్పత్తిరూపౌ స్వప్నజాగరౌ చ స్యుః।అహంకారస్య తు జన్యవృత్తి రూపజ్ఞానాశ్రయత్వాత్తత్త్రయముపపద్యతే। తతశ్చాత్మా జాగ్రదా ద్యవస్థారహిత ఇత్యర్థః॥ ౧౨ ॥

అభిప్రాయమేమనగా,సుషుప్త్యవస్థయందు సుషుప్తిని మరియు తాత్కాలీన అజ్ఞానమును ప్రకాశించునది,యేదో ఒక చైతన్యమును ఎవరైననూ అంగీకరించవలసినదే. ఒకవేళ ఇట్లు అంగీకరించనియెడల, "నేను సుఖముగా నిద్రించితిని, నేనేమియు తెలియకుంటిని" అను సుషుప్తికాలీన అజ్ఞానముయొక్క స్మృతి అనుపపన్నమగును.సుషుప్తికాలిక అజ్ఞానమును ప్రకాశించు చైతన్యము(జ్ఞానము)అజన్యము(ఉత్పత్తిరహితము)అని చెప్పవలయును.ఏలయన,జ్ఞానమును ఉత్పన్నముజేయు సాధనములగు మనస్సు మరియు చక్షురాదీంద్రియములు సుషుప్తియందు అంతర్భూతమై(లీనమై)యున్నవి.అందుకే,సుషుప్తియందలి అజ్ఞానమును ప్రకాశించుచైతన్యము(జ్ఞానము)ఉత్పత్తిరహితము మరియు అవినాశియై ఉన్నది.ఎందుకంటే,యే పదార్థము భావరూపమై మనశ్చక్షురాదులచే అజన్యముండునో,అది నిత్యముండునను నియమము గలదు.అట్టి పదార్థము చైతన్యమొక్కటే. నిత్య జ్ఞానస్వరూపమగు ఆ చైతన్యమునకే మేము ఆత్మ—అని చెప్తున్నాము."స వా ఏషమహానజఆత్మా"(బృ.౪-౪-౨౫) ఆత్మయొ

క్క అనాదిత్యమును అనగా,ఉత్పత్తి లేనిదని మరియు వ్యాపకత్వమును శ్రుతిమాత ప్రతిపాదించుచున్నది.

అలాంటప్పుడు,అనాది నిత్యజ్ఞానస్వరూపమగు ప్రత్యగాత్మయందు,జ్ఞానముయొక్క విరతి:=నివృత్తిరూప సుషుప్తిగాని, జ్ఞానముయొక్క ఉత్పత్తిరూప స్వప్నజాగ్రత్తులుగాని ఉండుట యెట్లు సంభవము?అహంకారము ఉత్పత్తి నాశములుగల అనిత్యజ్ఞానమునకు ఆశ్రయమున్నది.ఇట్లు అవస్థాత్రయము గలది అహంకారమేయని సిద్ధించినమీదట,ఆత్మ జాగ్రదాద్యవస్థారహితము-అని అర్థతః సిద్ధించినది ॥ ౧౨ ॥

**ఆత్మా నిర్వికారి**

ఇదానీమాత్మానో నిర్వికారబ్రహ్మాభేదాయ షడ్భావవికారరాహిత్యం సాధయతి —

ఇప్పుడు,ఆత్మ నిర్వికారబ్రహ్మముతో నభిన్నమున్నదను విషయమును ప్రదర్శించుటకై, ఆత్మ-షడ్భావవికారరహితమున్నదని ఉత్తర శ్లోకము ద్వారా చెబుతున్నాడు -

**షడ్వికారవతాం వేత్తా నిర్వికారోఽహమన్యథా ।**

**తద్వికారానుసంధానం సర్వథా నావకల్పతే ॥ ౧౩ ॥**

**అన్వయము:-**షడ్వికారవతామ్ వేత్తా అహమ్ నిర్వికారః, అన్యథా తద్వికారానుసంధానమ్ సర్వథా న అవకల్పతే ॥

**అన్వయార్థము:-**షడ్వికారవతామ్=ఆరు వికారములు గల

దానిని;వేత్తా=తెలుసుకొనువానిని;అహమ్=ప్రత్యగాత్మనగు నేను; నిర్వికారః=వికారహీనుడనున్నాను; అన్యథా=ఒకవేళ అట్లు కానియెడల; తద్వికారానుసంధానమ్=ఆ వికారి వస్తువులయొక్క వికారముల అనుభూతి; సర్వథా=ఏప్రకారముచేగూడ న అవకల్పతే=సంభవించదు.

**టీకా:-**షడ్వికారవతామ్=షడ్భావవికారవతామ్, షట్ చ తే భావవికారాశ్చషడ్భావవికారాః“**జాయతే,అస్తి, వర్ధతే, విపరిణ-మతే, అపక్షీయతే, వినశ్యతి**” ఇత్యుక్తాః । తే యేషాం సన్తి తే షడ్భావవికారవన్తస్తేషాంబాహ్యాఘటాదీనామాన్తరబుద్ధ్యాదీనాం చ వేత్తా=జ్ఞాతాఽతోఽహమాత్మా నిర్వికారః=వికారరహితో భవామి ।ఆత్మాహి బాహ్యాన్తరవస్తునాముత్పత్త్యాదివికారాఞ్జానాతి, అతో నిర్వికారో భవితుమర్హతి,‘యో యజ్జానాతి న స తద్ధర్మవాన్’ఇతి వ్యాప్తేర్లోకప్రసిద్ధత్వాదిత్యర్థః।తదుక్తం శ్రీ వార్తికకృతా- **“నర్తే స్యాద్విక్రియాం దుఃఖీ సాక్షితా కా వికారిణః। ధీవిక్రియా సహస్రాణాం సాక్ష్యతోఽహమవిక్రియః”**(నై.సి.౨-౭౭) ॥ ఇతి ॥

జాయతే,అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే మరియు వినశ్యతి—అను ఆరువికారములుగల బాహ్యాఘటాదులను మరియు బుద్ధ్యాదిఆంతరపదార్థములను తెలుసుకొను (ప్రకాశించు) ఆత్మనగు నేను నిర్వికారుడనైయున్నాను.బాహ్యాభ్యంతరవస్తువులయొక్క ఉత్పత్త్యాది షడ్భావవికారములను ప్రకాశించునది నిర్వికారమగు ఆత్మయే యగుటకు యోగ్యమున్నది.“యో యజ్జానాతి న స తద్ధర్మవాన్” ఏది దేనిని తెలిసికొనునో అది దాని

ధర్మములు గలదై యుండదు- అను వ్యాప్తి నియమమున్నది, మరియు లోక ప్రసిద్ధముగూడ.

ఆత్మయొక్క నిర్వికారత్వమును శ్రీ సురేశ్వరాచార్యులవారు (నై.సి.౨-౭౭)లో యిట్లుతెలిపియున్నారు.వికారమునుపొందకుండా దుఃఖిత్వము సంభవించదు. దుఃఖిత్వాది వికారములుగల బుద్ధికిసాక్షిత్వమెట్లు?బుద్ధియొక్క సుఖదుఃఖరాగద్వేషాది అనంతవికారములను తెలిసికొను సాక్షినగు నేను సర్వదా నిర్వికార స్వరూపుడనైయున్నాను.

విపక్షే దోషమాహ—అన్యథేత్యాదినా ।అన్యథా వికారసాక్షిణోఽపి వికారిత్వే,తద్వికారానుసంధానం=తేషాం వికారివస్తూనాం యేవికారాస్తేషామనుసంధానం సర్వథా=సర్వప్రకారేణాపి నావకల్పతే=న సంభవతీత్యర్థః । అయమభిసంధిః-ఆత్మనోఽపి వికారిత్వే కిమాత్మన ఇతరేషాం చ వికారా ఆత్మనా జ్ఞాయన్తే ఉతేతరైః?నోభయథాపి, వికారివస్తునో మృదాదివజ్జడత్వనియమాదితి ॥ ౧౩ ॥

వికారిపదార్థములయొక్కవికారములను ప్రకాశించు సాక్షి గూడ వికారియన్నచో వికారివస్తువుల వికారములయొక్క అనుసంధానము (అనుభవము) యెవరికి, యెట్లు కలుగును? ఏప్రకారముచే గూడ కలుగదని భావము.

తాత్పర్యమేమనగా!ఒకవేళ ఆత్మగూడ వికారియని అంగీకరించినచో,తనయొక్క మరియు అన్యవస్తువులయొక్క వికార

ముల జ్ఞానము-ఆత్మకే కలుగుతుందా?లేదా ఇతరవస్తువులకు కలుగుతుందా?రెండు ప్రకారములచేగూడ వికారముల జ్ఞానము కలుగుట సంభవించదు.ఎందుకనగా!వికారివస్తువు మృదాదులవలె జడమే ఉండునను నియమము గలదు ॥ ౧౩ ॥

కిం చ వికారివస్తునో వికారాణాం చ కిం భేద ఉతాభేదః? నాద్యః, భిన్నయోర్గవాశ్వయోరివ వికారవికారిభావానుపపత్తేరిత్యభిప్రేత్య ద్వితీయపక్ష దూషణమాహ —

ఇంతేగాకుండా,వికారివస్తువునకు మరియు వికారములకు భేదమున్నదా?లేక అభేదమున్నదా? అని విచారించినచో, భేదమున్నదను ప్రథమ పక్షము సిద్ధించదు. కారణమేమనగా! అత్యంత భిన్నములగు గవాశ్వము(గోవు మరియు గుఱ్ఱము)లలో యేది వికారి, యేది వికారము-అని నిర్ణయించుటకు శక్యముగాదు.కావున,వాటిలో వికారవికారిభావము సంభవించదు.ఈ అభిప్రాయమును మనసునందుంచుకొని, రెండవ పక్షమునందు దోషమును చూపెడుతున్నాడు.

**తేన తేన హి రూపేణ జాయతే లీయతే ముహుః ।**

**వికారివస్తునస్తేషామనుసంధాతృతా కుతః ॥ ౧౪ ॥**

**అన్వయః** :-వికారివస్తునః తేన తేన రూపేణ ముహుః జాయతే చ లీయతే హి (యస్మాత్ ఏవమ్ తస్మాత్) తేషామ్ (వికారాణామ్) అనుసంధాతృతా కుతః? ॥ ౧౪ ॥

**అన్వయార్థము:**-వికారివస్తునః=వికారివస్తువునకు;తేనతేన

రూపేణ=ఉత్పత్త్యాదిభిన్నభిన్నరూపములచే;ముహుః=మళ్ళీమళ్ళీ ;జాయతేలీయతే=ఉత్పత్తివినాశములు ప్రాప్తించుచుండును; (ఇట్టి స్థితిలో)తస్య=ఆవస్తువునకు=తేషామ్=ఈఉత్పత్త్యాది వికారములయొక్క;అనుసంధాతృతా=స్వయముగావికారియై ఉండగా వికారముయొక్క అనుసంధానము=అనుభవము; కథమ్=ఎట్లు కలుగును?

**టీకా:-**తేన తేన రూపేణోత్పత్త్యాదివికారరూపేణ తదభిన్నం వికారివస్త్వపి జాయత ఉత్పద్యతే ముహుః శశ్వల్లీయతే నశ్యతి చ, తయోరభేదాదిత్యర్థః ।హి=యస్మాదేవం తస్మాత్తస్య వికారి వస్తునస్తేషాం వికారాణామనుసంధాతృతా కుతః?న కుతోఽపి భవేదిత్యర్థః।తత్తద్వికారరూపేణ తదా తదా నశ్యతో వికారివ-స్తునః కథం కాలాన్తరీయం వికారానుసంధానం ఘటతే? న కథఞ్చిదిత్యర్థః ॥౧౪॥

ఉత్పత్త్యాది ఆయా వికారములచేనభిన్నమున్నందున, వికారివస్తువుగూడ పునఃపునః ఉత్పత్తివినాశములను పొందుచుండును.అలాంటపుడు,ఆయా వికారరూపములతోపాటు నశించు వికారివస్తువునకు కాలాంతరములోకలుగు అన్యవికారముల యొక్క అనుసంధానము=ప్రకాశకత్వము ఎట్లు సంభవము? ఏవిధముగా కూడ సంభవించదని భావము॥ ౧౪ ॥

నన్వాత్మా స్వయంవికారీ సన్నప్యాత్మన ఇతరేషాం చ వికారాన్విజానాతు;నచ తస్య వికారిత్వావిశేషే కథం స్వేతరపరిజ్ఞా

నమితి వాచ్యమ్, శిలాత్వావిశేషేఽపి రత్నస్య స్వభావవిశేషేణ స్వేతరావభాసకత్వవదాత్మనోఽపి స్వభావవిశేషేణ స్వేతరవికారానుసంధానోపపత్తేః న చ తేన తేన వికారేణ సాకం నష్టస్య కథం సర్వవికారానుసంధానమితివాచ్యమ్,తస్య వికారిణ ఆత్మనోవికారైరత్యన్తాభేదస్యానఙ్గీకారాత్,కింతుఈషద్భేదఘటితోఽభేదస్య తాదాత్మ్యస్యైవ తన్తుపటయోరివాఙ్గీకారాదిత్యాశఙ్క్య,ఏవమప్యాత్మన ఆద్యన్తవికారద్వయానుసంధానం న సంభవతీత్యాహ–న చేతి ॥

శంక:-స్వామీజీ!ఆత్మ స్వయముగా వికారి అయ్యును-తన యొక్క మరియు ఇతరముయొక్క వికారములను తెలిసికొనునన్నచో ఆపత్తి ఏమిటి?ఒకవేళ మీరు ఇట్లు అనవచ్చును—ఎట్లు ఆత్మేతరములు వికారివస్తువులు గావున,వికారి అనబడునో, అట్లే,ఆత్మగూడ-వికారియగును,వికారివస్తువులు జడములుండును. ఆత్మనుగూడ వికారియన్నచో, అదిగూడ జడమగును. ఇట్టి జడత్వము మరియు వికారిత్వ సామాన్యమున్నందున, ఆత్మ తనయొక్క మరియు ఇతరముయొక్క వికారములను ఎట్లు తెలిసికొనును?సంభవము లేదు.జగదాంధ్య ప్రసంగమేర్పడును.

ఓ సిద్ధాంతీ!ఇట్లు చెప్పుట కూడదు.ఎందుకనగా!రాళ్లు మరియు రత్నములలోపాషాణత్వముసాధారణమేయైనను,రత్నము తనయొక్క ప్రకాశకత్వ స్వభావవిశేషముచే తనను మరియు ఇతర పదార్థములనుగూడ ప్రకాశించునుగదా!అట్లే, ఆత్మయం

దుగూడ ప్రకాశకత్వమను స్వాభావిక విశేషగుణము గలదు.దానిచే ఆత్మ తనను మరియు ఇతరపదార్థములనుగూడ అనుసంధానము చేయుట ఉపపన్నమగును.

ఇచ్చట సిద్ధాంతి ఇట్లనవచ్చును. ఏమనగా, ఆయా వికారములతోపాటు నష్టమగు వికారిఆత్మకు సర్వవికారముల అను-సంధానమెట్లు సంభవము?ఇట్టి శంక తగదు.ఏలయన, వికారియగు ఆత్మకు వికారములతోపాటు అత్యంత అభేదము మేము చెప్పుటలేదు.మరేమనగా,తంతుపటములకువలె,ఈషద్భేద(స్వల్ప భేద)సహిత అభేదరూప తాదాత్మ్యమును(అభేదమును) ఒప్పుచున్నాము.అందువలన,ఆత్మకు వికారములయొక్క అనుసంధానమెట్లు సంభవము? అను దోషము రాదు.

ఇట్లు శంక ప్రాప్తించగా,నీవు చెప్పినట్లుగా స్వీకరించిననూ, ఉత్పత్తి మరియు నాశనములు-అను ఆద్యంతవికారములను అనుసంధానము చేయుట సంభవించదు-అని ఉత్తర శ్లోకము ద్వారా చెప్పుచున్నాడు.

**న చ స్వజన్మ నాశం వా ద్రష్టుమర్హతి కశ్చన ।**

**తౌ హి ప్రాగుత్తరాభావచరమప్రథమక్షణౌ ॥ ౧౫ ॥**

**అన్వయః** :-కశ్చన స్వజన్మ నాశం వా ద్రష్టుం నచ అర్హతి, హి (తస్మాత్)తౌ(జన్మనాశౌ)ప్రాగుత్తరాభావ చరమ ప్రథమక్షణౌ ॥ ౧౫ ॥

**అన్వయార్థము:**-కశ్చన=ఎవరుగూడ;స్వజన్మనాశం వా=త

నయొక్క జన్మనుగాని,నాశనమునుగాని;ద్రష్టుమ్=తెలిసికొను టకు;నచఅర్హతి=సమర్థుడు కాజాలడు;హి=ఎందుకంటే;తౌ=ఉత్పత్తి వినాశములు;ప్రాగుత్తరాభావ చరమప్రథమక్షణౌ=క్రమముగా ప్రాగభావ అంతిమక్షణము మరియు ప్రధ్వంసాభావ ప్రథమక్షణములగును."ప్రాగభావ అంతిమక్షణము జన్మము మరియు ప్రధ్వంసాభావ ప్రథమక్షణము నాశనము".ఉత్పత్తి వినాశముల స్వరూపమిట్లుండగా, యీరెండు వికారముల అనుసంధానము అశక్యము.

**టీకా:-**కశ్చన=కశ్చిన్నిపుణోఽపి స్వజన్మ స్వోత్పత్తి నాశం ధ్వంసం వా ద్రష్టుం=జ్ఞాతుంనార్హతి,న శక్నోతీత్యర్థః। తత్ర హేతుమాహ–తౌ హీత్యాదినా ।హి=యస్మాత్తౌ జన్మనాశౌ ప్రాగుత్తరాభావ చరమప్రథమక్షణౌ,ప్రాగుత్తరౌ యావభావౌ తౌ ప్రాగభావ ప్రధ్వంసాభావౌ, తదీయౌ,యౌ చరమప్రథమక్షణౌ,తౌ ప్రాగుత్తరాభావచరమప్రథమక్షణౌ,ప్రాగభావచరమక్షణముత్పత్తిఃవస్తునః ప్రధ్వంసాభావప్రథమక్షణో నాశఇత్యర్థః।యస్మాజ్జన్మనాశౌ,ప్రాగుత్తరాభావచరమప్రథమక్షణౌ, తస్మాత్స్వజన్మ నాశం వా ద్రష్టుం నార్హతీతి సంబన్ధః ।

ఎంతటి నిపుణుడైన పురుషుడుగూడ,తనయొక్క జన్మనాశములను తెలిసికొనుటకు సమర్థుడు కాజాలడు. కారణమేమనగా!ఉత్పత్తికంటె పూర్వముండు అభావము-ప్రాగభావము. దాని అంతిమక్షణము జన్మ యనబడును. మరియు నాశనమైన తరువాత ఉండు అభావము-ప్రధ్వంసాభాము,దాని ప్రథమ క్షణ

ము నాశనము అనబడును.అనగా,ప్రాగభావ అంతిమక్షణః-జన్మః;ప్రధ్వంసాభావ ప్రథమక్షణఃమరణః(నాశః).శాస్త్రములో జన్మ నాశముల లక్షణములు ఇట్లు వ్యాఖ్యానించబడియుండగా,తన యొక్క అవిద్యమాన కాలములో ప్రాగభావ అంతిమ క్షణరూప తన ఉత్పత్తిని మరియు తనయొక్క స్థితికాలములో ప్రధ్వంసాభావ ప్రథమ క్షణరూప తన నాశమును తెలిసికొనుట ఎట్లు సంభవము? అశక్యమని భావము.

ఏలయన,తెలిసికొనుట-అనుజ్ఞానరూపవ్యవహారము జన్మరూప-వికారానంతరము మరియు నాశరూప వికారమునకు పూర్వము,స్థితిరూప వికారకాలములో జరుగును. జన్మనాశములు-అనుయీరెండు వికారముల కాలములో,స్థితిరూప వికారకాలము లేనేలేదు.ఇట్లుండగా,మనుష్యుడు ఎంతటి ప్రవీణుడైననూ,స్వజన్మనాశములు-అను ఉభయవికారములను తెలిసికొనుట(చూచుట)సంభవము లేదు.

ఇదమత్రాకూతమ్–ఆత్మాహి స్వసమానకాలీనవస్త్వేవ జానాతీతి వక్తవ్యమ్, దీప ఇవ స్వసమానకాలీనపదార్థావభాసకః। తథాచ స్వావస్థానసమయేఽవిద్యమానయోః ప్రాగభావప్రధ్వంసాభావయోః పరిజ్ఞానాభావే,కథం ప్రాగభావచరమక్షణరూపం స్వజన్మ,ప్రధ్వంసాభావప్రథమక్షణరూపం నాశంచ జానీయాత్? న కథఞ్చిదపీత్యర్థః। తయోశ్చాసిద్ధౌ మధ్యవర్తివికారాణామప్యసిద్ధిరేవ, తేషామపి వికారాణాముత్పత్తినాశసమానాశ్రయత్వనియమాత్। తదుక్తం వాక్యవృతౌ శ్లో.౨౭ శ్రీభగవత్పాదైః– "దేహే

న్ద్రియమనప్రాణాహంకృతిభ్యో విలక్షణః ప్రోజ్ఝితాశేషషడ్భావవికా రస్త్వం పదాభిధః”।ఇతి । తతశ్చాత్మా నిర్వికారత్వాద్ద్వహ్మైవేత్యర్థః ॥౧౫॥

ఇక్కడ ఈ గూఢాభిప్రాయము గలదు—దీపము తన స్థితి కాలము(సమానకాలము)లోని పదార్థములను మాత్రము ప్రకా శించును-అని ఒప్పుకొనక తప్పదు.అట్లే,ఆత్మగూడ స్వసమాన కాలములోని పదార్థములను మాత్రము ప్రకాశించును(తెలిసి కొనును).ఇట్లుండగా,తనయొక్కస్థితికాలములోలేని ప్రాగభావ, ప్రధ్వంసాభావముల జ్ఞానమే కలుగనపుడు, ప్రాగభావ అంతిమ క్షణరూప తన జన్మమును మరియు ప్రధ్వంసాభావ ప్రథమ క్ష ణరూప తన నాశమును,అనగా తనయొక్క జన్మనాశములు-అను రెండు వికారములను తెలిసికొనుట యెవరికి, ఎప్పుడూ, యేప్రకారముచేగూడ సాధ్యముకాదు(శక్యముగాదు).ఎప్పుడైతే జాయతే,అస్తి,వర్ధతే,విపరిణమతే,అపక్షీయతే మరియు వినశ్యతి —అను షట్ భావవికారములలో ఆద్యంతములగు జన్మనాశ ములను తెలిసికొనజాలడో,అప్పుడు మధ్యలోని నాలుగు వికా రములనుగూడ తెలిసికొనుట సంభవించదు.ఎందుకనిన,ఉత్ప త్తినాశరూప ఉభయవికారములకు యెవరు ఆశ్రయమో, వారే మధ్య నాలుగు వికారములకు ఆశ్రయముండును. ఇట్లు, ఆత్మ నిర్వికారమున్నదని సిద్ధించినది.

ఈ విషయమునే శ్రీ ఆద్య జగద్గురు శంకరాచార్యులవారు వాక్యవృత్తి ౨౭వ శ్లోకములో ఈ విధముగా చెప్పియున్నారు.

దేహము,ఇంద్రియములు,ప్రాణము,మనస్సు మరియు అహంకా రము(బుద్ధి)-వీటన్నిటికంటెఆత్మ విలక్షణముగా(వేరుగా)ఉన్నది. భిన్నమై ఉండి,షడ్భావ వికారములను ప్రకాశిస్తూ, స్వయముగా షడ్వికారశూన్యమై,త్వంపదమునకు అర్థము అనగా ప్రత్యగాత్మ యైఉన్నది.అనృతజడదుఃఖరూప అనాత్మకంటె విలక్షణము(విస దృశమై)నిర్వికారమున్నదనిసిద్ధించినది—కావున,ఆత్మ నిర్వికా రమగు సచ్చిదానంద పరబ్రహ్మమే యని పిండితార్థము॥ ౧౫ ॥

**విశేషము:**-ఈ విషయమునే ప్రకారాంతరముచే శ్రీ విద్యా రణ్య గురుదేవులుగూడ శ్రీవేదాంత పంచదశి చిత్రదీపము 254 వ శ్లోకములో ఉల్లేఖించారు.

చైతన్యము నిత్యమనుటలో హేతువేమి?అను ప్రశ్నకు—చైత న్యముయొక్క ప్రాగభావముది అనుభవము లేనందున—అం టూ సమాధానమిస్తూ-శ్లోకమును ప్రవృత్తము చేసారు.

ప్రాగభావో నానుభూతశ్చితేర్నిత్యా తతశ్చితిః ।
ద్వైతస్య ప్రాగభావస్తు చైతన్యేనానుభూయతే॥

చితేః=చైతన్యముయొక్క;ప్రాగబావ:=ఉత్పత్తికంటెపూర్వము లేకపోవడము; న అనుభూతః=అనుభవింపబడియుండ లేదు; తతః=ఆకారణమువల్ల;చితిః=చిద్రూపము;నిత్యా=నిత్యమగును; ద్వైతస్య=ద్వైతముయొక్క;ప్రాగభావస్తు=ప్రాగభావమైతే,చైతన్యేన =చైతన్యముచేత; అనుభూయతే=అనుభవింపబడుచున్నది.

చైతన్యముయొక్క ప్రాగభావము యెవరిచేతను అనుభవిం

పబడుట లేదుగనుక అది నిత్యము.ద్వైతముయొక్క ప్రాగభావము సుషుప్తికాలములో సాక్షిచైతన్యముచే అనుభవింపబడుచున్నది. కావున, ద్వైత'ము మిథ్యా అని సిద్ధమగుచున్నది.

చైతన్యమునకు ప్రాగభావము గలదు—అను ప్రతివాదిని ఇట్లు అడుగవలెను. చైతన్యముయొక్క ప్రాగభావము ఏమి చేతనముచే ననుభవింపబడుచున్నదా?లేక చేతనముకంటె అన్యమగు జడముచేననుభవింపబడుచున్నదా?ఇట్లు వికల్పించి,చైతన్యముకంటె అన్యమగు జడముచే ననుభవింపబడుచున్నదను రెండవపక్షము హాస్యాస్పదము.ఎందుకనగా!చైతన్యముకంటె అన్యమగు జడమైన పాషాణాదులలో అనుభవితృత్వము గలదంటే, అది శుద్ధ మూర్ఖత్వమగును.చేతన భిన్న పాషాణాదులలో అనుభవకర్తృత్వము యెచ్చటను కని,విని యెఱుగబడుట లేదుగదా!

చైతన్యముయొక్క ప్రాగభావము చేతనముచేతనే అనుభవింపబడునను ప్రథమ పక్షములోగూడ,ఏమి చేతనాంతరముచే చైతన్యప్రాగభావము అనుభవింపబడుచున్నదా?లేక,ఏ చేతనమునకు ప్రాగభావము గలదో, ఆ చేతనము చేతనే (తన ప్రాగభావము తనచేతనే) అనుభవింపబడుచున్నదా?

అందులో ప్రథమ పక్షము యుక్తము కాదు.ఏలయన, అద్వైతవాదములో"ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ"అను శ్రుత్యుక్త ప్రకారముచే రెండవ చేతనము (చేతనాంతరము)లేదు.ఒకవేళ చేతనాంతరము గలదని ఆగ్రహించినచో—"దేనియొక్క అభావము

గలదో,అదియే ఆ అభావమునకు ప్రతియోగియగును. ప్రతియోగి ప్రతీతిపూర్వక అభావముయొక్క ప్రతీతియగున''ను నియమము గలదు.కావున,చేతనరూప ప్రతియోగియొక్క ప్రతీతి లేకుండా,చైతన్యముయొక్క అభావ ప్రతీతి కలుగనేరదు. చేతనముయొక్క ప్రతీతిని స్వీకరించినచో, ఘటాదులవలె జడత్వము ప్రాప్తమగును. లేక,

ఏ చేతనముయొక్క ప్రాగభావము గలదో, ఆ చేతనముచే అనగా,తనయొక్క ప్రాగభావము తనచేతనే అనుభవింపబడునన్నచో, అది ఘటిల్లదు. ఎందుకనగా!నేత్రము స్వయముగా తనను తాను చూడజాలదు-అను యుక్తి (న్యాయము) మరియు సర్వలోక ప్రసిద్ధివలనగూడ,చేతనము తనచే తాను తెలియబడదు.కావున,చేతనము నిత్యము. ఒకవేళ తనచే తాను తెలియబడునన్నచో, గ్రామమునకు వెళ్ళు గమనకర్త మరియు గమ్యమగు గ్రామము తానేయనుట యెట్లు'కర్మకర్తృ'దోషయుక్తమో, చేతనమునందుగూడ అదే'కర్మకర్తృ'దోషము ప్రసక్తమగును.ఇచ్చట,ప్రాగభావ శబ్దముచే నుపలక్షణముగా ప్రధ్వంసాభావమును గూడ గ్రహించవలెను.

ఇట్లు చేతనముయొక్క ప్రాగభావ,ప్రధ్వంసాభావములు తెలియబడుట లేదు,గావున, ప్రాగభావ అంతిమ క్షణరూప ఉత్పత్తి (జన్మము) మరియు ప్రధ్వంసాభావ ప్రథమక్షణరూప నాశము (ఆద్యంతరూప ఉభయ వికారములు) గ్రహింపబడనందువలన, ''ప్రాగభావ ప్రధ్వంసాభావ అప్రతియోగిత్వం నిత్యత్వమ్'' అను

నిత్యముయొక్క లక్షణము సుసంపన్నమైనది.అనగా ఆత్మ నిత్య ము అని సిద్ధమైనది. మరియు షడ్భావ వికారములకు సాక్షియై నిర్వికారమున్నందున, నిర్వికార బ్రహ్మముచే నభిన్నమని గూడ సిద్ధించినది.

శ్రీమధుసూదన సరస్వతీస్వాములవారు సిద్దాంత బిందులో ప్రథము శ్లోకవ్యాఖ్యానములో—ప్రత్యగభిన్న పరమాత్మకు ప్రాగ భావముగాని, ప్రధ్వంసాభావముగాని, అత్యంతాభావముగాని మరియు అన్యోన్యాభావముగాని సంభవించదు—అను విషయ మును ప్రతిపాదిస్తూ, ఆత్మకు జన్మనాశములు-అను ఉభయ వికారములు లేవని సవిస్తరముగా ప్రతిపాదించారు—

ఆత్మనో దేశకాలాపరిచ్ఛిన్నత్వాత్ తత్పరిచ్ఛిన్నానాం ఘటా దివదనాత్మత్వాత్,తద్ధ్వంసప్రాగభావయోశ్చ గ్రహీతుమశక్యత్వా త్,అనాత్మనాం జడత్వాత్,స్వభిన్నస్య చాత్మత్వాభావాత్, ఆత్మన ఏకత్వేఽపి సుఖదుఃఖాద్యాశ్రయాణామంతఃకరణానాం భేదా భ్యుపగమాత్ వ్యవస్థోపపత్తేః । స్వేనైవ స్వ అభావగ్రహణే విరో ధాత్,గ్రాహ్యకాలే గ్రాహకాసత్వాత్, గ్రాహకసత్వే గ్రాహ్యాభావా త్,కృతహాన్యకృతాభ్యాగమ ప్రసంగాచ్చ న తస్య ధ్వంసప్రాగభా వౌ ॥

ఆత్మ దేశకాలములచే నపరిచ్ఛిన్నమున్నది. దేశకాలముల చే పరిచ్ఛిన్నపదార్థము ఘటపటాదులవలె అనాత్మయే యగును. ఆత్మయొక్క ప్రధ్వంస,ప్రాగభావములు గ్రహింపబడుట అసంభ

వము.ఆత్మభిన్నములు జడములుండును.ఆత్మయొక్క అభావ మును గ్రహించుటకు చేతనముకంటె భిన్న చేతనాంతరము లేదు.ఆత్మ ఏకమైననూ సుఖదుఃఖములకు ఆశ్రయమగు అంతః కరణములు నానా(అనేకములు)గావున సుఖదుఃఖముల వ్యవ స్థ సంభవించును. ఆత్మచైతన్యము తనయొక్క అభావమును తాను గ్రహించుట విరోధమగును.ఎందుకంటె,"తనయొక్క ప్ర ధ్వంస, ప్రాగభావ కాలములో స్వయముగా తాను లేనే లేదు. ఆత్మయొక్క స్థితికాలములో ప్రధ్వంస ప్రాగభావములు లేవు".

మరొక హేతువేమనగా,ఆత్మయొక్క ప్రధ్వంసము ఒప్పకొ న్నచో,చేసిన కర్మల ఫలరూప సుఖదుఃఖముల ననుభవించు వాడు లేకుండా పోవుటచే 'కృతహాని'రూప దోషము మరియు ప్రాగభావమును స్వీకరించినచో అనగా ఉత్పత్తికి పూర్వము ఆత్మ లేదనినచో,ఈజన్మలో ననుభవించు సుఖదుఃఖములకు హేతువగు కర్మనుచేసిన కర్తయొక్క అభావముండెను.కావున, చేయనికర్మయే సుఖదుఃఖరూప ఫలమునిచ్చుటకు ప్రవృత్తమైన దను 'అకృతఅభ్యాగమ'రూప దోషము ప్రాప్తించును.అందువల్ల ఆత్మకు ప్రధ్వంస,ప్రాగభావములు అనగా ఉత్పత్తివినాశములు- అను ఉభయవికారములులేవు.మరియు ఈరెంటి మధ్య నాలు గు వికారములుగూడ సంభవించవు.కావున,పై సమగ్ర పర్యా లోచనద్వారా ఆత్మయొక్క నిర్వికారత్వము సిద్ధించినందున,

నిర్వికార బ్రహ్మముతో అభేదము నిశ్చితమైనది.

ఇంకా ఈవిషయంలో శ్రీయోగవాసిష్ఠము నిర్వాణ ప్రకరణము పూర్వార్ధము ౯౭ వ సర్గ  చూడగలరు. అలమితి విస్తరేణ.

---

**ఆత్మయందు అజ్ఞానముయొక్క అసంభవము**

నను పూర్వోక్తం సర్వం వృథా, ఆత్మన ఉక్తస్వరూపబ్రహ్మాత్వజ్ఞానే ప్రయోజనాభావాత్; న చ సంసారనివృత్తిరాత్మనో బ్రహ్మాత్వజ్ఞానే ప్రయోజనమితి వాచ్యమ్, తన్నివృత్తేరసంభవాత్; సంసారో హ్యాత్మన్యహంకారోపాధినా ప్రతీయమానః కర్తృత్వాదిః,సచ న జ్ఞానేన నివర్తయితుం శక్యః,తస్యాత్మని సోపాధికభ్రమత్వాత్,సోపాధికభ్రమస్య చ యావదుపాధ్యవస్థానం తత్త్వజ్ఞానేఽప్యవస్థానాత్,లోకే సోపాధికభ్రమస్య ప్రతిబిమ్బచలనాదేర్యావదుపాధిచలనం ప్రతీతేః। న చోపాధేరహంకారస్య బ్రహ్మాజ్ఞానే న నివృత్తౌ తత్ప్రయుక్తస్యాత్మని ప్రతీయమానస్య కర్తృత్వాదేరపి నివృత్తిరితివాచ్యమ్,తస్య మూలాజ్ఞానే సతి నివృత్తేరసంభవాత్; నచ ములాజ్ఞానస్యాప్యాత్మని విద్యమానస్య బ్రహ్మాజ్ఞానాన్నివృత్తిరితి వాచ్యమ్, తస్య కల్పకాభావేనాకల్పితతయా జ్ఞానేన నివర్తయితుమశక్యత్వాత్,అన్యథా  జ్ఞానస్యానవస్థానప్రసంగాదిత్యాశఙ్క్య, అజ్ఞానస్య జ్ఞాననివర్త్యత్వసిద్ధయే కల్పితత్వం వక్తుం తస్యాత్మని వస్తుతోఽసంభవమాహ।

శంక:-ఇంతవరకు ప్రత్యగాత్మకు బ్రహ్మాత్వమును ప్రతిపాదించి,బ్రహ్మాత్మైక్యమును సిద్ధిచేయడమైనది. కాని,ఆత్మను బ్రహ్మా

రూపముగా తెలిసుకున్ననూ,అనగా,"అహం బ్రహ్మాస్మి" యను జ్ఞానము కలిగిననూ యేమి ప్రయోజనములేదు.

సిద్ధాంతి:-"తరతిశోకమాత్మవిత్"(ఛాం.౭-౧-౩);"జ్ఞాత్వాదేవంసర్వపాశాపహానిః"(శ్వే.౧-౧౧);"బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ముం.౩-౨-౯);"తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి"(శ్వే.౩-౮-౬/౧౫);"జ్ఞానాదేవతుకైవల్యమ్"(లోపశ్రుతిః)ఇత్యాది శ్రుతులు బ్రహ్మ జ్ఞానముచేత శోకోపలక్షిత అజ్ఞాన తత్కార్యరూప సంసారము (అనర్థము)యొక్క నివృత్తి మరియు పరమానందరూప బ్రహ్మ ప్రాప్తియను మోక్షమును పరమప్రయోజనముగా చెప్తున్నాయి. మరియు ఆద్యజగద్గురు శ్రీశంకరాచార్యులవారు భాష్యగ్రంథములలో,ప్రకరణ గ్రంథములలో అడుగడుగున బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచే మోక్షము లభించునని చెబుతూ వచ్చారు —

జ్ఞానాదేవతుకైవల్యమితి శ్రుత్యా నిగద్యతే ।

జ్ఞానస్య ముక్తిహేతుత్వ మన్యవ్యావృత్తిపూర్వకమ్ ॥

(సర్వవేదాంత సిద్ధాంతసారసంగ్రహము ౧౭౧)కావున,జీవబ్రహ్మైక్య జ్ఞానముచే సంసార నివృత్తిరూప ప్రయోజనము ఉన్నది.

శంక:-ఓసిద్ధాంతీ!ఇట్లుచెప్పుటగూడయుక్తముగాదు.ఎందుకనగా!అహంకారోపాధియోగముచే కర్తృత్వభోక్తృత్వాది సంసారము ఆత్మయందు ప్రతీతమగుచున్నది. కావున, సంసారము సోపాధిక భ్రమయగును.సోపాధికభ్రమ జ్ఞానముచే నివృత్తియగుటకు శక్యముగాదు.ఎంతవరకు ఉపాధిఉండునో, అంతవర

కు సోపాధికభ్రమ జ్ఞానము కలిగిననూ నివృత్తికాదు. లోకం లో—జలగత ప్రతిబింబమునందు జలధర్మములగు చలనాదులు జలరూపోపాధి ఉన్నంతవరకు ప్రతీతియగుచుండును.

సిద్ధాంతి:-బ్రహ్మజ్ఞానముచే అహంకారము నివర్తించును. "నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః"అను నియమానుసార ము అహంకారము నివృత్తమైనచో, అహంకారోపాధియోగము చే ఆత్మయందు ప్రతీయమానమగు కర్తృత్వభోక్తృత్వరూప సంసా రముగూడ నివర్తించును.

శంక:-ఇట్లు చెప్పుటగూడ ఉచితముగాదు. కారణమేమన గా!అహంకారమునకు మూలకారణమగు ఆత్మాజ్ఞానము విద్య మానమైయుండగా,అహంకారము నివృత్తియగుట అసంభవ ము.

సిద్దాంతి:-బ్రహ్మాత్మైకత్వజ్ఞానముచే ఆత్మాజ్ఞానము నాశన మగును.

"జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।

తేషామాదిత్యవజ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥"(గీత.౫-౧౬)

"యతో జ్ఞానమజ్ఞానస్యైవ నివర్తకత్వాత్ (పంచపాదికా);

అనాదిభావరూపం యద్విజ్ఞానేన విలీయతే ॥(చిత్సుఖీ.౧-౯)

శంక:-అదిసరిగాదు.ఎందుకనగా!జ్ఞానముచే కల్పితపదా ర్థము మాత్రము నివర్తింపబడుటకు యోగ్యమున్నది. కాని,అజ్ఞా నమును కల్పితమనుట యుక్తముగాదు.కల్పితమన్నచో,దానికి

కల్పకుడెవరు?ఎవరు లేరు.కావున,అజ్ఞానము కల్పితము కాదు. మరేమనగా, అకల్పితము(సత్యము)న్నది. సత్యమగు అజ్ఞానము జ్ఞానముచే నివర్తింపబడుటకు శక్యము లేదు. అజ్ఞానమునకు కల్పకము మరొక అజ్ఞానమన్నచో అనవస్థాప్రసంగమేర్పడును. అకల్పిత వస్తువుగూడ నివృత్తమగునని స్వీకరించినచో జ్ఞానమునకుగూడ అనవస్థితి(అస్థిరత్వ)ప్రసంగమేర్పడును. అందువలన అజ్ఞానమున్నంతవరకు అహంకారము సుస్థిరము. అహంకారోపాధి ఉన్నంతవరకు,దాని సంబంధమువలన ప్రతీయమానమగు కర్తృత్వభోక్తృత్వాది సంసారము అనివార్యము. అలాంటపుడు బ్రహ్మజ్ఞానముయొక్క ప్రయోజనమేమి?కావున, పూర్వోక్త జీవబ్రహ్మైక్య జ్ఞానము కలిగిననూ నిరర్థకమేయగును.

ఈ శంకను నివృత్తిజేయుటకు మొదలు ఆత్మజ్ఞానముచే ఆత్మాజ్ఞానము నివృత్తమగునని సిద్ధిచేయాలి.కాని,అజ్ఞానము కల్పితము కానిచో, జ్ఞానముచే నష్టమగుట అనుపపన్నమగును. ఈ అర్థాపత్తిచే అజ్ఞానమును కల్పితమని నిరూపించుట ఆవశ్యకమున్నది.

"ప్రతిపన్నోపాధౌ త్రైకాలికనిషేధ ప్రతియోగిత్వం మిథ్యాత్వమ్ (అద్వైత సిద్ధిః)ఏ అధికరణము(ఆధారము)నందు యే వస్తువు ప్రతీతమగునో, ఆ అధికరణమునందు ఆ వస్తువుయొక్క త్రైకాలిక నిషేధము(పూర్వములేకుండెను, ఇప్పుడు లేదు, భవిష్యత్తులోఉండబోదు)అను అత్యంతాభావమునకు ప్రతియోగియగుట మిథ్యాత్వముయొక్క లక్షణము.ఉదా:-రజ్జువునందు ప్రతీయ

మానమగు సర్పము కల్పితమున్నందున,రజ్జువునందు అత్యంతా భావమున్నది. ఆ అభావమునకు సర్పము ప్రతియోగియగును, అది అధిష్ఠాన రజ్జుజ్ఞానముచే నివర్తించును. గావున, సర్పము మిథ్య.అట్లే,ఆత్మనిష్ఠ అజ్ఞానముగూడ కల్పితముగాన,ఆత్మయం దు అత్యంతాభావమున్నది.ఆ అత్యంతాభావమునకు అజ్ఞానము ప్రతియోగియగును.అది ఆత్మజ్ఞానముచే నివృత్తమగును. కావు న, అజ్ఞానము మిథ్య(కల్పితము). ఈ అభిప్రాయముచే ఇప్పుడు ఆత్మయందు అజ్ఞానముయొక్క అత్యంతాభావమును క్రింది శ్లోకము ద్వారా సిద్ధిజేయుచున్నాడు.

**న ప్రకాశేఽహమిత్యుక్తిర్యత్ప్రకాశైకనిబన్ధనా ।**

**స్వప్రకాశం తమాత్మానమప్రకాశః కథం స్పృశేత్ ॥ ౧౬ ॥**

**అన్వయః** :-అహం న ప్రకాశే ఇతిఉక్తిః యత్ ప్రకాశైక నిబన్ధనా తమ్ స్వప్రకాశమ్ ఆత్మానమ్ అప్రకాశః కథమ్ స్పృశే త్? (న కథఞ్చిదిత్యర్థః) ॥ ౧౬ ॥

**అన్వయార్థము**:-అహమ్=నేను;న ప్రకాశే=భానమగుట లేదు(నన్ను నేను యెఱుగుట లేదు)ఇతి=అను;ఉక్తిః=వచనము; యత్ప్రకాశైకనిబంధనా=దేనియొక్క ప్రకాశమువలన చెప్పబడు చున్నదో;తమ్ స్వప్రకాశమ్ ఆత్మానమ్=ఆస్వయంప్రకాశమగు ఆత్మను;అప్రకాశః=అజ్ఞానము;కథమ్=ఎట్లు;స్పృశేత్= స్పర్శించు ను;

**టీకా:**-అహం న ప్రకాశే=న భామీత్యుక్తిర్వచనం యత్ప్రకాశైకబన్ధనా, యస్యప్రకాశో యత్ప్రకాశః, స్వరూపప్రకాశ ఏక ఏవ నిబన్ధనం=నిమిత్తం యస్యాః సా తథోక్తా, 'న ప్రకాశే' ఇతి వ్యవహారస్య ప్రకాశైకనిబన్ధనత్వాత్,స్వప్రకాశానుభవనిమిత్తత్వాదిత్యర్థః ।తంస్వప్రకాశం స్వయమేవ భాసమానమాత్మానమప్రకాశోఽజ్ఞానం కథం స్పృశేత్=ఆవృణుయాత్? న కథఞ్చిదిత్యర్థః ।

నేను ప్రకాశింపబడుట లేను=నన్ను నేనుతెలియుట లేదు=నేను అజ్ఞానిని—అను వ్యవహారము యే ప్రకాశముయొక్క నిమిత్తము(కారణము)చే జరుగుచున్నదో, అనగా,

"తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి"(శ్వే.౬-౧౪) అను శ్రుత్యుక్త రీతిచే యేది దేనియొక్క అపేక్షలేకయే స్వయముగా ప్రకాశిస్తూ, సర్వమునూ ప్రకాశించుచున్నదో,అట్టి స్వప్రకాశచిదాత్మను,తమఃప్రకాశములవలె సహానవస్థాన విరోధియగు అజ్ఞానము ఎట్లు స్పృశించును? ప్రఖరతరకిరణములుగల సూర్యుని అత్యంత విరోధియగు అంధకారము స్పృశించినదనుట అదృష్టచరము(అసంభవము).దీనికి కారణము ప్రకాశము మరియు అప్రకాశమునకుగల విరోధమే. ఈ విధముగా ఆత్మయందు అజ్ఞానమును స్వీకరించుట యుక్తి మరియు అనుభవ విరుద్ధము. కావున, పరమార్థతః=వాస్తవముగా ఆత్మయందు అజ్ఞానము అత్యంతాభావమున్నదని సిద్ధించినది.

అయం భావః— ఆత్మా సర్వదా స్వయం భాసమానః సన్ ,

సర్వాన్భాసయతి; స కథమజ్ఞానేన ప్రకాశవిరోధినా స్పృశేత్? న హి ఖరతరకిరణశాలీ దినకరస్తమసా స్పృశ్యమానో దృశ్యతే; తత్కస్య హేతోః?ప్రకాశాప్రకాశయోర్విరోధాత్,తథా చాజ్ఞాన-స్యాత్మని యుక్త్యసహత్వాన్న పరమార్థతః సంభవ ఇతి ॥౧౬॥

ఇచ్చట ఈఅభిప్రాయముగలదు.''న ప్రకాశేఅహమ్''।'న'కారము నిషేధార్థకము.నేను ప్రకాశించుట లేదు.''లేదు, కాదు'' అను శబ్దములు నిషేధవాచకములు,అనగా అభావమును తెలుపును. అభావజ్ఞానము నియమముచే ప్రతియోగి ప్రతీతి పూర్వకముగానే కలుగును. దేనిది అభావము చెప్పబడునో, అదియే ఆ అభావమునకు ప్రతియోగియగును. ఇచ్చట ''న ప్రకాశే''అను ఉక్తియేది గలదో,దీనిచే ప్రకాశము(జ్ఞానము)యొక్క అభావము ద్యోతితమగుచున్నది.జ్ఞానముయొక్క అభావమునకు ప్రతియోగి జ్ఞానమేయగును. ప్రకాశము(జ్ఞానము)యొక్క అభావజ్ఞానము, జ్ఞానరూప ప్రతియోగి ప్రతీతిపూర్వకముగనే కలుగును. ప్రకాశము, జ్ఞానము, ప్రతీచి, చితి, చైతన్యము, ఆత్మ, సాక్షి, ప్రత్యక్ మొదలగునవి పర్యాయశబ్దములు.అందువలన, ప్రకాశముయొక్క అభావమునకు ప్రతియోగియగు స్వయంప్రకాశరూప సాక్షియొక్క జానము లేకుండా''న ప్రకాశే'' అను వ్యవహారము జరుగదు.ఎప్పుడైతే సాక్షి స్వయంప్రకాశము(నేను నిత్యజ్ఞానస్వరూపుడను)అను జ్ఞానమున్నదో,అట్టి స్వయంప్రకాశ సాక్షియందు నిషేధరూప అజ్ఞానముండుట ఎట్లు సంభవము? ఒకవేళ

అజ్ఞానమున్నది. అని అంగీకరించినచో, అది కల్పితము (మిథ్య) గాక, సత్యమెన్నటికిని కాజాలదు.

తాను (సాక్షి) ఎల్లప్పుడు స్వయంప్రకాశస్వరూపుడైయుండి, సర్వమును ప్రకాశించుచున్నది.''నాయందు అజ్ఞానమున్నది లేదా నేను అజ్ఞానిని'' అని చెప్పుట వ్యాఘాత(మాట్లాడు వానికే) దోషము ప్రాప్తించును.

''మమ ముఖే జిహ్వా నాస్తి మాతా మమ వంధ్యాఽసీత్ ।

పితా బాల బ్రహ్మచారి అపుత్రశ్చ పితామహః ॥''

స్వప్రకాశచిదాత్మ=సాక్షియందు అజ్ఞానముయొక్క అసంభవమును శ్రీ హస్తామలకాచార్యులు గూడ స్పష్టము చేసారు.

''ఘనచ్ఛన్న దృష్టిర్ఘనచ్ఛన్నమర్కం

యథా నిష్ప్రభం మన్యతేచాతి మూఢః।

తథాబద్ధవద్భాతి యో మూఢదృష్టే,

స నిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥''(హస్తామ)ఇతి ॥ ౧౬ ॥

## జ్ఞానముచే అజ్ఞాన నివృత్తి

నను కథం తర్హి 'న ప్రకాశే'ఇత్యాత్మన్యజ్ఞానానుభవ ఇత్యాశఙ్క్య,సూర్యేపేచకాదీనామన్ధకారప్రతీతివద్భ్రాన్త్యాప్యుపపద్యత ఇత్యాహ —

శంక:-ఒకవేళ ఆత్మయందు అజ్ఞానముయొక్క అత్యంత అసంభవమగుచో,''న ప్రకాశే''=''నేనుయెఱుగుటలేదు,నాకు తెలి

యుట లేదు, నేను అజ్ఞానిని"అను ఈవిధమగు అజ్ఞానానుభవ మెందుకు కలుగుచున్నది.

ఇట్లు శంక ప్రాప్తముకాగా,అత్యంత ప్రకాశవంతమైన సూర్యునియందు గుడ్లగూబలు ఎట్లు అంధకారానుభూతిని పొందునో,అట్లే,మూఢజనులు ఆత్మయందు భ్రాంతిచేత అజ్ఞానానుభూతిని పొందుచున్నారు - అని సమాధానము చెప్తూ, ఉత్తర శ్లోకము ను ప్రవృత్తము చేయుచున్నాడు.

**తథాప్యాభాతి కోఽప్యేష విచారాభావజీవనః ।**

**అవశ్యాయశ్చిదాకాశే విచారార్కోదయావధిః ॥౧౭ ॥**

**అన్వయః:-**తథాపిచిదాకాశే విచారార్కోదయావధిః విచారాభావజీవనఃకోఽపి(అనిర్వచనీయః)ఏషఃఅవశ్యాయః (అప్రకాశః) ఆభాతి॥ ౧౭ ॥

**అన్వయార్థము:-**తథాపి=అయిననూ;చిదాకాశే=చిదాత్మరూపఆకాశమునందు,విచారార్కోదయావధిః=విచారరూపసూర్యుడుఉదయించువరకు;విచారాభావజీవనః=దేనియొక్క స్థితికి విచార అభావమే జీవనమో=కారణమో;కః అపి ఏషః=ఏదో ఒక;అవశ్యాయః=అజ్ఞానరూప పొగమంచు;ఆభాతి=భాసించుచున్నది.

**టీకా:-**యద్యపి వస్తుతఃఆత్మన్యజ్ఞానం నసంభవతి,తథాప్యేషోఽప్రకాశః, అవశ్యాయః=నీహారః, అవశ్యాయవదవశ్యాయ ఆవరకత్వాత్, చిదాకాశే=చిత్ప్రకాశ ఆత్మన్యాభాతీతి సంబంధః।

వాస్తవముగా ఆత్మయందు అజ్ఞానముండుట అసంభవమే యైననూ, సూర్యోదయమునకు పూర్వము ప్రదోషకాలమున, ఆకాశములో ఆవరణాత్మక అప్రకాశరూప పొగమంచు ఏర్పడి నట్లే,చిదాకాశమునందు=చిత్ప్రకాశరూపఆత్మయందు ఒకానొక అనిర్వచనీయ ఆవరణస్వభావముగల అనాదిభావరూప అజ్ఞానము ప్రతీతమగుచున్నది.''నీహారేణప్రావృతాః''(ఋ.౮-౩-౧౭); ''అనృతేన హి ప్రత్యూఢాః''(ఛాం.౮-౩-౨); అజ్ఞానేనావృతం జ్ఞానమ్ (గీత.౫-౧౫)

నన్వజ్ఞానస్యవస్తుతోఽసత్వే కథంప్రత్యక్షప్రతీతిః?న హ్యసతః శశవిషాణాదేః ప్రత్యక్షప్రతీతిరస్తి, తత్రాహ–'కోఽపీతి'।కోఽపి= సత్త్వాసత్త్వాభ్యామనిర్వచనీయః।అప్రకాశస్య సదసద్విలక్షణత్వాఙ్గీకారాన్న ప్రత్యక్షప్రతీత్యనుపపత్తిరిత్యర్థః ।

శంక:-ఆత్మయందు వస్తుతః అజ్ఞానము అసంభవమగుచో,''అహమజ్ఞః'' అను అజ్ఞానముయొక్క ప్రత్యక్ష ప్రతీతి యెట్లు కలుగుచున్నది.అత్యంత అసత్ పదార్థములు''కుందేలు కొమ్ము; తాబేలు వెంట్రుకలు, గొడ్రాలు కొడుకు''ఇత్యాదులు యెక్కడనూ ప్రత్యక్ష ప్రతీతికి విషయములగుట లేవు గదా?

ఉత్తరము:-ఎందువల్లనైతే వస్తుతః అజ్ఞానము లేనిదేయైననూ,ప్రత్యక్షప్రతీతికి విషయమగుచున్నదో, అందువలన ఏదో ఒక అజ్ఞానమను పదార్థమున్నదని అవశ్యముగా స్వీకరించదగును.''కఃఅపి=యత్కించిదిదమ్''ఏదోఒక అనగా అనిర్వచనీయమని యర్థము.''సదసద్విలక్షణమ్—అనిర్వచనీయమ్''.

అనగా"త్రైకాలికాబాధ్యత్వం లేదా బాధరాహిత్యం సత్యత్వమ్"మూడుకాలములలో దేనికి బాధము కలుగుటలేదో,దానిని సత్తందురు.దేనికి బాధకలుగుచున్నదో,అది సద్విలక్షణమనబడును, అనగా బాధయోగ్యమని యర్థము.

వంధ్యాపుత్రుడు, శశశృంగము, ఆకాశపుష్పము, కూర్మరోమము మొదలగునవి స్వరూపహీనములు(నిఃస్వరూపములు). ఇవి అసత్తనబడును. స్వరూపము గలది- అసద్విలక్షణమగును.

ఇట్లు,బాధయోగ్యము మరియు స్వరూపము గలది—సదసద్విలక్షణమగును.దానినే అనిర్వచనీయమందురు."సచ్చేన్న బాధ్యేత, అసచ్చేన్న ప్రతీయేత-బాధ్యతే ప్రతీయతేఽపి.తస్మాత్ సదసద్విలక్షణమనిర్వచనీయమ్ (అద్వైతసిద్ధిః-యోగీంద్రానంద, పృష్ఠము ౬౯౦)

ఇది మూలశ్లోకములోని 'కోఽపి'అను పదమున కర్థము, ఇట్టి అనిర్వచనీయ అజ్ఞానమును స్వీకరించిననే,"అహమజ్ఞః" 'నేను అజ్ఞానిని'-అను అజ్ఞానముయొక్క ప్రత్యక్షప్రతీతి అనుపపన్నము కాదు.

నన్వేవమపి, అప్రకాశస్యాత్మన్యనుభవో నోపపద్యతే,విరోధాదితి చేత్; న,తథా హి—కిం జడవస్తు అప్రకాశవిరోధి,ఉత స్వప్రకాశరూప ఆత్మా?నాద్యః,జడాప్రకాశయోః పరస్పరవిరోధాసంభవాత్। నాపి ద్వితీయః,తస్య విరోధిని స్వప్రకాశ ఆత్మన్యవస్థానానుపపత్తేః॥

శంక:-ఇట్లు అనిర్వచనీయ అజ్ఞానమును స్వీకరించిననూ, ప్రకాశస్వరూప ఆత్మయందు "అహమజ్ఞః" అను అప్రకాశరూప అజ్ఞానముయొక్క అనుభవమును చెప్పుట యోగ్యము కాదు. ఏలయన, ఏకాధికరణమునందు(ఆత్మయందు) విలక్షణ(జ్ఞాన, అజ్ఞానములు)రెండు పదార్థములుండుట 'వధ్యఘాతక న్యాయము'చే(పాము-ముంగిస, పిల్లి-ఎలుకల వలె) విరోధము గదా!

ఇప్పుడు శంకాకారుడిని వికల్పముజేసిఅడుగవలెను, ఏమి, అప్రకాశరూప అజ్ఞానమునకు జడవస్తువు విరోధి యందువా? లేక స్వప్రకాశరూప ఆత్మ యందువా? మొదటి వికల్పము సరి గాదు. ఎందుకనగా! జడవస్తువు అజ్ఞానముయొక్క కార్యము గావున, "కార్యకారణయోః అనన్యత్వమ్" అను నియమముచే జడవస్తువు అజ్ఞానస్వరూపమే. కనుక-మృత్తికా ఘటములకు వలె,వాటికి పరస్పరవిరోధముండదు.రెండవ పక్షముగూడ సరి గాదు. ఏలననగా!ఒకవేళ ఆత్మకు అజ్ఞానమునకు విరోధమే ఉండినచో,స్వప్రకాశరూప ఆత్మయందు విరోధియగు 'అహమజ్ఞః'అను నీయప్రకాశరూప అజ్ఞానముయొక్క స్థితి అనగా ఉనికియే సంభవించదు.కాని,అజ్ఞానము ఆత్మయందే అనుభవగోచరమగుచున్నది.అందువలన, స్వప్రకాశరూప ఆత్మకు మరియు అప్రకాశరూప అజ్ఞానమునకు విరోధము లేదు.

న చ 'అహం న ప్రకాశే' ఇత్యజ్ఞానసాధకస్య తస్య నాజ్ఞాన విరోధిత్వమితి వాచ్యమ్, ఆత్మస్వరూపస్య ప్రకాశస్యావిరోధిత్వే ఽన్యస్యాపి విరోధినోఽభావాత్కదాపి నివృత్తిర్నస్యాత్,తత్రాహ–

విచారార్కోదయావధిరితి । విచారః=విచారజన్యం జ్ఞానమేవా ర్కః=సూర్యః,తమోనివర్తకత్వాత్,తస్యోదయ=ఉత్పత్తిః,సోఽవధిః =స్థితిమర్యాదా యస్యాప్రకాశాస్య, స విచారార్కోదయావధిరి త్యర్థః ।కేవలాత్మనోఽవిరోధిత్వేఽప్యఖణ్డాకారవృత్త్యారూఢాత్మచై తన్యస్య తన్నివర్తకత్వోపపత్తిః, కేవలసూర్యకిరణస్యాదగ్ధృత్వేన తృణాదిభాసకత్వేఽపి సూర్యకాన్తసంయుక్తస్య తస్య దగ్ధృత్వ దర్శనాదితి భావః ।

శంక:-అట్లైనచో,"అహం న ప్రకాశే" నేను అజ్ఞానిని అను వ్యవహారమునకు యోగ్యమగు అజ్ఞానమును సిద్ధిజేయు ఆత్మ కు మరియు అజ్ఞానమునకు అవిరోధమున్నదనిగూడ చెప్పకూ డదు.ఎందుకంటె,ఒకవేళ ఆత్మయొక్క స్వరూపభూత ప్రకాశము నకు మరియు అజ్ఞానమునకు అవిరోధమున్నదనిన, అజ్ఞాన మునకు విరోధి ఆత్మకంటె భిన్నము మరొకటి లేనందున, అ జ్ఞానము ఎప్పుడునూ నివృత్తి కానేరదు.అట్లైన, అనిర్మోక్షప్రసంగ మేర్పడును.ఇట్టి శంకకు సమాధానముగా-మూల శ్లోకములో చెప్పబడిన"విచారార్కోదయావధిః"అను పదమునకు వ్యాఖ్యా నము చేయబడుచున్నది

ఇచ్చట'విచార'శబ్దముచే విచారజన్యజ్ఞానమని యర్థము. ఆ విచారజన్యజ్ఞానమే సూర్యుడు.ఎందుకనగా,దానికి అజ్ఞాన రూప అంధకార నివర్తకత్వమున్నది.ఈ జ్ఞానరూప సూర్యుని యొక్క ఉదయపర్యంతమే అవధి=మర్యాద, యే అప్రకాశరూప అజ్ఞానమునకు గలదో, అది 'విచారార్కోదయావధిః' అందుకే,

అజ్ఞానము విచారప్రాగభావోపలక్షితము. అనగా ఎంతవరకు (శ్రవణ మననరూప) ఆత్మవిచారము చేయబడదో, అంతవరకు మాత్రమే అజ్ఞానముండును. అయితే,కేవల ఆత్మస్వరూప జ్ఞానము మాత్రము అజ్ఞానమునకు విరోధి=బాధకము కాదు. తిరుగా సాధకమున్నది.సామాన్యచైతన్యము దేనికిని విరోధి కాదు.

ఆశ్రయత్వ విషయత్వభాగిని నిర్విభాగ చితిరేవ కేవలా (సం.శా.౧-౩౨౯)

సామాన్యచైతన్యమునకు అజ్ఞానమునకు అవిరోధమున్నందున, అజ్ఞానము చేతనమునే ఆశ్రయించుకొనియుండి, చేతనమునే ఆవరించును=తెలియకుండాచేయును. గర్భగుడిని ఆశ్రయించుకొనియున్న చీకటి గర్భగుడినే కనబడకుండా చేసినట్లు; నీటిని ఆశ్రయించుకొనియున్న నాచు నీటినే కప్పివేసినట్లు, మరియు ''సమానాశ్రయ విషయ నియమాత్'' యేది దేనికి ఆవరకముండునో, అది దానినే ఆశ్రయించుకొని యుండునను నియమానుసారము,అజ్ఞానము చైతన్యమునే ఆశ్రయించుకొని యుండి, చైతన్యమునే కప్పివేయుచున్నది. అన్య వస్తువును ఆశ్రయించుకొనియున్న పదార్థము, అన్య వస్తువును కప్పివేయుట సంభవించదుగదా! అందుకే 'అహమజ్ఞః' అను వ్యవహారము జరుగుచున్నది.

అయిననూ,శ్రీగురుదేవుని ముఖారవిందమునుండి తత్త్వమస్యాది మహావాక్యములను శ్రవణముచేయగా నుత్పన్నమగు ''అహం బ్రహ్మాస్మి''యను అప్రతిబద్ధ దృఢఅపరోక్ష చరమ సాక్షా

రరూప అఖండబ్రహ్మాకార వృత్తియందు ప్రతిఫలిత విశేషచైతన్య ము అజ్ఞానమునకు నివర్తకమగును. ఇది యుక్తియుక్తమున్నది. ఎట్లనగా,కేవల సూర్యకిరణములచే తృణాదులు దహించబడవు. ఇంతేగాక ఆ కిరణములచే తృణాదులు ప్రకాశింపబడును. అన గా సూర్యునియొక్క సామాన్యతేజము తృణాదులకు బాధకము గాక, సాధకమైనది.కాని, సూర్యకాంతమణి నుండి ప్రసరించిన సూర్యకిరణములు విశేషభావమునుపొందితృణాదులను దహిం చివేయును.అదేవిధముగా కేవల ఆత్మస్వరూపజ్ఞానముచేత అ జ్ఞానము భాసిస్తుంది.నాశనముకాదు.అదే ఆత్మజ్ఞానము మహా వాక్యవిచారముచే నుత్పన్నమైన అఖండబ్రహ్మాకారవృత్తియందు విశేషమై,అజ్ఞానమును,తత్కార్యప్రపంచమును నాశనము చే యును.

తత్త్వమస్యాది వాక్యోత్థ సమ్యగ్ధీ జన్మమాత్రతః ।

అవిద్యా సహకార్యేణ నాసీదస్తి భవిష్యతి ॥ (బృ.భాష్యవా ర్తికము ౧-౧-౧౮౩)

కిమితి తర్హి వాక్యజన్యాఖణ్డాకారవృతౌ సత్యామతి సర్వేషా మాత్మాజ్ఞానం న నివర్తత ఇత్యాశఙ్క్యాహ–విచారాభావజీవన ఇతి । విచారాభావఏవ, శ్రవణమననరూపయోర్వేదాన్తప్రమాణ తత్ప్రమేయబ్రహ్మవిషయయోర్విచారయోరభావ ఏవ జీవనమవ స్థితిహేతుర్యస్యాప్రకాశస్య స విచారాభావజీవన ఇత్యర్థః। వాక్య జన్యాప్యఖణ్డాకారవృత్తిరసంభావనాదిభిఃప్రతిబద్ధాసతీ,నాజ్ఞానం నివర్తయతి,యథా మణిమన్త్రాదిభిః ప్రతిబద్ధోఽగ్నిః,సంయుక్తమ

పి తృణాదికం న దహతి తద్వత్ । తదుక్తం సర్వజ్ఞాత్మమునిభిః **"పురుషాపరాధమలినా ధిషణా నిరవద్యచక్షురుదయాపి యథా ।న ఫలాయ భర్చువిషయా భవతి శ్రుతిసంభవాపి తు తథాత్మని ధీః"**(సం.శా.౧-౧౪)ఇతి ।

శంక:-తత్త్వమస్యాది వాక్యజన్య అఖండబ్రహ్మాకారవృత్తి ఉత్పన్నమైననూ,అందరికీ ఆత్మవిషయక అజ్ఞాననివృత్తి ఎందుకు అగుటలేదు?

ఉత్తరము:-విచారాభావజీవనః=వేదాంతరూప ఉపనిషత్ ప్రమాణములను మరియు ప్రమేయమగు బ్రహ్మాత్మైక్య విషయక శ్రవణ మననరూప విచారముయొక్క అభావమే ఆత్మాజ్ఞానము యొక్క జీవనమునకు=స్థితికి కారణము.అందుకే, అప్రకాశరూప అజ్ఞానమునకు'విచారాభావజీవనః'అను విశేషణము ఇవ్వనైనది.తాత్పర్యమేమనగా, మహావాక్యజన్య అఖండబ్రహ్మాకార వృత్తి ఉదయించిననూ, అసంభావనాదులచే ప్రతిబద్ధమైనందున, మణిమంత్రౌషధములచే ప్రతిబద్ధ అగ్నిసంయుక్త తృణాదులు దహింపబడనట్లు, అజ్ఞానమును నాశనము చేయుటలేదు. ఈ విషయమునే శ్రీ సర్వజ్ఞాత్వ మునీంద్రుల వారు సంక్షేపశారీరకములో తెలియజేసారు.

నిర్దుష్ట ప్రమాణములగు వేదాంత వాక్యముల శ్రవణాదులచే,శబ్దసామర్థ్యమువలన బుద్ధియందు ఉత్పన్నమైన జీవబ్రహ్మైక్యజ్ఞానము,అంతఃకరణగత అసంభావన,విపరీతభావన-అను

దోషములచే ప్రతిబద్ధమైనందున, పరమానంద పాప్తిరూప ఫల మునిచ్చుటకు సమర్థము కాజాలదు.ఈ సిద్ధాంతము అవగత మగుటకొఱకు శ్రీసర్వజ్ఞాత్మ మునీంద్రులవారు 'భర్చువు'యొక్క దృష్టాంతమిచ్చినారు.

ఒకానొక రాజువద్ద'భర్చువు'అను చతురుడైన మంత్రి ఉండే వాడు.ఒకనాడు రాజు, మంత్రిని పిలిచి,దేశసరిహద్దులలో శత్రు వుల దౌర్జన్యమును రూపుమాపి శాంతి భద్రతలను నెలకొల్పి రమ్మని పంపించినాడు.భర్చువుకు శత్రువులను వధించి శాంతి ని పునః స్థాపించుటలో చాలా రోజుల సమయము పట్టింది. ఈలోగా రాజధానిలో భర్చువుపై ఈర్ష్యగల ఇతర రాజసిబ్బం ది, కుట్రచే పన్నాగము పన్ని, భర్చువు యుద్ధంలో మరణించా డని, అతడు భూతమై సంచరిస్తున్నాడని, ఎదురుపడిన వారిని చంపుతున్నాడని, విపరీత ప్రచారము గావించి, రాజుకు తెలి పినారు. రాజుగూడ నిజమే కాబోలు-అని వారిమాటలను విశ్వ సించి,భర్చువుయొక్క మరణవార్తను బుద్ధిలో నిశ్చయించుకు న్నాడు.ఈ భేదవాదుల తప్పుడు ప్రచారము భర్చువుకు తెలిసి, దృఢవైరాగ్యమునొంది వనములోకి వెళ్ళి, తపస్సు చేయనారం భించినాడు.

కొంతకాలము గడచినమీదట రాజుకు వేటనిమిత్తమై అడ విలోకి వెళ్ళవలసిన ప్రసంగమేర్పడినది, రాజు అడవిలోకి వెళ్ళి కొంతసేపు వేటాడిన పిమ్మట వేసటిజెంది,అలసట తీర్చుకొనుట కై ఒక జలాశయమునుజేరి,హస్త పాద ప్రక్షాళనము గావించి,

జలమును సేవించి,కొంతసేపు సేదదీర్చుకొనుటకై ఒక పెద్ద వృక్షచ్ఛాయను చేరబోతుండగా,అల్లంత దూరమునుండి, ఆవృక్ష ము క్రింద ఒక తపస్విని చూసాడు. బాగుగా పరికించిచూసి, ఇతడు భర్చువేయనిగుర్తుపట్టాడు.రాజుకు-ఇతడు. భర్చువేయను అపరోక్ష నిశ్చయముగూడ కలిగింది. కాని భర్చువుయొక్క దర్శనముచే పూర్వమువలె ఆనందము మాత్రము కలుగలేదు. ఎందుకనగా! భేదవాదుల వాక్కులచే అతని బుద్ధిలో భర్చువు మరణించాడని, భూతమై సంచరిస్తున్నాడని, ఎదురుపడినవారి ని చంపుతున్నాడని - ఇట్టి అసంభావన, విపరీతభావనలచేత, భర్చువుయొక్క ప్రత్యక్షదర్శనము ప్రతిబద్ధమైనందున, ఆనంద మునకు హేతువు కాలేదు.

అట్లే,వేదాంత వాక్యరూప ప్రమాణములు "జీవబ్రహ్మైక్య మును ప్రతిపాదించుచున్నవా?లేక కర్మ ఉపాసనలను ప్రతిపా దించుచున్నావా?"అను ప్రమాణగత సంశయరూప అసంభావ న, వేదాంతములకు ప్రతిపాద్య విషయమగు ప్రమేయముపట్ల -"జీవబ్రహ్మల అభేదము సత్యమా? లేక భేదము సత్యమా?" అనునట్టి ప్రమేయగత సంశయరూప అసంభావన, మరియు "జీవబ్రహ్మల భేదము సత్యమున్నది, దేహాదిక ప్రపంచము సత్య మున్నది"-యను విపరీతభావనరూప దోషము(పురుషాపరాధ ము)లచే ప్రతిబద్ధ బుద్ధి గలిగియున్నందున, మహావాక్యములచే జీవబ్రహ్మైక్య యథార్థజ్ఞానము ఉత్పన్నమైననూ, పరమానంద ప్రాప్తిరూప మోక్షమునకు హేతువు కాజాలదు.

యదా తు సమ్యగ్విచారేణాసంభావనాదయో నివర్తన్తే తదాఽప్రతిబద్ధా సత్యజ్ఞానం నివర్తయతి,యథా మణ్యాదిప్రతిబన్ధనివృత్తావగ్నిస్తృణాదికం దహతి తద్వత్ । ఏతదపి తైరేవోక్తమ్- **"పురుషాపరాధవిగమే తు పునః ప్రతిబన్ధకవ్యుదసనాత్సఫలా । మణిమన్త్రయోరపగమే తు యథా సతి పావకాద్భవతి ధూమలతా"**(సం.శా.౧-౧౫)ఇతి। తథా చాజ్ఞానస్యానిర్వచనీయస్య కల్పితత్వేన జ్ఞానాన్నివృత్తిరుపపద్యతే ।

అందువల్ల, ఎప్పుడు వేదాంతవాక్యములయొక్క శ్రవణము, మననము, నిదిధ్యాసనరూప విచారము చేయునో, అప్పుడు - శ్రవణముచే ప్రమాణగత సంశయము, మననముచే ప్రమేయగత సంశయము మరియు నిదిధ్యాసనముచే విపరీతభావన - నివర్తింపబడును.ఎప్పుడు యీ అసంభావన మరియు విపరీత భావనరూప ప్రతిబంధకములు తొలగింపబడునో,అప్పుడు మణి మంత్రౌషధరూప ప్రతిబంధకరహిత అగ్నిసంయుక్తతృణాదులు దహించబడునట్లు-నిర్దుష్ట బుద్ధియందు అప్రతిబద్ధ దృఢ అపరోక్ష చరమసాక్షాత్కారరూప బ్రహ్మజ్ఞానముదయించి, స్వాత్మాజ్ఞానమును నాశనము జేయును. పరమానందరూప మోక్షము సిద్ధించును.

కావున, కల్పితపదార్థము మాత్రమే జ్ఞానముచే నివర్తింపబడుటకు యోగ్యముండును-అను నియమముచే, శ్రీగురుదేవుని ముఖారవిందముద్వారా వేదాంతవాక్యముల శ్రవణాది విచారముచేయగా నుత్పన్నమైన అప్రతిబద్ధ దృఢ అపరోక్ష బ్రహ్మాత్మైక

త్వవిజ్ఞానమను చరమసాక్షాత్కారరూప అఖండబ్రహ్మాకారవృత్తి యందు ప్రతిబింబిత విశేషచైతన్యముచే అనాది భావరూప స్వాత్మాజ్ఞానము నశించుచున్నది. అందువలన, అజ్ఞానము కల్పితము - అనిర్వచనీయము, మిథ్యయని సిద్ధించినది.

నచ తస్య కల్పకాభావోఽజ్ఞానస్య। లోకే దీపవత్,భాట్టపక్షే స్ఫురణవత్, గురుమతే సంవేదనవత్, గురబౌద్ధవ్యతిరిక్తమతే భేదవచ్చ స్వపరనిర్వాహకత్వాత్।నాప్యనవస్థా,అజ్ఞానాన్తరస్యాఽనఙ్గీకారాత్ ।

అజ్ఞానము కల్పితమనిన, దానికి కల్పకుడెవరు? మరొక కల్పకుడు లేనందున,అజ్ఞానము అకల్పితము అనగా సత్యమగును.అజ్ఞానమును సత్యమని అంగీకరించిన అనిర్మోక్ష ప్రసంగ మేర్పడును - అని పూర్వము పూర్వపక్షి శంకచేసియుండెను.

ఈ శంకకు సమాధానమిట్లున్నది—అజ్ఞానమునకు ఇతర మైన కల్పకుడెవరు లేడు.అంతమాత్రమున అది అకల్పితము(సత్యము)కాజాలదు.ఎందుకంటే,అజ్ఞానము-తనయొక్కకార్యమగు దేహాదిక ప్రపంచమునకు తానే కారణము,మరియు తన స్థితికి తానే కారణము. దీనినే'స్వపరనిర్వాహకత్వము'అంటారు. ఏవిధముగా, దీపము తనయొక్క ప్రకాశమునకు అన్యప్రకాశము యొక్క అపేక్షలేనిదై, తనను మరియు తన సన్నిధిలోని పదార్థములను ప్రకాశించునదై, స్వపరనిర్వాహకమున్నది. సాంఖ్యులు మరియు ప్రాభాకరులు(గురుమతము),మరికొందరి ఉపాసకు

ల మతమునందు,తనను మరియు తనచే సంబద్ధ దేహాది సర్వ వస్తువులను ప్రకాశించు స్వప్రకాశ ఆత్మ(సంవేదనము)ను స్వప రనిర్వాహకమని చెప్పుదురు.మరియు కుమారిలభట్టుగూడ స్ఫు రణమును స్వపరనిర్వాహకమని ఒప్పును.అనగా,ఇతరముయొ క్క జ్ఞానమునకు మరియు తన(ఆత్మ)యొక్క జ్ఞానమునకుగూడ తన అపేక్షను స్వీకరించి, ఆత్మను స్వపరనిర్వాహకమందురు. అదేవిధముగా,నైయాయిక మతమునందుగూడ, ఘటపటము లను భిన్నముచేసి చూపించు (భేదకర్త) రెంటియొక్క 'భేదము' యేది గలదో, అది ఘటమంటే పటము గాదు, పటమంటె ఘట ము కాదు- అని ఘటపటముల భేదమును తెలుపుతుంది. అట్లే, తనకు మరియు ఘటాదులకుగల (తనయొక్క) భేదమునుగూడ తానే తెలుపుతుంది. ఇట్లు, భేదము స్వపరనిర్వాహకమున్నది. అద్వైత సిద్ధాంతములో తన ప్రకాశమునందు తనయొక్కగాని, అన్య సర్వప్రకాశములయొక్కగాని అపేక్షలేనిదై, సర్వప్రకాశకమై యున్నందువలన ఆత్మ స్వయంప్రకాశమైయున్నది.స్వపరనిర్వా హకము కాదు,కాని, అజ్ఞానము స్వపరనిర్వాహకమని స్వీకరిం చబడినది.

తనయొక్క ఉత్పత్తికిగాని,తన జ్ఞానమునకుగాని, తన స్థితి కిగాని- తనయొక్క అపేక్ష ఉండినచో, ఆత్మాశ్రయ దోషముగా పరిగణించబడును. పైన తెలుపబడిన మతములలో యేదైతే స్వపరనిర్వాహకత్వము స్వీకరించబడినదో, అచ్చట ఆత్మాశ్రయ దోషము ప్రసక్తమౌతుంది. కాని,వారు ఆత్మాశ్రయమును దోష

ముగాకాకుండా భూషణముగా పరిగణించుదురు.అట్లే, వేదాంత సిద్ధాంతములో అజ్ఞానము(అవిద్య)ను, తన స్థితికి లేదా తన అధ్యాసకు తానే కారణము, మరియు తన కార్యమగు ప్రపంచ స్థితికి లేదా కార్యాధ్యాసకుగూడ తానే కారణము, గాన అజ్ఞానము స్వపరనిర్వాహకమని చెప్పబడినది. ఇచ్చటగూడ ఆత్మాశ్రయము ప్రసక్తమౌతుంది. కాని, ఏవిధముగా నైయాయికాదులు ఆత్మాశ్రమమును దోషముగా కాక భూషణముగా పరిగణించెదరో అట్లే, అద్వైతసిద్ధాంతములోగూడ ఆత్మాశ్రయ దోషమును, దోషముగా కాకుండా భూషణముగానే స్వీకరించబడినది.ఇట్లు, అజ్ఞానము స్వపరనిర్వాహకమున్నందున,దానికి మరొక కల్పక అజ్ఞానము లేనందున అనవస్థాదోష ప్రసక్తిగూడ రాదు.

తథా చాజ్ఞానస్య జ్ఞానాన్నివృత్తౌ మూలోచ్ఛేదాదహంకారస్య నివృత్తిసంభవాత్, ఆత్మని ప్రతీయమానస్యాహంకారోపాధి ప్రయుక్తస్య కర్తృత్వాదిరూపసంసారస్యాపి నివృత్తిర్భవతీతి ప్రత్యగాత్మనో బ్రహ్మాత్వజ్ఞానం సఫలమితి భావః ॥౧౭॥

ఈవిధముగా అహంకారమునకు మూలమగు అజ్ఞానము, జ్ఞానముచే నివృత్తమగుచున్నందున,అజ్ఞానము కల్పితమని సిద్ధించినది.కల్పితపదార్థమే జ్ఞానముచే నివృత్తమగుటకు యోగ్యముండును. కావున,"మూలే నాస్తి,కుతః శాఖాః"అను న్యాయముచే అహంకారముగూడ నివృత్తమగుచున్నది. మరియు అహంకారోపాధి యోగముచే యే కర్తృత్వభోక్తృత్వాది సంసారము ఆత్మయందు ప్రతీతియగుచుండెనో, ఆ సంసారముగూడ

అత్యంత నివృత్తమగును. అందువలన, బ్రహ్మాత్మైక్యజ్ఞానమునకు సంసార నివృత్తి ప్రయోజనమున్నందున, జ్ఞానము నిరర్థకము కాదు.జీవబ్రహ్మాల అభేదముగూడ నిర్విఘ్నముగా సుసంపన్నమైనది.ఎందుకనగా—

విభేదజనకేఽజ్ఞానే నాశమాత్యన్తికం గతే ।

ఆత్మనోర్బ్రహ్మణోర్భేద మసన్తం కః కరిష్యతి ॥

(వి.పు.౬-౭-౯౬; జాబాలదర్శనోపనిషత్ ౪-౬౩) ॥ ౧౭ ॥

## కర్మకాండముయొక్క ప్రామాణ్య వ్యవస్థ

నను బ్రహ్మవ్యతిరిక్తస్య సర్వస్యాజ్ఞానకల్పితతయా పరమార్థతోఽసత్త్వే కర్మకాణ్డాద్యప్రామాణ్యం స్యాత్;సహి స్వర్గకామాదేర్యాగాదికర్తవ్యతాం బోధయతి; తచ్చ బోధనం నియోగస్యాపూర్వస్య,నియోజ్యస్య పురుషస్య,నియోగవిషయస్య యాగస్య, నియోగఫలస్య స్వర్గస్య చ పరమార్థతోఽసత్త్వేఽనుపపన్నం స్యాత్, బ్రహ్మవ్యతిరిక్తస్య సర్వస్య పరమార్థతోఽసత్త్వ ఉపనిషదప్రామాణ్యంచ స్యాత్,తత్రాపిహి మోక్షకామస్య"**ఆత్మావా అరే ద్రష్టవ్యః**" (బృ.౪-౫-౬)ఇత్యాదినా శ్రవణాదికర్తవ్యతా బోధ్యతే; తస్యాప్యప్రామాణ్యమయుక్తమ్,కర్మకాణ్డోపనిషదేకదేశయోరపి బ్రహ్మవాక్యేన సహ సంప్రదాయస్య తుల్యత్వాత్ ॥

**శంక:**-అవిద్యా విద్యమానైవ నష్టప్రజ్ఞేషు దృశ్యతే ।

నామ్నైవాఙ్గీకృతాకారాసమ్యక్ప్రజ్ఞస్యసాకుతః॥(మహో.౪-౧౧౭)

అజ్ఞానమేవ న కుతో జగతః ప్రసఙ్గో,

జీవేశదేశికవికల్ప కథాతిదూరే।

ఏకాన్త కేవల చిదేకరసస్వభావే,

బ్రహ్మైవ కేవలమహం పరిపూర్ణమస్మి ॥(వరాహో.౨-౭౩)

బ్రహ్మమాత్రమనాద్యన్తం నావిద్యాస్తి మనాగపి ।

నాత్మైవేదమవిద్యేతి భ్రమమాత్రమసద్విదుః ॥

న విద్యతే యా సా సత్యా కీదృగ్రామ భవేత్కిల ।

అవిద్యేయమయం జీవ ఇత్యాది కలనా క్రమః ॥

అప్రబుద్ధ ప్రబోధాయ కల్పితో వాగ్విదాం వరైః ।

బ్రహ్మహం త్రిజగద్బ్రహ్మ త్వం బ్రహ్మ ఖలు దృశ్యభూః ॥

ద్వితీయా కలనా నాస్తి యథేచ్ఛసి తథా కురు ॥

(యో.వా.నిర్వాణ ప్ర.పూర్వా.౪౯-౧౩,౧౪,౧౭,౨౩)

ఇత్యాది శ్రుతి స్మృతి యుక్తి అనుభవములచే బ్రహ్మభిన్న అజ్ఞానము కల్పితమని సిద్ధించినందున, తత్కార్యమగు ప్రపంచ ముగూడ కల్పితమే.అలాంటపుడు,స్వర్గాదులనుద్దేశించి యాగా దులనువిధానముచేసిన కర్మకాండాది వేదభాగము అప్రామా ణ్యమగును.''స్వర్గకామోయజేత''''సోమేన యజేత స్వర్గకామః'' (ఆపస్తంబశ్రౌత సూత్రము ౧౦-౧-౧౬)ఇత్యాది శాస్త్రప్రమాణములను విచారించినచో,స్వర్గకామః=స్వర్గమును కోరు పురుషుడు;స్వర్గ ము=ఫలము;నియోగము=సాక్షాత్ స్వర్గసాధనమగు యాగజ న్య అపూర్వము(పుణ్యము);నియోజ్య పురుషుని నియోగవిషయ

మగు యాగము=స్వర్గపరంపరా సాధనము—ఇవన్నియు వస్తుతః అసద్రూపములైనచో,యాగాదులను విధానముచేసిన కర్మకాండరూప వేదభాగమునకు అప్రామాణ్య ప్రసక్తి యేర్పడును. అట్లే, బ్రహ్మవ్యతిరిక్త సర్వము అసత్తైనచో, జీవబ్రహ్మైక్యమును ప్రతిపాదించు"ఆత్మావాఽరే ద్రష్టవ్యః"(బృ.౨-౪-౫;౪-౫-౬) ఇత్యాది ఉపనిషద్భాగమునుగూడ అప్రామాణ్యమని చెప్పవలసివచ్చును.కాని,సాంప్రదాయికులు ఉపనిషత్తులను సాక్షాత్ బ్రహ్మప్రతిపాధకములని మరియు కర్మకాండవాక్యములుగూడ పరంపరారూపముచే బ్రహ్మమునందే తాత్పర్యము గలవని, యీ రెంటికి ఏకవాక్యతను స్వీకరించారు. ఇట్లుండగా, బ్రహ్మవ్యతిరిక్తము సర్వము మిథ్యయని స్వీకరించిన ఈశ్వరప్రణీత సంపూర్ణ వేదము అప్రమాణికమగును.ఇది ముముక్షువులకు అనిష్టమున్నది.

ఇత్యాశఙ్క్య,కిం తత్త్వజ్ఞానోత్తరకాలే కర్మకాణ్డాద్యప్రామాణ్యమాపద్యతే,కిం వా తతః ప్రాక్కాలే?నాద్యః తదుత్తరకాలే తదప్రామాణ్యస్య గార్హస్థ్యే బ్రహ్మచారిధర్మావేదకశ్రుతేరివ, సంన్యాసాశ్రమకాలేఽగ్నిహోత్రాదిశ్రుతేరివ చ ఇష్టత్వాదిత్యభిప్రేత్య ద్వితీయం ప్రత్యాహ —

ఈశంకకు సమాధానము చెప్పుటకై,మొదలు శంకాకారుని ఇట్లు వికల్పము చేయుచున్నాడు.ఏమి, తత్త్వజ్ఞానానంతరము కర్మకాండాదులకు అప్రామాణ్యము ప్రాప్తమవుతుందని అంటావా? లేక, తత్త్వజ్ఞానోత్పత్తి కంటె పూర్వమే అప్రామాణ్యాపత్తి వస్తుందంటావా?

బోధాత్పూర్వం తన్మృషా చోత్తరం వా,

పూర్వం తచ్చేన్నాస్తి మిథ్యేతి బాధః ॥

బోధాదూర్ధ్వం తన్మృషా త్వం వదేథా,

ఇష్టంతన్నస్తే చిరాయుఃప్రభూయాత్॥(స్వానుభవాదర్శః ౧౬౯)

తత్త్వజ్ఞానోత్తర కాలములో కర్మకాండాదులకు అప్రామాణ్య ప్రసక్తి యేర్పడునన్నచో,మాకుగూడ ఇష్టమే.ఎందుకనగా, గృహ స్థాశ్రమ స్వీకారానంతరము బ్రహ్మచారి ధర్మములను ఉపదేశించిన శాస్త్రము అప్రామాణ్యమౌతుంది.సంన్యాసాశ్రమ స్వీకారానంతరము అగ్నిహోత్రాదులను ప్రతిపాదించిన శ్రుతివాక్యములు అప్రామాణ్యములగును.అట్లే,తత్త్వజ్ఞానోత్తరకాలములో సర్వవేద వాక్యములకు అప్రామాణ్యత వస్తుంది - ఇది మాకు ఇష్టమే.

గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞాన తత్త్వతః(తత్పరః) ।

పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథ మశేషతః॥ (బ్ర.బిం.౧౮)

యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్(బృ.౪-౫-౧౫)

ఇచ్చట ఈరహస్యముగలదు-ఉత్తరాశ్రమములోనున్న పురుషునికి పూర్వాశ్రమములోని ధర్మప్రతిపాదక శ్రుతి నిరర్థకమగును.కాని,ఇంకను పూర్వాశ్రమములోనే ఉన్నవానికి ప్రామాణ్యములేయగును.

ఇట్లు,ప్రథమవికల్పవిషయంలో ఇష్టత్వాభిప్రాయమును హృదయమందుంచుకొని,తత్త్వజ్ఞానమునకు పూర్వకాలములో వేద

వాక్యములకు అప్రామాణ్యత వస్తుందా?అను ద్వితీయ వికల్ప మునకు మూలగ్రంథకర్త ఈక్రింది శ్లోకముద్వారా సమాధాన మిస్తున్నాడు —

**ఆత్మాజ్ఞానమహానిద్రాజృమ్భితేఽస్మిఞ్జగన్మయే।**

**దీర్ఘస్వప్నే స్ఫురన్త్యేతే స్వర్గమోక్షాదివిభ్రమాః ॥ ౧౮ ॥**

**అన్వయః:**-ఆత్మాజ్ఞాన మహానిద్రాజృమ్భితే అస్మిన్ జగన్మయే దీర్ఘస్వప్నే ఏతేస్వర్గమోక్షాది విభ్రమాః(భ్రమేణ)స్ఫురన్తి(న వస్తుతః ఇత్యర్థః అథవా స్ఫురన్తి ఇవ అర్థాత్ న స్ఫురన్తి ఇత్యర్థః)॥౧౮॥

**అన్వయార్థము:**-ఆత్మాజ్ఞానమహానిద్రాజృమ్భితే=ఆత్మవిషయక అజ్ఞానరూప మహానిద్రచే ఉత్పన్నమైన;అస్మిన్ జగన్మయే=ఈ జగద్రూప;దీర్ఘస్వప్నే=దీర్ఘస్వప్నమునందు;ఏతే=ఈ;స్వర్గమోక్షాది ; విభ్రమాః=స్వర్గము మరియు మోక్షము మొదలగు భ్రమలు; స్ఫురన్తి(ఇవ)=స్ఫురించుచున్నట్టువలె కన్పట్టుచున్నవి.

**టీకా:** - ఆత్మాఽజ్ఞానమ్=ప్రత్యగాత్మాశ్రయవిషయకమజ్ఞానం, తదేవ మహతీనిద్రాఽనాదికాలమారభ్య ప్రవృత్తత్వాత్స్వరూపావరణపూర్వకవిపరీతహేతుత్వాచ్చ, తతో జృమ్భితే=ఉత్పన్నేజగన్మయే-జగద్రూపేఽస్మిన్ననుభూయమానే దీర్ఘస్వప్నే=తత్త్వజ్ఞానపర్యన్తమనువర్తమానే, ఏతే స్వర్గమోక్షాదివిభ్రమాః స్వర్గమోక్షావాదీ యేషాంవిభ్రమాణాం తే తథా। స్వర్గశబ్దస్తత్కామనియోజ్యనియోగతద్విషయయాగాదేరప్యుపలక్షణమ్। మోక్షశబ్దశ్చ తత్సాధనజ్ఞానశ్రవణాదినియోగాదేరప్యుపలక్షణమ్,ఆదిశబ్దో లౌకికవ్యవహా

రానుకూలకలత్రపుత్రమిత్రాదిసంగ్రహార్థః।మోక్షస్య బన్ధసాపేక్షత్వా ద్బన్ధస్య చ మిథ్యాత్వాద్బన్ధసాపేక్షమోక్షస్యాపి విభ్రమత్వం ద్రష్ట వ్యమ్ । స్ఫురన్తి=స్ఫురన్తీవ, న స్ఫురన్తీత్యర్థః ।

ఆత్మాజ్ఞానమనగా ప్రత్యగాత్మను ఆశ్రయించుకొని ఉండి, దానినే విషయముచేయు=కప్పివేయు=తెలియకుండాజేయు స్వ భావముగల ఒకానొక మహానిద్ర=అనాదికాలమునుండి ప్రవృ త్తమై ప్రత్యగాత్మను ఆవరించి,నామరూపాత్మక విపరీత=అసత్తు జడము దుఃఖము మోహాత్మకమగు జగత్తునకు హేతువగు అ-జ్ఞానమే మహానిద్రయనబడును.దానిచేనుత్పన్నమై తత్త్వజ్ఞాన ముదయించు పర్యంతము అనుభూయమానమగుచున్న ఈ స్వర్గమోక్షాది జగద్రూప దీర్ఘస్వప్నము భ్రమ రూపమున్నది.

దీర్ఘ స్వప్నమిమం విద్ధి దీర్ఘం వా చిత్తవిభ్రమమ్ ।

దీర్ఘం వాపి మనోరాజ్యం సంసారం రఘునందనః ॥

(యో వా.నిర్వాణ ప్ర. పూర్వార్ధం. ౨౮-౨౯)

జగత్తులోనున్నట్టి సకలపదార్థములు భ్రమరూపములేయైన నూ,వాటిలో స్వర్గమోక్షములు ప్రధానములుగా ప్రతీతమగుచు న్నందున,మూలగ్రంథకర్తయగు శ్రీలక్ష్మీధర కవీంద్రులవారు'స్వర్గ మోక్షాది విభ్రమాః'అని చెప్పియున్నారు.ఇచ్చట'స్వర్గ'శబ్దముచే నుపలక్షణముగా స్వర్గమును ఇచ్ఛగించువాడు=స్వర్గకామః; స్వ ర్గమునుద్దేశించి పురుషుణ్ణి ప్రవృత్తముచేయు'యజేత'ఇత్యాది విధి; విధికి విషయమగు యాగము; యాగమునుండి ఉత్ప

న్నమై స్వర్గమునకు సాక్షాత్సాధనమగు పురుషబుద్ధిగత నియో గము=అపూర్వము=పుణ్యవిశేషము మొదలగు వాటినన్నిటిని గ్ర హించవలెను. అట్లే, 'మోక్షమ'ను పదముచే మోక్ష సాధనమగు జ్ఞానము, జ్ఞానసాధనములగు శ్రవణాదులను ఉపలక్షణముగా గ్రహించవలెను. 'ఆది'పదముచే లౌకికవ్యవహారమునకు అను కూల కుటుంబము=విత్త,పుత్ర,మిత్ర,కళత్రాదులను గ్రహించాలి. అహంకారము మొదలుకొని సర్వ సంసారము బంధమనబడు ను. బంధము మిథ్య. మిథ్యాబంధ సాపేక్షమగు మోక్షముగూడ మిథ్యయేయగును,జగత్తుగాని,జగదంతఃపాతియగు బంధమోక్ష ములుగాని,లౌకిక వ్యవహారానుకూల పుత్రాదులుగాని- ఇవన్ని యును అనాదిఅజ్ఞానముచే స్వాప్నికపదార్థములవలె స్ఫురించి నట్టువలె స్ఫురించుచున్నవి.

మాయాక్ళృప్తౌ బంధ మోక్షౌ నస్తః స్వాత్మని వస్తుతః ।
యథా రజ్జౌ నిష్క్రియాయాం సర్పాభాసవినిర్గమౌ ॥
బుద్ధేరేవ గుణావేతౌ నతు నిత్యస్య వస్తునః ।
అతస్తౌ మాయయా క్ళృప్తౌ బంధమోక్షౌ న చాత్మని ॥
(ఆత్మోపనిషత్ ౨౬ & ౨౭)

నిత్యాసంభవ బంధస్య బద్ధోఽస్మీతి కుకల్పనా ।
యస్య కాల్పనికస్తస్య మోక్షోమిథ్యా న తత్త్వతః॥
(యో.వా.ఉత్పత్తి ప్ర.౧౦౦-౩౭)

'స్ఫురన్తీవ'శబ్దముయొక్క తాత్పర్యమేమనగా, అద్వైతాను భూతి దృఢముగా కలిగినవేళ వస్తుతః జగదాదికము స్ఫురించ దు.ప్రారబ్ధబలముచే జగత్తు బాధితానువృత్తిచే ఉన్నట్టువలె ప్రతీతియగును.''బాధము''అనగా మిథ్యాత్వనిశ్చయము లేదా త్రైకాలిక అభావనిశ్చయము.

బాధితాఽపి పునర్మాయా భాతి దిఙ్మోహ భానువత్ ।
ప్రారబ్ధకర్మ పర్యన్తం బ్రహ్మవిజ్ఞానినామపి ॥
బ్రహ్మవిజ్ఞాన సంపన్నః ప్రతీతమఖిలం జగత్ ।
పశ్యన్నపి సదా నైవ పశ్యతి స్వాత్మనః పృథక్।
(సూత సంహిత యజ్ఞవైభవ ఖండము ౪౫-౨౦ & ౨౧)

అయం భావః–తత్త్వజ్ఞానాత్పూర్వకాలే వ్యావహారికసత్యస్య సర్వస్య జగతో నియోజ్యనియోగాదేః సత్త్వేన ప్రబోధాత్పూర్వం స్వప్నాదావివ సర్వవ్యవహారోపపత్తేర్న కర్మకాణ్డాద్యప్రామాణ్యమ్, తస్య వ్యావహారికప్రామాణ్యస్య సత్వాత్।తావతాచ తస్య చరితార్థత్వేఽతత్పరాణామగతికానాం బ్రహ్మవాక్యానాం పరమార్థసత్య విషయాణాం నాకస్మాద్బాధోయుక్తః।తదర్థస్య వ్యవహారాతీతత్వేన వ్యావహారికప్రామాణ్యానుపపత్తౌ బ్రహ్మవాక్యానాం తాత్త్విక ప్రామాణ్యస్యాప్యనఙ్గీకారే కిఞ్చిదపి ప్రామాణ్యం నస్యాత్, ప్రకార భేదేనోభయప్రామాణ్యోపపత్తౌ, చ సర్వాత్మనా తదప్రామాణ్యం న యుక్తమ్। తదుక్తం సకలవేదార్థజ్ఞేన బ్రహ్మణాపి బ్రహ్మగీతాయామ్ **"సత్యార్థో హి ద్విధా ప్రోక్తో మయా హే స్వర్గవాసినః ।**

**ఏకఃస్వభావతఃసాక్షాత్పరమార్థః సదైవ తు॥స శివః సత్యచైతన్యః సుఖానన్త్యస్వలక్షణః॥ అపరః కల్పితఃసాక్షాదబ్రహ్మణ్యధ్యస్తమాయ యా॥వ్యావహారికసత్యార్థ సాక్షాత్సత్యార్థ చిద్ఘనమ్।ఉభయం వక్తి వేదస్తు మార్గా నైవంవదన్తి హి"** (౨-౧౭,౧౮,౨౧).

ఇచ్చట ఈయభిప్రాయము గలదు—తత్త్వజ్ఞానమునకు పూర్వము జగత్తు వ్యావహారిక సత్యమున్నందున;యాగకర్త, యాగ విషయక విధి, యాగముయొక్క ఫలము-స్వర్గము- వీటన్నిటికి సత్యత్వముంది.మెలకువకు రానంతవరకు స్వాప్నిక పదార్థములు సత్యములుగా దోచునట్లు, వరజాగ్రత=స్వప్రబోధము కలుగనంతవరకు జాగ్రజ్జగత్తు వ్యావహారిక సత్యమున్నది. కావున,కర్మకాండాదులు అప్రామాణికములు కావు.ఎందుకంటె,వ్యావహారిక ఉపయోగమున్నందువలన, వ్యావహారిక సత్యత్వముచే ప్రామాణికత్వముంది.

తమేతమవిద్యాఖ్యమాత్మానాత్మనోరితరేతరాధ్యాసం పురస్కృత్య సర్వేప్రమాణప్రమేయ వ్యవహారా లౌకికావైదికాశ్చ ప్రవృత్తాః॥సర్వాణిచ శాస్త్రాణివిధినిషేధ మోక్షపరాణి ॥(అధ్యాసభాష్యము)

దేహాత్మ ప్రత్యయో యద్వత్ప్రమాణత్వేన కల్పితః ।

లౌకికం తద్వదేవేదం ప్రమాణం త్వాఽఽత్మనిశ్చయాత్ ॥

(బ్ర.సూ.౧-౧-౪) (సుందరపాండ్య)

సర్వవ్యవహారాణామేవప్రాక్ బ్రహ్మాత్మతావిజ్ఞానాత్సత్యత్వోపపత్తేః । స్వప్న వ్యవహారస్యేవ ప్రాక్ ప్రబోధాత్ (బ్ర.సూ.౨-౧-౧౪).

కర్మాదులను ప్రతిపాదించని,కర్మకాండయందు అనుపయు క్త బ్రహ్మప్రతిపాదక వాక్యములు పారమార్థిక సత్యవిషయక ములున్నవి. కావున,బ్రహ్మప్రతిపాదక ఉపనిషద్రూప వేదభాగ మును అకస్మాత్తుగా అప్రామాణ్యమని బాధించుట యుక్తము కాదు. బ్రహ్మవాక్యములు వ్యవహారాతీతములున్నందున, వాటికి వ్యావహారిక ప్రామాణ్యమైతే లేదు,కాని వాటికి తాత్త్విక ప్రామా ణ్యతనుగూడ నిరాకరించుట తగదు.లేనిచో,సర్వథా అప్రామా ణ్యములగును.కావున,ప్రకారభేదముచే కర్మకాండవాక్యములకు వ్యావహారిక ప్రామాణ్యత మరియు బ్రహ్మవాక్యములకు తాత్త్విక ప్రామాణ్యత సిద్ధించుచున్నది.వేదమునకు యేవిధమైన ప్రామా ణ్యతగూడ లేదనుట యుక్తముకాదను విషయమును సకల వేదార్థములను తెలిసిన బ్రహ్మదేవుడు ఇలా సెలవిచ్చాడు.

ఓ స్వర్గవాసులగు దేవతలారా!నేను సత్యవస్తువును రెండు విధములుగా చెప్పియున్నాను.ఒకటి,స్వాభావిక నిత్యమగు సా క్షాత్పరమార్థసత్యము-శివస్వరూపమే. అనగా మంగళస్వరూప ము, సచ్చిదానందస్వరూపము,అంతరహితము-ఇత్యాది స్వరూ ప లక్షణము గలది.రెండవది-వ్యావహారిక సత్యము. సాక్షాత్తు గా బ్రహ్మమునందు మాయచేకల్పితము=అధ్యస్తమున్నది.అందు కని నికృష్టమున్నది. ఈ ప్రకారముగా వ్యావహారిక సత్యత్వము మరియు విజ్ఞానస్వరూప పరమాత్మయొక్క పారమార్థిక సత్య త్వము—పరాపరరూప రెండువిధముల సత్యార్థమును వేదము ప్రతిపాదించినది.

"నైవం వదన్తి హి" అనగా –

తస్మాద్వేదోదితో హ్యర్థః సత్యం సత్యం మయోదితమ్ ।

అన్యేన వేదితో హ్యర్థో న సత్యః పరమార్థతః ॥(బ్ర.గీ.౨-౧౬)

అందువలన,నాచేతచెప్పబడిన అర్థమే పునఃపునః సత్యము. వేదేతరగ్రంథములు పారమార్థిక చైతన్యరూప సత్యత్వమును చెప్పుట లేవు.

అతోఽద్వితీయ బ్రహ్మణఏవ పరమార్థసత్యత్వేఽపి వ్యావహారికసత్యార్థత్వేనార్థవత్త్వాన్నకర్మకాణ్డాద్యప్రామాణ్యమితి॥౧౮॥

అందువలన,వాస్తవముగా అద్వితీయ బ్రహ్మమే పరమార్థ సత్యమున్నది. అయినను వ్యావహారికసత్యత్వముచే సార్థక్యత గలవైనందున కర్మకాండాదులుగూడ అప్రామాణికములు కావు.

## చైతన్యమునందు జడచేతన విభాగ వ్యవస్థ

నన్వేవమపి జీవస్య భోక్తుస్తద్భోగ్యజాతస్య చ బ్రహ్మమాత్రత్వేఽనుభూయమానభోక్తృభోగ్యవిభాగో న స్యాత్,సర్వస్య బ్రహ్మణ్యధ్యస్తత్వావిశేషాదిత్యాశఙ్క్య, మాయావశాదేవ విభాగోఽయముపపద్యత ఇత్యాహ —

శంక:-అట్లైననూ,భోక్తయగు జీవుడు మరియు తనయొక్క భోగ్యపదార్థములన్నియునూ అద్వితీయ బ్రహ్మమేయని స్వీకరించినచో, ప్రత్యక్షముగా అనుభూయమానమగు భోక్త మరియు భోగ్యము-అను విభాగమే ఉండజాలదు.ఎందుకంటే, అవిశేష

ముచే=సామాన్యముగా=సమానముగాసర్వము బ్రహ్మమునంద ధ్యస్తములున్నవి.

ఈ శంకకు సమాధానముగా-సర్వము బ్రహ్మమునందు సమానముగా అధ్యస్తమైనప్పటికిని, మాయచేత భోక్త, భోగ్య విభాగము సంభవించును-అని ఈక్రింది శ్లోకముద్వారా చెప్పు చున్నాడు.

**జడాజడవిభాగోఽయమజడే మయి కల్పితః ।**

**భిత్తిభాగే సమే చిత్రే చరాచరవిభాగవత్ ॥ ౧౮ ॥**

**అన్వయః :**-అజడే మయి అయమ్ జడాజడవిభాగః కల్పితః సమే భిత్తిభాగే చిత్రే చరాచరవిభాగవత్ (ఆరోపితః)॥ ౧౮ ॥

**అన్వయార్థము:**-సమే=ఒకేతీరుగ;భిత్తిభాగే=కుడ్యమునందు =గోడపైన;చిత్ర చరాచర విభాగవత్=లిఖింపబడిన జడాజడ వి భాగమువలె;అజడే మయి=చేతనస్వరూపుడనగునాయందు; అ యమ్=ఈ(జడాజడ విభాగము);కల్పితః=మాయచే ఆరోపించ బడినది.

**టీకా:**-జడాజడవిభాగః,జడమిదం భోగ్యమజడోఽయం భో క్తేతి విభాగోఽయం ప్రతీయమానోఽజడేఽలుప్తచైతన్యస్వరూపే మయి ప్రత్యగభిన్నేబ్రహ్మణి కల్పితః=మాయయాఽఽరోపిత ఇత్య ర్థః। స్వప్రకాశేఽప్యేకస్మిన్బ్రహ్మణ్యుపాధిప్రాధాన్యద్భోగ్యజడకల్పనా, ఉపాధేయప్రాధాన్యాదజడభోక్తృకల్పనాప్యుపపద్యతే।తదుక్తంవార్తి కకారైః–"తమఃప్రధానఃక్షేత్రాణాం చిత్ప్రధానశ్చిదాత్మనామ్। పరః

కారణతామేతి భావనాజ్ఞానకర్మభిః"(బృ.వా.౧-౪-౩౪౨) ॥ ఇతి ।

ఇది జడము=భోగ్యమున్నది.ఇది అజడము=చేతనము-భోక్త ఉన్నది-అని యిట్లు ప్రతీతమగు విభాగము అలుప్తప్రకాశ స్వరూపుడనగు=నిత్యజ్ఞానస్వరూపుడనగు నాయందు,అనగా ప్రత్యగభిన్నపరబ్రహ్మమునందు కల్పితము అనగా మాయచే ఆరోపితమున్నది. స్వప్రకాశమగు బ్రహ్మము ఏకమేయైననూ ఉపాధి ప్రాధాన్యముచే భోగ్యమగు జడముయొక్క కల్పన,మరియు ఉపాధేయ(ఉపహిత)ప్రాధాన్యముచే భోక్తయగు చేతనముయొక్క కల్పన ఉపపన్నమగును=సంభవించును.ఈ విషయములో శ్రీ సురేశ్వరాచార్యుల వారు బృహదారణ్యక భాష్య వార్తికములో ఇట్లు చెప్పియున్నారు.

తమఃప్రధానః=తమోగుణ ప్రధానముగాగల మాయోపాధికుడైన;పరః=పరమాత్మ;క్షేత్రాణాం=జడములైన సర్వశరీరములకును;చిత్ప్రధానః=చైతన్యప్రధానమగు పరమాత్మ:చిదాత్మనాం=చిదాభాసరూప జీవులకును; భావనా జ్ఞాన కర్మభిః=శుభాశుభ భావనారూపసంస్కారములు,శుభాశుభ లౌకికవైదిక జ్ఞానము (ఉపాసన),శుభాశుభ కర్మలు నిమిత్తకారణములుగా గైకొని; కారణం ఏతి=కారణత్వమును పొందుచున్నాడు.

శుద్ధచైతన్యము జగత్కారణము కానేరదు."న తస్య కార్యం కరణం చ విద్యతే"(శ్వే.౬-౮)

బ్రహ్మాజ్ఞానాజ్జగజ్జన్మ బ్రహ్మణోఽకారణత్వతః ।

అధిష్ఠానత్వమాత్రేణ కారణం బ్రహ్మ గీయతే ॥

అస్య ద్వైతేంద్రజాలస్య యదుపాదానకారణమ్ ।

అజ్ఞానం తదుపాశ్రిత్య బ్రహ్మ కారణముచ్యతే ॥

(బృ.భాష్యవార్తికమ్ ౧-౪-౩౭౧)

అజడేబ్రహ్మణి సదృశవిసదృశోభయకల్పనేదృష్టాంతమాహ–భిత్తీత్యాదినా। భిత్తిభాగే=కుడ్యప్రదేశే,సమే=నిర్వికారే అచలఇత్యర్థః। చరాచరవిభాగవత్=చరస్య=గజాదేరచరస్య=పర్వతాదేశ్చ విభాగో యథా, తద్వదిత్యర్థః ॥ ౧౯ ॥

అజడమగు చేతన బ్రహ్మమునందు, తనకు సమానమగు చేతనజీవులయొక్క మరియు అసమానమగు జడమైనభోగ్యవర్గముయొక్క—ఉభయకల్పనవిషయంలో దృష్టాంతమును చెప్పుచున్నాడు.నిర్వికారము,అచలమునగుకుడ్యమునందు=ఒకే గోడపై చిత్రములో చరములగు గజాదులు మరియు అచరములగు పర్వతాదులయొక్క విభాగమెట్లు కనబడునో,అట్లే నిర్వికారము,అచలమునగు ఒకే బ్రహ్మమునందు చేతనరూప భోక్తలయొక్క మరియు అచేతనమగు భోగ్యములయొక్క విభాగము మాయచేత ప్రతీతియగుట సంభవించును.

నిరుపమ నిత్య నిరంశకేఽప్యఖండే,

మయి చితి సర్వవికల్పనాది శూన్యే ।

ఘటయతి జగదీశజీవ భేదం

త్వఘటిత ఘటనా పటీయసీ మాయా ॥ (మాయాపంచకమ్)

మాయాయాం సర్వ సంభవాత్ ॥ (వే.పం.౬-౧౫౯)

**ఆత్మయొక్క నిర్వికారత్వము మరియు బ్రహ్మరూపత్వము**

నన్వేవమప్యాత్మనో బ్రహ్మత్వం న సంభవతి,తస్య సంసార సాక్షితారూపవికల్పయుక్తత్వాత్,బ్రహ్మణశ్చ '**అస్థూలమనణు**'(బృ.౩-౮-౮)'**నేతినేతి**'(బృ.౩-౯-౨౬;౪-౨-౪;౪-౪-౨౨)ఇత్యాదిశ్రుత్యా నిర్వి కల్పకతయా సిద్ధేరిత్యాశఙ్క్యాహ —

శంక:-అట్లైననూ,ప్రత్యగాత్మకు బ్రహ్మత్వము సంభవించదు. ఎందుకనగా,ప్రత్యగాత్మ సంసారమునకు సాక్షిత్వరూప వికల్ప యుక్తమై ఉన్నది.బ్రహ్మమైతే అస్థూలాది శ్రుతిచే నిర్వివికల్పము గా తెలియబడుచున్నది.కావున,నిర్వికార బ్రహ్మముచే వికార యుక్త ప్రత్యగాత్మకు ఐక్యముసంభవించదు.ఈశంకకు సమాధా నముగా ఉత్తర శ్లోకమును ప్రవృత్తము చేయుచున్నాడు.

**చైత్త్యోపరాగరూపా మే సాక్షితాపి న తాత్త్వికీ ।**

**ఉపలక్షణమేవేయం నిస్తరఙ్గచిదమ్బుధేః ॥ ౨౦ ॥**

**అన్వయః**:-చైత్త్యోపరాగరూపా సాక్షితా అపి మే న తాత్త్వికీ కిన్తు ఇయమ్(సాక్షితా)నిస్తరఙ్గచిదమ్బుధేఃఉపలక్షణమ్ (యావత్ సాక్ష్యమ్ తావదేవ) ॥౨౦॥

**అన్వయార్థము**:-మే=నాయొక్క;సాక్షితా అపి=సాక్షిత్వము

గూడ;చేత్యోపరాగరూపా=చేత్యము అనగా దృశ్యవర్గముయొక్క, ఉపరాగము=సంబంధరూపమే ఉన్నది; తాత్త్వికీ న=వాస్తవము కాదు; అయమ్=ఇది;నిస్తరంగచిదంబుధేః=తరంగరహిత చేతన సముద్రమునకు; ఉపలక్షణమ్ ఏవ= ఉపలక్షణము మాత్రమే.

**టీకా:-**చైత్యోపరాగరూపా,చైత్యం=కర్తృత్వాదిప్రపఞ్చఃతేనోప రాగః=సంబన్ధః, తద్రూపా సాక్షితాపి=సాక్షిత్వమపి మే=మమ ప్రత్యగాత్మనో,నతాత్త్వికీ=న పరమార్థభూతా। చేత్యస్యాపరమార్థ త్వేన తత్సంబన్ధిసాక్షితాయాఅపి పరమార్థస్వరూపత్వాయోగాత్। కింత్వియం సాక్షితా,నిస్తరఙ్గచిదమ్బుధేః; నిస్తరఙ్గః=పరమార్థతో నిరస్తస్తరఙ్గఃకర్తృత్వాదిప్రపఞ్చరూపో యస్యాః సా చిదేవామ్బుధిః =సముద్రో నిస్తరఙ్గచిదమ్బుధిః,తస్య మే=మమప్రత్యగాత్మన ఉప లక్షణమేవ=తటస్థాసతీ జ్ఞాపికైవ,జగత్కారణత్వమివ బ్రహ్మణః। తథా చాత్మనో వస్తుతో నిర్వికల్పత్వాన్న బ్రహ్మత్వానుపపత్తిరితి భావః ॥౨౦॥

చేత్యమనగా కర్తృత్వాది ప్రపంచము,దానితో ఉపరాగః=క ల్పితసంబంధము—కర్తృత్వాది ప్రపంచముతో కల్పిత సంబంధ రూపమే నాయందలి సాక్షిత్వము. ప్రత్యగాత్మయగు నాయందు వాస్తవముగా సాక్షిత్వరూప వికారము లేదు.ఎందుకనగా, చైత న్యమునందధ్యస్త చేత్యమునకు అనగా కర్తృత్వాది ప్రపంచమున కు పారమార్థిక సత్యత్వము లేనందున,తత్సంబంధి ప్రత్యగాత్మ కు సాక్షిత్వమెట్లు సత్యమగును?అధ్యస్తముయొక్క గుణదోష ములు అధిష్ఠానమునకు అణుమాత్రముగూడ అంటజాలవు.

"యత్ర యదధ్యాసః తత్కృతేన గుణేన దోషేణ వాఽణుమాత్రేణాపి స న సంబధ్యతే"।(అధ్యాసభాష్యము)తాత్త్వికదృష్టితో ప్రత్యగాత్మనగు నాకు సాక్షిత్వముగూడ లేదు.

ద్రష్టా నాఽహం దృశ్యమిథ్యాత్వహేతో

ర్నాహం సాక్షీ సాక్ష్యమిథ్యాత్వ హేతోః ।

ప్రత్యక్సిద్ధ్యై దృశ్యతోఽన్యత్వ సిద్ధ్యై

ద్రష్టా సాక్షీ చేతి బోధో గురుభ్యః ॥(స్వానుభవాదర్శః ౧౦౮)

ద్రష్టృత్వముగాని సాక్షిత్వముగాని ప్రతియోగి సాపేక్షములు, ప్రతియోగియగు దృశ్యములు, సాక్ష్యములు మిథ్య గావున, తత్సాపేక్ష ద్రష్టృత్వము, సాక్షిత్వముగూడ మిథ్యయే యగును.

తరంగములు అనగా కర్తృత్వాది ప్రపంచము దేనియందు వాస్తవముగా లేదో, అట్టి చైతన్యమే అమ్బుధిః=సముద్రము,అట్టి చిత్సముద్రరూప చిత్స్వరూపుడనగు నాయందు సాక్షిత్వము ఉపలక్షణ మాత్రమున్నది. ఉపలక్షణమనగా—"విశేష్యానన్వయిత్వే కాదాచిత్కత్వే వా సతి వ్యావర్తకత్వమ్=ఉపలక్షణత్వమ్"స్వరూపమునందు అన్వయించి లేనిదై, ఒకానొకప్పుడు మాత్రముండి, ఇతరమునుండి వేరుజేసి చూపెట్టునది=ఉపలక్షణమనబడును. ఉదా:-కాకాదికందేవదత్తగృహాదేః। దేవదత్తుని గృహములో అన్వయించిలేనిదై ఎప్పుడో ఒకసారి మాత్రముండునదై ఇతరుల గృహములనుండి దేవదత్తుని ఇంటిని చూపెట్టు కాకివలె. అనగా, "యతోవా"(తై.౩-౧);"జన్మాద్యస్యయతః"(బ్ర.సూ.౧-౧-౨)ఇత్యాది

శ్రుతిసూత్రములచేఎట్లు బ్రహ్మమునకు జగత్కారణత్వము బ్రహ్మమునకు తటస్థలక్షణముగా తెలియబడుచున్నదో,అట్లుఈ కల్పిత సాక్షిత్వము నన్ను తెలియజేయుటకు ఉపలక్షణమైనది. పై వివేచనముద్వారా ప్రత్యగాత్మకు పారమార్థిక సాక్షిత్వరూప వికల్పము(వికారము)లేనందున,నిర్వికల్ప బ్రహ్మత్వము అనుపపన్నము కాదు.॥ ౨౦ ॥

ఏవముక్తేన ప్రకారేణ బ్రహ్మణి జగత, ఆత్మని చాహంరాదేః కల్పితత్వేన వస్తుతోఽభావాత్పదద్వయలక్ష్యే బ్రహ్మణి న కశ్చిదపి వికార ఇత్యాహ —

పైన చెప్పబడినట్లుగా, బ్రహ్మమునందు జగత్తు మరియు ప్రత్యగాత్మయందుఅహంకారాదులు కల్పితములు అనగా అత్యంతాభావమున్నవి.కావున,'తత్'మరియు'త్వం'-ఉభయపదలక్ష్యార్థమగు బ్రహ్మమునందు యేమాత్రముగూడ వికల్పమునకు తావు లేదు—అని ముందర శ్లోకముచే చెప్పుచున్నాడు.

**అమృతాబ్ధేర్న మే జీర్ణిర్మృషాడిణ్డీరజన్మభిః ।**

**స్ఫటికాద్రేర్న మే రాగః స్వాప్నసన్ధ్యాభ్రవిభ్రమైః ॥౨౧ ॥**

**అన్వయః** :-అమృతాబ్ధేః మే మృషాడిణ్డీరజన్మభిః న జీర్ణిః (నహానిః నవృద్ధిః)స్ఫటికాద్రేః మే స్వాప్నసన్ధ్యాభ్రవిభ్రమైః న రాగః (రాగః న అస్తి) ॥౨౧ ॥

**అన్వయార్థము:**-అమృతాబ్ధేః=మోక్షరూపసముద్రమునగు; మే=నాయొక్క;మృషాడిణ్డీరజన్మభి:=జన్మాది మిథ్యా ఫేన తరం

గములచే; జీర్ణిః న=హాని లేదు;స్ఫటికాద్రేః=స్ఫటిక పర్వతరూప; మే=నాకు;(అత్యంత స్వచ్ఛమగు నాకు);స్వాప్నసంధ్యాభ్రవిభ్రమైః =అవిద్యాకల్పిత అహంకారాదులే సంధ్యాకాలిక మేఘములు - వాటిచే నాకు; రాగః=ఏవిధమైన సంబంధము; న= లేదు.

**టీకా:-**అమృతః=మోక్షరూపః స్వయంప్రకాశాద్వయానంద ఏవాబ్ధిస్తస్య,తత్పదలక్ష్యస్యేత్యర్థః।మే=మమ ప్రత్యగభిన్నబ్రహ్మణో మృషాడిణ్డీరజన్మభిః; మృషారూపా=మిథ్యారూపా వియదాదయ ఏవ డిణ్డీరాః=ఫేనాస్తేషాం యాని జన్మాని తైర్జన్మభిః। జన్మపదం నాశస్యాప్యుపలక్షణమ్। నజీర్ణిః=నహానిర్వృద్ధిర్వా।జీర్ణిపదం వృద్ధేర ప్యుపలక్షణం। మిథ్యావస్తునోఽధిష్ఠానాదూషకత్వాదిత్యర్థః।బ్రహ్మ ణి మాయయా వియదాద్యుత్పత్త్యా తదధిష్ఠానబ్రహ్మణో న హాని ర్నవృద్ధిరిత్యేతచ్ఛ్రీమద్భారతీతీర్థైరపి కూటస్థదీపేభణితమ్–**"మాయా మేఘో జగన్నీరంవర్షత్వేష యథా తథా। చిదాకాశస్య నో హానిర్న వా లాభ ఇతి స్థితిః॥"**(వే.పం.౮-౭౫)ఇతి।

స్వయంప్రకాశము,అద్వయము,ఆనందరూపమగు బ్రహ్మమే అబ్ధిః=సముద్రము. అట్టి తత్పదలక్ష్యమగు అమృతః=మోక్షరూప పరమాత్మచేనభిన్నమగు నాకు అవిద్యాకల్పిత మృషా డిణ్డీరములు అనగా ఆకాశాది పంచభూతములచేగాని, తత్కార్యమగు జన్మమరణాదులచేగాని-యేమి హానియు వృద్ధియునూ లేదు. కారణమేమనగా,మిథ్యాపదార్థముయొక్క గుణదోషములు అధిష్ఠానమును స్పృశింపజాలవు.''నహ్యుషరదేశం స్నేహేన పంకీకర్తుం శక్నోతి మరీచ్యుదకమ్''(గీతాభాష్యము ౧౩-౨).ఇది వేదాంత

సిద్ధాంతము మరియు అనుభవసిద్ధము.బ్రహ్మమునందు మాయాయోగముచే ఆకాశాది ప్రపంచముత్పన్నమగుటవలన, బ్రహ్మము వృద్ధిగాదు మరియు ప్రపంచ నాశనముచే బ్రహ్మము నాశనమును పొందదు.ఈ విషయమును శ్రీ భారతీతీర్థులవారు శ్రీవేదాంత పంచదశి కూటస్థదీపములో ఇట్లు చెప్పి యున్నారు.“మాయారూప మేఘము జగద్రూప జలమును ఎంతగానో వర్షించుచున్నది. కాని చైతన్యరూప ఆకాశమునకు దాని వలన ఏమియు హానిగాని,లాభముగాని లేదు”.ఈ విధముగా తత్పద లక్ష్యమగుబ్రహ్మము అత్యంతశుద్ధము, నిర్వికల్పము= నిర్వికారము - అని సిద్ధించినది.

త్వంపదలక్ష్యమపిశుద్ధమిత్యాహ–స్ఫటికాద్రేరిత్యాదినా।స్ఫటికాద్రేః=స్ఫటికాద్రివత్స్వచ్ఛస్య మే=మమ ప్రత్యగాత్మనస్త్వంపదలక్ష్యస్య,స్వాప్నసన్ధ్యాభ్రవిభ్రమైః-స్వాప్నః=అవిద్యాకల్పితోఽహంకారాదిః, స ఏవ సన్ధ్యాభ్రం=సంధ్యాకాలికమేఘః స్వసంనిహితే స్వచ్ఛేస్వధర్మాసఙ్కత్వసామ్యాత్;తత్కృతైర్విభ్రమైః-కర్తృత్వాదిభ్రాన్తిభిః,మేఘవిషయేవిభ్రమాః-అనవస్థానాని సంచారాః-తైః రాగః =సంబంధః మేఘవిషయ ఆరుణ్యమ్॥

అట్లే, త్వంపద లక్ష్యమగు ప్రత్యగాత్మగూడ శుద్ధమున్నదని చూపెడుతున్నాడు.స్వచ్ఛమగు స్ఫటికపర్వతమువలె అత్యంతశుద్ధమగు త్వంపదలక్ష్యమైన నాయందు స్వాప్నసంధ్యాభ్రవిభ్రమైః =స్వాప్న=అవిద్యాకల్పిత అహంకారాదులు, అవియే సాయంకాల మేఘములు,ఎందుకనగా-స్వసాన్నిధ్యములోనున్న వస్తువునం

దు తనయొక్కధర్మమును ఆరోపించుటలో మేఘముతో సమా నములు.కనుక,ఆ అహంకారాదులచే కలుగు విభ్రమైః=కర్తృత్వా ది భ్రాంతులచే నాకు యేవిధమైన రాగః=సంబంధము లేదు. ఇచ్చట మేఘపక్షములో వాటిలోని చాంచల్యమే విభ్రమత్వము, వాటిలోని ఆరుణ్యము=ఎరుపురంగు. మేఘములు వాటిలోని చాంచల్యమునుగాని, ఎరుపు రంగునుగాని స్వచ్ఛమగు స్ఫటిక పర్వతమునందు ఉత్పన్నము చేయజాలవు.

స్ఫటికపర్వతస్యారుణ్యవదాత్మనశ్చిద్రూపస్య పరమార్థతః కర్తృత్వభోక్తృత్వరాగద్వేషాదిసంబన్ధో నాస్తీత్యర్థః। అహంకారాది ధర్మైరాత్మనోఽసంబంధోఽప్యుక్తః శ్రీభారతీతీర్థైశ్చిత్రదీపే"**అహం కారగతేచ్ఛాద్యైర్దేహవ్యాధ్యాదిభిస్తథా।వృక్షాదిజన్మనాశైర్వాచిద్రూ పాత్మని కిం భవేత్**"(వే.పం.౬-౨౬౪)॥ఇతి। అతః పదద్వయలక్ష్య మపి చైతన్యమతిశుద్ధమితి భావః ॥౨౧ ॥

సన్నిధి బలముచే స్ఫటిక పర్వతము విచిత్రమైన రంగులచే అగుపించిననూ,దానియందు మేఘము తనయొక్క విచిత్రరం గులను ఉత్పన్నము చేయుటకు సమర్థముకాజాలదు.అట్లే, అవి ద్యాకల్పిత అహంకారాదులు మరియు తద్గత కర్తృత్వ భోక్తృత్వ రాగద్వేషాదుల అనుభవము ఆత్మయందు ప్రతీతమైనప్పటికిని, వాస్తవముగా-అహంకారము తన ధర్మములగు కర్తృత్వాదుల ను నిర్వికార ఆత్మయందు ఉత్పన్నము జేయుటకు సమర్థము గాదు.అహంకారాదులచే ఆత్మకు ఏమాత్రముగూడ సంబంధమే లేదు—అని శ్రీభారతీతీర్థులవారు ఇట్లు సెలవిచ్చియున్నారు.చి

త్స్వరూపుడైన ప్రత్యగాత్మయందు అహంకారగత కామాదులచే, కర్తృత్వాదులచే మరియు స్థూలదేహమందలి రోగాదులచే;అట్లే, ఆత్మకంటె అత్యంత భిన్నములగు వృక్షాదులయొక్క జన్మనాశ ములచే,స్ఫటికపర్వతమువలె శుద్ధమగు ప్రత్యగాత్మకు ఏమి హా నియు లాభమునూ లేదు. అందు వలన, తత్ మరియు త్వం పదములకు లక్ష్యమగు చైతన్యము అత్యంత శుద్ధమున్నదని భా వము ॥ ౨౧ ॥

**ఆత్మ సద్రూపము**

నన్వేవమపి పదద్వయలక్ష్యేబ్రహ్మణ్యస్త్యేవ వికారః,తస్య పర మార్థతః సత్త్వాశ్రయత్వస్య వక్తవ్యత్వాత్,అన్యథా శశవిషాణవద సత్త్వప్రసఙ్గాదిత్యాశఙ్క్యాహ —

అట్లైననూ,పదద్వయ లక్ష్యమగు బ్రహ్మము వికారియని చె ప్పవలసియున్నది.ఎందుకనగా!సత్త్వము=సత్యత్వమునకుబ్రహ్మ ము ఆశ్రయమున్నది.ఒకవేళ సత్యత్వధర్మరహితము బ్రహ్మమన్న చో,కుందేలు కొమ్మునకు వలె బ్రహ్మమునకు అసత్త్వము ప్రస క్తమగును.ఇట్టి శంకుకు సమాధానముగా తరువాత శ్లోకము ను చెప్పుచున్నాడు

**స్వరూపమేవ మే సత్త్వం న తు ధర్మో నభస్త్వవత్ ।**
**మదన్యస్య సతోఽభావాన్న హిసా జాతిరిష్యతే ॥ ౨౨ ॥**

**అన్వయః**:-సత్త్వమ్ మే స్వరూపమ్ఏవ నతుధర్మః మదన్య స్య సతఃఅభావాత్ సా జాతిః న ఇష్యతే నభస్త్వవత్ ఇతి ॥౨౨ ॥

**అన్వయార్థము:-**నభస్త్వవత్=ఆకాశత్వమువలె;సత్త్వం తు= సత్ అయితే;మే=నాయొక్క; స్వరూపమ్ ఏవ=స్వరూపమేయై ఉన్నది;ధర్మ: న=నా ధర్మము కాదు;మదన్యస్య=నా కంటె భిన్న మగు;సతః=సత్ యొక్క;అభావాత్=అభావమున్నందున;సా= అది;జాతిః=జాతియని;నహి ఇష్యతే=స్వీకరించబడదు.

**టీకా:-**మే=మమ పదద్వయలక్ష్యస్య సత్త్వం స్వరూపమేవ, నతు మదాశ్రితో ధర్మః। యథా సత్త్వస్య సత్త్వాన్తరాశ్రయత్వాభా వేఽపి నాసత్త్వం తద్వదిత్యర్థః । నను ఘటే ఘటత్వవత్సద్రూప ఆత్మన్యపి ధర్మరూపంసత్త్వం కిం నస్యాదిత్యాశఙ్క్య, ఘటేష్వనేకే షు 'ఘటోఽయంఘటోఽయం'ఇత్యనుగతవ్యహారసిద్ధయే ఘట త్వజాతిరివ సద్వ్యక్తిభేదాభావేన ఆత్మని సత్త్వరూపా జాతిర్నాఙ్గీ కార్యేత్యాహ–మదన్యస్యేత్యాదినా। మదన్యస్య=పదద్వయలక్ష్య రూపాత్మభిన్నస్య సతః=సద్వ్యక్త్యన్తరస్యాభావాత్సా సత్త్వరూపా జాతిర్నేష్యతే।

పదద్వయలక్ష్యమగు నాకు సత్త్వము స్వరూపమయ్యే ఉం ది.కాని, నేను సత్త్వధర్మమునకు ఆశ్రయము కాదు. అందువల్ల, నాకు కుందేలుకొమ్మువలె అసత్త్వాపత్తి రాదు.తార్కికులు ద్రవ్య గుణ కర్మలయందు సత్తా=సామాన్యమును స్వీకరించారు. దా నినే పరసామాన్యము లేక పరజాతి అంటారు.దానికి "నిత్యత్వే సత్యనేక సమవేతత్వమ్ సామాన్యమ్"అని లక్షణము చెప్పినా రు. అనేక ఘటరూప వ్యక్తులందు "ఇది ఘటమున్నది, ఇది ఘటమున్నది"అను అనుగత వ్యవహారసిద్ధికై,సర్వఘటములలో

ఘటత్వ  జాతిని అంగీకరించినారు.ఆ సత్తారూప జాతియందు మరొక సత్త్వ ధర్మమును అంగీకరించరు. అందుకని,సత్తా=సామాన్యము అసత్తు కానేరదని చెప్పుదురు.ఎట్లు తార్కికులు సత్త్వము సత్త్వాంతరమునకు ఆశ్రయము కాకున్ననూ, సత్త్వమునకు అసత్త్వ ప్రసక్తి రాదని స్వీకరింతురో,అట్లే,స్వయముగా సద్రూపుడనగు నేను  సత్త్వాంతరమునకుఆశ్రయము కాకున్ననూ, నాకు అసత్త్వదోష ప్రసక్తి రాదు.

శంక:- ఎట్లు ఘటమునందు ఘటత్వరూప ధర్మము=జాతి ఉంటుందో,అట్లే,సద్రూప ఆత్మయందు ఒక సత్త్వరూప  ధర్మమును స్వీకరించినచో ఆపత్తి యేమిటి?

సమాధానము:-అనేక ఘటములందు "ఇది ఘటమున్నది, ఇది ఘటమున్నది"అను  నీప్రకారమగు అనుగత వ్యవహార సిద్ధికై,సకలఘటములలో ఘటత్వజాతిని అంగీకరించుట యుక్తమే. కాని, సద్రూప ఆత్మ ఏకము గావున=అనేకము లేనందున, పదద్వయలక్ష్యరూపఆత్మయందు ద్వైతముయొక్క అభావమున్నందున, సత్త్వరూప జాతిని స్వీకరించవలసిన అవసరము లేదు.

ఏకవ్యక్తౌజాత్యనఙ్గీకారే దృష్టాన్తమాహ-నభస్త్వవదితి। ఘటేష్వనేకేష్వనుగతవ్యవహారార్థంహి ఘటత్వంజాతిరఙ్గీక్రియతే। అ-త్రతు వియధాదేఃసర్వస్యమిథ్యాత్వేన సదన్తరస్యాభావాన్నానుగత వ్యవహారార్థం ఘటత్వవజ్జాతిరూపం సత్త్వమఙ్గీక్రియతే,  కిం తు స్వరూపమేవ నభస్త్వవత్।

ఏక వ్యక్తియందు మీరు తార్కికులుగూడ జాతిని స్వీకరించరు గదా!శ్రీ ఉదయనాచార్యులు వారి 'కిరణావళి' గ్రంథములో ఇట్లు చెప్పియున్నారు —

వ్యక్తేరభేదస్తుల్యత్వం సంకరోఽథానవస్థితి: ।

రూపహానిరసంబంధో జాతి బాధక సంగ్రహః ॥

యదాశ్రయీభూత వ్యక్తిరేకా తస్య న జాతిత్వమ్-యథా ఆకాశమ్.ఆకాశములు అనేకములు లేవు, ఏకమున్నది. కావున, ఆకాశత్వము జాతిగా పరిగణించబడదు. అట్లే, అనేక ఆత్మలు వేదాంత సిద్ధాంతములో స్వీకార్యములేదు.ఆత్మభిన్న ఆకాశాదులు సకలము అధ్యస్తములు గావున,ఆత్మభిన్న సత్త్వాంతరాభావముచే,అనేక ఘటవ్యక్తులలో "ఘటోఽయం ఘటోఽయం"అను అనుగత వ్యవహారార్థము ఘటత్వమును తార్కికులు అంగీకరించినట్లు, మేము సద్రూప ఆత్మయందు జాతిరూప సత్త్వమును స్వీకరించకుండా, నభస్త్వవత్=ఆకాశత్వమువలె సత్త్వమును స్వరూపముగానే అంగీకరింతుము.

నను'ఘటఃసన్ పటఃసన్ కుడ్యం సదిత్యాదిప్రతీత్యనురోధేన ఘటపటాద్యుపాధిభిన్నేషు సత్స్వనుగతవ్యవహారాయ సత్వం జాతిరఙ్గీక్రియతామితి చేత్; న, ఘటాద్యుపహితేషు సర్వేష్వనుగతబ్రహ్మరూప సన్మాత్రేణైవ ఘటాద్యుపాధిభిన్నేష్వాకాశేష్వనుగతమహాకాశేనేవానుగతవ్యవహారోపపత్తేః। తస్మాన్న సత్త్వం జాతిః। అత ఏవ నోపాధిరపి, అనుగతవ్యవహారాయైవ తస్యాపి

కల్పితత్వాత్।సత్త్వస్య సన్మాత్రబ్రహ్మరూపత్వం వసిష్ఠేనాప్యుక్తమ్–
**"విశేషంసంపరిత్యజ్య సన్మాత్రంయదలేపకమ్।ఏకరూపం మహా రూపం సత్తాయాస్తత్పరంవిదుః"**(యో.వా.౫-౬౧-౧౦౨)॥ ఇతి ॥ తథాచ సత్త్వస్య స్వరూపత్వేన ధర్మత్వాభావాదత్యన్తం శుద్ధమేవ పదద్వయలక్ష్యమితి భావః ॥ ౨౨ ॥

శంక:-ఘటము ఉన్నది, పటము ఉన్నది, కుడ్యము ఉన్నది ఇత్యాది"ఉన్నది,ఉన్నది"అను ప్రతీతి అనురోధముచే ఘటాద్యు పాధులకంటె భిన్నముగా సర్వత్ర"ఉన్నది,ఉన్నది"అను అనుగత వ్యవహారము కొఱకు సత్త్వరూప జాతిని స్వీకరించవచ్చును గదా!

సమాధానము:-ఘటపటాధ్యుపాధులకంటె భిన్నముగా ఉ పహిత ఆకాశములలో ఒకే మహాకాశము అనుగతమై ఉన్నది. దానియందు జాతిని స్వీకరించకున్ననూ అనుగత వ్యవహారము జరుగునట్లు-సకల ఉపహితవస్తువులలో అనుగత ఒకే సన్మాత్ర బ్రహ్మరూపముచేతనే అనుగతవ్యవహారము సిద్ధిస్తుంది. అందు వల్ల,సత్త్వము జాతి గాదు.సకలోపాధులు కల్పితములు. అధ్యస్త వస్తువునకు అధిష్ఠానసత్తాతిరిక్త సత్త ఉండదు.గావున ఉపహిత సన్మాత్ర బ్రహ్మముచేతనే అనుగత వ్యవహారము ఉపపన్నమగు చ్నది.సత్త్వము సన్మాత బ్రహ్మస్వరూపమే అంటూ శ్రీ వసిష్ఠము నీంద్రులవారు గూడ చెప్పియున్నారు.స్థూలసూక్ష్మాది సర్వవిశేష భావములనుపరిత్యజించినచో అసంగ,సన్మాత్రము అవశిష్టమై యుండును.అదియే ఏకరస వ్యాపక పరబ్రహ్మమై యున్నది.

పై సమగ్ర పర్యాలోచనచే సత్త్వము బ్రహ్మస్వరూపమున్నది. బ్రహ్మాశ్రిత ధర్మముగాదు.కావున,పదద్వయలక్ష్యమగు బ్రహ్మము అత్యంత శుద్ధమున్నదని భావము ॥ ౨౨ ॥

**ఆత్మ చిద్రూపము**

నన్వేవమప్యాత్మనో జ్ఞానాశ్రయత్వమఙ్గీకర్తవ్యమ్, అన్యథా ఘటాదివదనాత్మత్వప్రసఙ్గాత్,జ్ఞానాశ్రయస్యైవాత్మత్వాత్,అహం జానామి ఇత్యాత్మనో జ్ఞానాశ్రయత్వప్రతీతేశ్చ;తథా చ న "సాక్షీ చేతాకేవలోనిర్గుణశ్చ"(శ్వే.౬-౧౧)ఇత్యాదిశ్రుత్యా నిర్గుణబ్రహ్మత్వ మాత్మన ఇత్యత ఆహ —

శంక:-ఆత్మ సత్స్వరూపమున్నపటికినిజ్ఞానస్వరూపము మాత్రముకాదు.మరేమనగా,'జ్ఞానాధికరణమాత్మా'జ్ఞానమునకు ఆత్మ ఆశ్రయమున్నది. ఘటాదులు జ్ఞానమునకు ఆశ్రయములు కావు.అందువలన,అవి జడములని ప్రసిద్ధములు.ఒకవేళ ఆత్మ గూడ జ్ఞానమునకు ఆశ్రయము కాదనిన ఘటాదులవలె అనాత్మత్వము,జడత్వము ప్రసక్తమగును.ఏది జ్ఞానమునకు ఆశ్రయమో అదియే ఆత్మయనబడును."అహం జానామి"నేను తెలియుదును.ఈవిధముగా ఆత్మయొక్క జ్ఞానాశ్రయత్వము అనుభవసిద్ధమున్నది.అందువలన,"సాక్షీ చేతాః కేవలో నిరుణశ్చ"(శ్వే.౬-౧) అని బ్రహ్మమునకు శ్రుతిచే ప్రతిపాదించబడిన నిర్గుణత్వము ఆత్మయందు వర్తించుటలేదు.ఎందుకనగా,ఆత్మ జ్ఞానగుణమునకు ఆశ్రయమున్నది. బ్రహ్మము నిర్గుణమున్నది. కావున, ఆత్మకు

బ్రహ్మాత్వము సిద్ధించుటలేదు.ఇట్టి శంకకు సమాధానముగా ఈ క్రింది శ్లోకమును ప్రవృత్తము చేయుచున్నాడు.

**స్వరూపమేవ మే జ్ఞానం న గుణః స గుణో యది ।**

**అనాత్మత్వమసత్త్వం వా జ్ఞేయాజ్ఞేయత్వయోః పతేత్ ॥౨౩॥**

**అన్వయః:**–మే జ్ఞానం స్వరూపం ఏవ న(తు) గుణః,యది స గుణః తర్హి అనాత్మత్వం,అసత్త్వం, జ్ఞేయాజ్ఞేయత్వయోః పతేత్ (భవేత్) ఇత్యర్థః॥

**అన్వయార్థము:**-జ్ఞానమ్=జ్ఞానమైతే;మే=నాయొక్క;స్వరూపమ్ఏవ=స్వరూపమే ఉన్నది;గుణఃన=గుణము కాదు;స యది గుణః=అదిఒకవేళ గుణమేయగుచో;జ్ఞేయాజ్ఞేయత్వయోః=ఆత్మకు జేయత్వము అనగా జ్ఞానమునకు విషయమగుట; అజ్ఞేయత్వము అనగా జ్ఞానముచే తెలియబడకుండుట అనునవి స్వీకరించినచో;అనాత్మత్వమ్=ఆత్మకు అనాత్మత్వము;అసత్త్వం వా=లేక అసత్త్వము;పతేత్=ప్రాప్తమగును.

**టీకా:**-మే=మమ, జ్ఞానం=చైతన్యం, స్వరూపమేవ న తు మదాశ్రితో గుణః। కుతఇత్యత ఆహ–సగుణో యదీత్యాదినా। స =చైతన్యమ్। విధేయాపేక్షయా పుంలిఙ్గనిర్దేశః । చైతన్యం గుణ ఇతి వదన్వాదీ ప్రష్టవ్యః,కిం తేన చైతన్యేనాత్మా విషయీక్రియతే నవా?

జ్ఞానము అనగా చైతన్యము నాయొక్క స్వరూపమే ఉన్నది. నన్నాశ్రయించుకొని ఉన్న గుణము గాదు, నేను జ్ఞానమునకు

ఆశ్రయము కాదు.జ్ఞానమును గుణము అని చెప్పు తార్కికుడిని ఇట్లు అడుగవలెను.ఏమి,ఆ జ్ఞానగుణముచే అనగా చైతన్యము ద్వారా ఆత్మ తెలియబడుతుంది అంటావా? లేక తెలియబడదు అంటావా?

ఇచ్చట శ్లోకంలో'స గుణో యది'-అనుచోట 'సః'-సర్వనామ తత్ శబ్ద పుల్లింగ ఏకవచనము, చైతన్యమ్-అను నపుంసక లింగ శబ్ద వాచ్యమగు 'ఆత్మ' వివక్షలో ప్రయోగించబడినది.

ఉభయథాపి దూషణమాహ–అనాత్మత్వమితి। జ్ఞేయాజ్ఞేయ త్వయోః,ఆత్మనో వేద్యత్వేచానాత్మత్వం ఘటాదివత్, అవేద్యత్వే చాసత్త్వంవా శశవిషాణవదాపతేత్–భవేదిత్యర్థః। యద్యాత్మనః స్వసమవేతజ్ఞానావిషయత్వముచ్యతే తదాఽజ్ఞాయమానత్వేనా-త్మనోఽసత్త్వంస్యాత్।నహి ప్రమాణతోఽజ్ఞాయమానం శశవిషాణమస్తీతి కేనచిత్ప్రతిపద్యతే। యద్యేతద్దోష పరిజిహీర్షయా తస్య జ్ఞాయమానత్వముచ్యేత తదా ఘటాదివదనాత్మత్వమాత్మనః స్యాత్,జ్ఞానవిషయస్యానాత్మత్వనియమాత్।

పైరెండు వికల్పములలోగూడ దోషమును చూపెడుతున్నాడు.ఒకవేళ ఆత్మ, చైతన్యమునకు అనగా జ్ఞానమునకు విషయము=జ్ఞేయము అని స్వీకరించినచో, ఆత్మకు ఘటాదులవలె జడత్వము,అనాత్మత్వము ప్రాప్తించును.లేక అజ్ఞేయము అని ఒప్పినచో శశశృంగాదులవలె అసత్త్వము ప్రాప్తించును. తాత్పర్యమేమనగా,ఒకవేళ ఆత్మయందు సమవాయసంబంధముచేనుం

డు జ్ఞానగుణముచే ఆత్మ తెలియబడదు-అనిచెప్పినచో, తెలియబడనందువలన ఆత్మ శశశృంగాదులవలె అసత్తగును. ప్రమాణ అగమ్యమగు శశవిషాణాదుల ఉనికిని ఎంతటి ప్రబుద్ధుడైనను ఒప్పకొనడు గదా! ఈ దోషపరిహారము చేయగోరి ఆత్మ, జ్ఞాన గుణముచే తెలియబడునన్నచో,ఘటాదులకువలె అనాత్మత్వము ప్రసక్తమగును.ఏది జ్ఞానమునకువిషయమో అది నియమముచే జడము మరియు అనాత్మయే యగును.

నన్వాత్మాశ్రితజ్ఞానేనాత్మాఽఽశ్రయత్వేనభాసతే, న విషయత్వేన, యేన ఘటాదివదనాత్మత్వం స్యాదితి చేత్,

శంక:-ఆత్మ, తన్నాశ్రయించి ఉన్న జ్ఞానగుణముద్వారా ఆశ్రయత్వరూపముచే తెలియబడును. అనగా-ఆత్మ తనకు ఆశ్రయమున్నది-అని యీ విధముగా జ్ఞానము-ఆత్మను తెలియజేయును.విషయత్వరూపముచే భాసించినచో ఆత్మకు అనాత్మత్వము ప్రాప్తించును. కాని, అట్లు మేము చెప్పుట లేదు.

న, జ్ఞానవ్యతిరిక్తస్య జ్ఞానాధీనప్రకాశస్య జ్ఞానవిషయత్వనియమేనాత్మనోఽపి జ్ఞానాధీనప్రకాశస్య విషయతాయా ఆవశ్యకత్వేనానాత్మత్వదోషతాదవస్థ్యాత్। నచ జ్ఞానాశ్రయత్వమాత్మత్వే ప్రయోజకమ్।లాఘవాజ్జ్ఞానత్వస్యైవ తత్ప్రయోజకత్వాత్,'అహం జానామి' ఇతి ప్రతీతేశ్చాహంకారాశ్రయవృత్తివిషయత్వాత్। న చ 'జ్ఞానంనష్టమ్,జ్ఞానముత్పన్నమ్'ఇతిప్రతీత్యా తస్య జన్మాదిమత ఆత్మత్వమనుపపన్నమితివాచ్యమ్,తస్యాఅపి వృత్తివిషయకత్వాత్

। తస్మాదాత్మనో న జ్ఞానం గుణః కిం తు స్వరూపమేవ॥

సమాధానము:-ఏది జ్ఞానముకంటె భిన్నమైయుండి, జ్ఞానాధీన ప్రకాశముగలదై యుండునో,దానికి జ్ఞాన విషయత్వముండునను నియమమున్నది. ఏరీతిచేనైనను=ఆశ్రయత్వముచేనైనను, విషయత్వముచేనైనను—ఆత్మకు జ్ఞానాధీన ప్రకాశకత్వము స్వీకరించినచో అనాత్మత్వదోషము తాదవస్థ్యము=సుస్థిరము. ఆత్మత్వసిద్ధికి జ్ఞానాశ్రయత్వము హేతువుకాదు.కనుక,'జ్ఞానస్వరూపము ఆత్మ'యని స్వీకరించుటయే శ్రేయస్కరము. 'అహం జానామి'యను ప్రతీతి యేదిగలదో, అది ఆపాత దృష్టిమాత్రమే. "పాతమజ్ఞానధ్వంసంమర్యాదీకృత్యేత్యాపాతం,తస్మాదర్వాగ్దృష్టిః చిత్తవృత్తిః=ఆపాతదృష్టిః"అజ్ఞాన ధ్వంసమువరకుండు చిత్తవృత్తియే ఆపాతదృష్టి అనగా యథార్థము తెలియనంతవరకు ఆపాత దృష్టి=జ్ఞానాశ్రయము ఆత్మ- అను వ్యవహారము. వాస్తవముగా 'అహంజానామి'యను ప్రతీతి యేదిగలదో,అది అహంకారాశ్రిత వృత్తి విషయమున్నది."అంతఃకరణ వృత్తౌ జ్ఞానత్వోపచారాత్" అని పంచపాదికా వివరణములో ప్రకాశాత్మ శ్రీచరణముని చెప్పినట్లుగా ఔపచారికముగా అంతఃకరణవృత్తికే 'జ్ఞానము' అని వ్యవహారము జరుగుచున్నది.వాస్తవముకాదు. అంతఃకరణమునకు, తద్వృత్తులకు సాక్షియగు ఆత్మ, నిత్యజ్ఞానస్వరూపమున్నది.

శంక:-"జ్ఞానముత్పన్నమ్, జ్ఞానం నష్టమ్"అను ప్రతీతిచే-

ఉత్పత్తివినాశములు పొందు జ్ఞానమునకు ఆత్మత్వమెట్లు ఘటించును.

సమాధానము:-"జ్ఞానముత్పన్నమ్, జ్ఞానం నష్టమ్" అను ప్రతీతిగూడ వృత్తి విషయకమే ఉంది. కావున, దోషమేమియు లేదు.వృత్తి ఉత్పన్నమైనచో జ్ఞానముత్పన్నమైనదని, వృత్తి నష్టమైతే జ్ఞానము నష్టమైనదని ఔపచారిక వ్యవహారము జరుగుచున్నది. వాస్తవము గాదు. "నహి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతేऽవినాశిత్వాత్"(బృ.౪-3-30);"ప్రజ్ఞానఘన ఏవాయం"(నృసింహో.౮-౫)ఇత్యాది శ్రుతులచే ఆత్మ నిత్యజ్ఞానస్వరూపము మరియు స్వయంప్రకాశ స్వరూపమున్నదని తెలియబడుచున్నది. "అనధీన భాసమానత్వం స్వయంప్రకాశత్వమ్"జ్ఞానము దేనిని ఆశ్రయించుకొనిగాని,దేనిని అపేక్షించిగాని కాకుండా, స్వయముగా ప్రకాశించునది.కావున,జ్ఞానము ఆత్మసమవేత గుణము గాదు. మరేమనగా, ఆత్మస్వరూపమే.

బాదరాయణోऽపి"**జ్ఞోऽతఏవ**"(బ్ర.సూ.౨-3-౧౮)ఇత్యాత్మనో జ్ఞానరూపత్వం సూత్రయాంబభూవ। సూత్రార్థో శ్రీమద్విద్యారణ్యగురుభిరధికరణరత్నమాలాయాందర్శితః–"**అచిద్రూపోऽథ చిద్రూపో జీవోऽచిద్రూపఇష్యతే।చిదభావాత్సుషుప్త్యాదౌ జాగ్రచ్ఛిన్మనసాకృతా**"॥ఇతిపూర్వపక్షేప్రాప్తే, సిద్ధాన్తమాహ–"**బ్రహ్మత్వాదేవ చిద్రూపశ్చిత్సుషుప్తౌ నలుప్యతే। ద్వైతాదృష్టిర్ద్వైతలోపాన్న హి ద్రష్టురితి శ్రుతేః**"॥ ఇతి॥

శ్రీ బాదరాయణాచార్యులు=శ్రీవ్యాస భగవానులుగూడ బ్రహ్మసూత్రములలో ఆత్మయొక్క జ్ఞానస్వరూపత్వమును సూత్రీకరించారు.''జ్ఞోఽత ఏవ''(బ్ర.సూ.౨-౩-౧౮). ఈ సూత్రార్థమును శ్రీవిద్యారణ్య గురుదేవులు వైయాసిక న్యాయమాల=అధికరణ రత్నమాలలో ఈ క్రింది. విధముగా ప్రదర్శించారు.

శంక:- ఆత్మ చేతనమా? లేక అచేతనమా?

పూర్వపక్షము:-అచేతనమే.ఎందుకనగా,సుషుప్త్యాద్యవస్థలలో చైతన్యముయొక్క అభావము అనుభవసిద్ధమున్నది.జాగ్రత్తులో యే చేతనత్వ ప్రతీతియగుచున్నదో,అది అగ్ని మరియు ఘట సంయోగముచే ఘటమునందు రక్తవర్ణము=గుణముత్పన్నమైనట్లు,ఆత్మ మరియు మనస్సుల సంయోగముచే,ఆత్మయందు జ్ఞానగుణముత్పన్నమై ప్రతీతమగుచున్నది.

ఇట్లు పూర్వపక్షము ప్రాప్తించగా:-సిద్ధాంతము చెప్పబడుచున్నది.''ఆత్మా చ బ్రహ్మ''ఆత్మ బ్రహ్మరూపమే గాన చిద్రూపమున్నది.సుషుప్తిలో చేతనము నశించుటలేదు.అచ్చట,ద్వైతప్రపంచముయొక్క అదర్శనమువలన చేతనముయొక్క అభావభ్రాంతి కలుగుచున్నది.వాస్తవముగా చైతన్యముయొక్క లోపము లేదు. ''నహిద్రష్టుఃదృష్టేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్''(బృ.౪-౩-౨౩) ఆత్మయొక్క స్వరూపభూత దృష్టి=జ్ఞానము ఎప్పుడునూ లోపించదు. అవినాశి ఉన్నందువలన.

నను జ్ఞానరూప ఆత్మా స్వాత్మానం జానాతి న వా?

జానాతి చేద్యుగపత్కర్మకర్తృత్వప్రసఙ్గః, న చేజ్జానాతి తస్యాసత్త్వ ప్రసఙ్గ ఇతి చేత్ —

శంకః-సరే,జ్ఞానస్వరూప ఆత్మ తననుతాను తెలిసికుంటుం దా? లేదా? తెలిసికొనునన్నచో-ఏకకాలములో తెలిసికొను జ్ఞానకర్తయు తానే మరియు తెలియబడు జ్ఞానకర్మయు (జ్ఞాన మునకు విషయము)తానే—యను కర్మకర్తృవిరోధము ప్రసక్తమ గును.గ్రామమునకు వెళ్ళు గమనకర్త=గన్తా మరియు గమనక్రి యకు విషయము=కర్మ-గమ్యమగు గ్రామము-ఒక్కడే యనిన విరోధము గదా! ఒకవేళ తనను తాను ప్రకాశించడు - అనిన ఆత్మకు అసత్వ ప్రసంగము ప్రాప్తించును.

న తస్య స్వప్రకాశత్వేన జ్ఞానాన్తరమనపేక్ష్యైవ భాసమాన త్వాత్। నాపి తస్య కర్మకర్తృత్వమ్,స్వవిషయత్వస్యానఙ్గీకారాత్। తదుక్తం విద్యారణ్యగురుభిః పఞ్చకోశవివేకే–"**స్వయమేవాను భూతిత్వాద్విద్యతేనానుభావ్యతా। జ్ఞాతృజ్ఞానాన్తరాభావాదజ్ఞేయో నత్వసత్తయా**"(వే.పం.3-౧3)॥ఇతి॥యత్ప్రసాదాద్ధి సర్వం జగద్భాస తే స కథం నాస్తి న ప్రకాశతే వా?

ఈశంక ఉచితము గాదు.ఎందుకనగా,అన్యజ్ఞానముయొ క్క అపేక్ష లేకయే స్వయముగానే ప్రకాశించును గావున, ఆత్మ స్వయంప్రకాశస్వరూపమున్నది. మరియు కర్మకర్తృవిరోధము గూడ లేదు.ఎందుకంటే-ఆత్మ,తన జ్ఞానమునకు తాను విషయ ముగాదు.స్వవిషయత్వమును మేము స్వీకరించుట లేదు. ఆత్మ

యొక్క స్వయంప్రకాశత్వమును శ్రీవిద్యారణ్యగురుదేవులు శ్రీ వేదాంత పంచదశి పంచకోశవివేకములో ఇట్లు సెలవిచ్చియున్నారు.

ఆత్మ స్వయముగా అనుభవస్వరూపమున్నది,గావున విద్యమానముండియు అనుభవమునకు విషయముగాదు.ఆత్మకంటె భిన్నమగు జ్ఞాత మరియు జ్ఞానముయొక్క అభావమున్నందున -ఆత్మ అజ్ఞేయమున్నది.అసద్రూపమున్నందున1అజ్ఞేయముగాదు.

చిద్రూపత్వాదకర్మత్వాత్ స్వయం జ్యోతిరితి శ్రుతేః ॥

ఆత్మనఃస్వప్రకాశత్వంకోనివారయితుంక్షమః॥ (చిత్సుఖీ-౧-3)

మాసాబ్ధయుగ కల్పేషు గతాగమ్యేష్వనేకదా ।

నోదేతి నాస్తమేత్యేకా సంవిదేషా స్వయం ప్రభా॥(వేపం. 1-౭)

ప్రమాతా చ ప్రమాణం చ ప్రమేయో, నిశ్చితిస్తదా ।

యత్సాన్నిధ్యాత్సిధ్యన్తి తత్సిద్ధౌ కిమపేక్షతే ॥(బృ.భాష్యవార్తికము

---

1 అజ్ఞేయము=జ్ఞానమునకు అవిషయమగు వస్తువు మూడు విధములు. ౧.అసద్వస్తువు(వంధ్యాసుతాదులు).౨.కదాచిత్ వృత్తిసంబంధరహితవస్తువుగాని లేక అజ్ఞానముతో సంబంధముగల వస్తువుగాని ఉండును.ఉదా:-ఘటాదులు. 3.స్వప్రకాశ వస్తువు.వీటిలో,ఆత్మ అసద్వస్తువుగాదు,కదాచిద్వృత్తి సంబంధరహితము గాని,అజ్ఞానముతోసంబంధము గలది గాని కాదు.మరేమనగా, సద్రూపమై, సర్వదావృత్తిగలదై మరియు అజ్ఞానముతో వాస్తవసంబంధరహితమై ఉన్నది. అందువలన,వంధ్యాపుత్రాదులవలె మరియు ఘటాదులవలె అజ్ఞేయముగాదు,మరేమనగా,స్వయంప్రకాశస్వరూపమున్నందువలనఅజ్ఞేయమున్నది.(శ్రీపండిత పీతాంబరజీ హిందీ వేదాంత పంచదశి 3-౧3 టిప్పణము)

౧-౪-౮౭౦)ఎవరియొక్క ప్రసాదమువలన సంపూర్ణ జగత్తు ప్రకాశింపబడుచున్నదో,అట్టి స్వయంప్రకాశరూప ఆత్మ, లేదని గాని, ప్రకాశరూపము కాదని గాని యెట్లు చెప్పగలవు?

ఆత్మనఃసర్వావభాసకత్వం స్వస్యాన్యానపేక్షతయా భాసమానత్వం చ ఆత్మయోగవింశే(ఆత్మయోగేచిదంశే)ఽప్యుక్తమ్ **"అజ్ఞానతత్కార్యతదీయభేదానధ్యక్షయన్తీ నిజసత్తయైవ। స్మర్తుం చ విస్మర్తుమహో న శక్యా సుప్త్యాదిషు స్వప్రభయాస్తి సా చిత్"**॥ ఇతి ॥ తస్మాదాత్మా జ్ఞానస్వరూపో న జ్ఞానగుణక ఇతి స నిర్గుణం బ్రహ్మ భవేదితి భావః ॥౨౩ ॥

ఆత్మయొక్క సర్వావభాసకత్వము మరియు జ్ఞానాంతరానపేక్ష భాసమానత్వము 'ఆత్మయోగవంశము'లో శ్రీ సర్వజ్ఞాత్మ మునీంద్రులవారిచే ఇట్లు చెప్పబడినది. అజ్ఞాన తత్కార్యమగు జగత్తు మరియు జగదంతర్గత సకలభేదములను,యే చైతన్యము స్వసత్తా మాత్రముచే ప్రకాశించుచున్నదో,అట్టి చైతన్యమునకు స్మరణము,విస్మరణములు యెట్లుండును?సంభవము లేదు.ఎందుకనగా,సుషుప్త్యాది అవస్థలలోగూడ సహజస్వభావముచే ప్రకాశించుచున్నది,అట్టి చైతన్యమునే నేనున్నాను. తాత్పర్యమేమనగా,తనకు తన స్మరణముగాని విస్మరణముగాని ఉండదు.ఎందుకనగా,స్మృతివిస్మృతులకంటె వ్యతిరిక్తము, మరియు నిత్యజ్ఞానస్వరూపమున్నది.ఇది సర్వలోకప్రసిద్ధము.ఎట్లనగా —

"నహ్యాత్మన్యహమనహం వేతి కశ్చిత్సందిగ్ధే, నైవాహమితి

వా విపర్యస్యతి''ఆత్మయందు అనగా తనయందు యెవరికి గూడ ''నేను నేనేనా కాదా?'' అను సందేహముగాని, ''నేను కానే కాదు''అను విపరీతభావనగానిఉండదు.ఈ సంశయాది రాహిత్య అనుభవమేది గలదో, ఇది-ఆత్మ, స్వప్రకాశ జ్ఞానరూపము కానిచే సంభవించదు.('తత్త్వప్రదీపిక'లో శ్రీ చిత్సుఖమునీంద్రులవారు ౧-౩ వ శ్లోక వ్యాఖ్యానములో తెలిపియున్నారు).

అందువలన, జ్ఞానము ఆత్మయొక్క స్వరూపమే. గుణము కాదు. కావున, ఆత్మ నిర్గుణబ్రహ్మమే యని భావము ॥ ౨౩ ॥

**ఆత్మ ఆనందరూపము**

ఏవమాత్మన ఆనన్దోఽపి న గుణః కిం తు స్వరూపమేవేతి సాధయతి —

అదేరీతిగా ఆనందము కూడా ఆత్మయొక్క గుణము కాదు. ఆత్మయొక్క స్వరూపమేయని తరువాతి శ్లోకము ద్వారా చెప్పచున్నాడు.

**అహమేవ సుఖం నాన్యదన్యచ్చే న్నైవ తత్సుఖమ్ ।**

**అమదర్థం నహి ప్రేయో మదర్థం న స్వతః ప్రియమ్ ॥౨౪ ॥**

**అన్వయః**:-అహమ్ఏవ సుఖమ్ (సుఖస్వరూపమ్ ఏవ)న అన్యత్(నతుసుఖగుణకః)(యది)అన్యచ్చేత్ (గుణఃస్యాత్ తర్హి)తత్ నైవ సుఖమ్ అమదర్థమ్ (చేత్ తర్హి) న తత్ ప్రేయో, మదర్థమ్ (చేత్ తర్హి) స్వతః ప్రియమ్ న స్యాత్ ॥౨౪ ॥

**అన్వయార్థము:-**అహమ్ఏవ=నేనే;సుఖమ్=సుఖస్వరూపు డను;అన్యత్ న=సుఖగుణము గలవాడను కాను;అన్యత్ చేత్= ఒకవేళ సుఖము ఆత్మకంటె భిన్నమగుచో; తత్ సుఖమ్ ఏవ న=అది సుఖమేకాదు;హి=ఎందుకనగా?అమదర్థమ్=ఏది ఆత్మ కొఱకై ఉండదో;ప్రేయః న=అది ప్రేమాస్పదమై యుండదు;మ రియు,మదర్థమ్=ఏది నా(ఆత్మ)కొఱకై యుండునో, అదిగూడ; స్వతః ప్రియమ్ న= స్వయముగా ప్రియముండదు.

**టీకా:-**అహమాత్మా సుఖమేవ సుఖస్వరూప ఏవ । న తు సుఖగుణకః। యది సుఖమాత్మనోఽన్యద్గుణఃస్యాత్,తత్సుఖత్వే-నాభిమతం నైవ సుఖంస్యాత్। కుత ఇతిచేత్,కిం తదనాత్మభూత సుఖమనాత్మశేషః,ఉతతచ్ఛేషోవా?నాద్యఇత్యాహ–అమదర్థమి తి। చేదిత్యనుషఙ్గః। ఆత్మశేషో న చేత్తర్హి న తత్ప్రేయః ప్రీతివిష-యో న భవేత్, అనాత్మశేషసర్పాదౌ ప్రీతివిషయత్వాదర్శనాత్ ।

ఆత్మ అనగా నేను సుఖస్వరూపుడనై యున్నాను. సుఖగుణ ము గలవాడను కాను.కొందరు సుఖమును అత్మకంటె భిన్న ముగ,ఆత్మయొక్క గుణమని చెబుతారు.కాని,యేది ఆత్మభిన్న ముండునో,అది సుఖమే కాదని మేము చెబుతున్నాము. సుఖ ము ఆత్మయొక్క గుణము ఎందుకు కాదు?అని యిట్లు యెవరై న ప్రశ్నించినచో,అతనిని యిట్లు అడుగవలెను. ఏమి, యే సుఖ మును నీవు ఆత్మ కంటె భిన్న గుణమని చెబుతున్నావో,ఆ అనా త్మభూత సుఖము అనాత్మశేషమా?లేక ఆత్మశేషమా? శేషము అనగా,సాధనము,ఉపకారకము,అంగము అని పర్యాయముగా

చెప్పుదురు.అమదర్థమ్ అను శబ్దమునకు'చేత్'అని జోడించుకొ నవలెను.అనాత్మశేషమనిన, అది ప్రీతికి విషయము కానేకాదు. ఎందుకనగా,అనాత్మశేషమగు సర్పాదులు ప్రీతికి విషయములు గా కనిపించుటలేదు.అనగా,యే పదార్థమునందు,యే రీతిచేనై ననూ ఆత్మత్వబుద్ధి ఉండదో, ఆ అనాత్మభూత పదార్థములగు వ్యాఘ్రసర్పాదులలో ఎప్పుడునూ ప్రీతి గోచరించుట లేదు. ఇది అనుభవసిద్ధమున్నది.

న ద్వితీయ ఇత్యాహ–మదర్థమితి। అత్రాపిచేదిత్యనుషజ్యతే । మదర్థమాత్మశేషశ్చేత్స్వతః ప్రియం న స్యాత్, ఆత్మశేషస్య పుత్ర భార్యాదేః స్వతః ప్రీతివిషయత్వాదర్శనాదిత్యర్థః।సుఖంహి సర్వే-షాం ప్రియం భవతి; తచ్చ స్వత ఏవ ప్రియం, న పరోపాధినా; అత ఆత్మైవ భవతుమర్హతి।

మదర్థమ్ ఇచ్చటగూడ'చేత్'అనుషంగమున్నది.ఒకవేళ ఆ త్మభిన్నసుఖగుణము ఆత్మశేషము=ఆత్మకొఱకై ఉన్నదనిన, అది యును సరిగాదు.ఎందుకనగా,మదర్థములు అనగా ఆత్మశేష ములగు పుత్రభార్యాదులు స్వయముగా ప్రీతికి 'విషయములు గా కనిపించుటలేదు.ఎంతవరకు ఆత్మకు(తనకు) అనుకూలము లగునో,అంత వరకే ప్రియముండును.ప్రతికూలమైతే ప్రీతికి విష యములగుట లేవు. అవి నిరుపాధిక ప్రీతివిషయములు కావు. సాధనత్వముచే ప్రీతికి విషయములున్నవి.కాని,సుఖమైతే సకల జీవులకు సర్వకాల సర్వావస్థలయందును స్వయముగా నిర్వి వాదముగా ప్రీతికి విషయమున్నది. అన్య ఉపాధి సంబంధము

వలన ప్రియమగుటలేదు.అందువలన ఆత్మయే సుఖస్వరూపము న్నది.

కథమితి చేచ్ఛృణు। జగతి సర్వేషాం పదార్థానాం చతుర్విధా ఉవస్థితిః । ఆత్మా ప్రియోఽప్రియ ఉపేక్ష్యశ్చేతి । సుఖం తావన్న వ్యాఘ్రాదివదప్రియమ్, తస్య సర్వైః ప్రార్థ్యమానత్వాత్, అత ఏవ న లోష్ఠాదివదుపేక్ష్యమ్;నాపి ప్రియమాత్రమ్,తచ్ఛేషే పుత్రభార్యా దావపి తద్దర్శనాత్; అతః పరిశేషాదాత్మైవ।

ఎందుకనిన,జగత్తులో సర్వపదార్థములను నాలుగు తెగలు గా విభజించి శ్రీభారతీతీర్థులవారు ఇట్లు చెప్పియున్నారు—

ఆత్మా ప్రేయాన్ ప్రియః శేషో ద్వేష్యోపేక్ష్యే తదన్యయోః ।

ఇతి వ్యవస్థతో లోకే యాజ్ఞవల్క్య మతం చ తత్ (వే.పం. 12-55)౧.ఆత్మ=సుఖస్వరూపము,౨.ప్రియములు=సుఖవిష యములు,పుత్రభార్యాదులు;3.అప్రియములు=ద్వేష్యములు,వ్యా ఘ్ర సర్పాదులు; ౪.ఉపేక్ష్యములు=తృణపాషాణాదులు.

౧.సుఖము వ్యాఘ్రాదులవలె అప్రియము గాదు.అనగా ఆ త్మ యెవరికి గూడ అప్రియము లేదు.“సుఖం మే భూయాత్” నాకు ఎల్లప్పుడు సుఖము లభించు గాక-అను బలవత్తరమైన సుఖాభిలాష సర్వజీవులకు ఉన్నది.౨.దారిలో పడిఉన్న తృణ పాషాణాదులవలె సుఖము ఉపేక్ష్యముగూడ కాదు.3.పుత్ర భా ర్యాదులు ప్రియములున్నారు.అంతమాత్రాన సుఖరూపములని చెప్పటకు వీలులేదు.ఆత్మసుఖాభివ్యంజకములు మాత్రమే.అను

కూలమున్నంత వరకే ప్రియములు.కావున,పరిశేషర న్యాయ ముచే చతుర్విధ పదార్థములలో మూడు పదార్దములు సుఖ రూపములుకావు-అని తెలినమీదట అవశిష్ట చతుర్థపదార్థమగు ఆత్మయే పరమప్రీతికి విషయమున్నదని,సుఖస్వరూపమున్నద ని సిద్ధించినది.

నన్వాత్మశేషత్వేన తస్య ప్రీతివిషయత్వం కిం నస్యాదితి చేత్, తర్హి వక్తవ్యమ్, ఆత్మని ప్రీతిః కింనిమిత్తేతి,యేన సుఖమపి తచ్ఛే షతయా ప్రియం జాయతే। సుఖసాధనత్వాదితి చేత్, తర్హి సుఖ సాధనేనాత్మనా ఉపకార్యః కశ్చిద్వక్తవ్యః, స్రక్చన్దనాదిసుఖసాధ నేనాన్యస్యైవోపకార్యత్వదర్శనాత్, ఆత్మని చ కర్మకర్తృవిరోధాత్ స చోపాకార్యోఽన్యో నదృశ్యతే। తస్మాన్న సుఖసాధనతయాత్మా ప్రియః,కింతు సుఖస్వరూపతయా। తస్మాన్నాత్మశేషతయా సుఖ స్యాపి ప్రియత్వమ్, కిం త్వాత్మతయైవ।

శంక:-ఆత్మశేషత్వముచే సుఖము ప్రీతికి విషయమెం దుకుకాకూడదు?ఏవిధముగా లోకంలో''ధనంమే స్యాత్''నాకు ధనము కావలయును;''జాయా మే స్యాత్''నాకు భార్య కావల యును;''పుత్రోజాయేత''పుత్రుడుకలుగవలెను—ఇత్యాది కామన లచే ధనాదులు ఆత్మార్థములుగా=ఆత్మశేషములుగా తెలియబ

---

ర ప్రసక్తప్రతిషేధే సత్యన్యత్రాప్రసఙ్గాచ్ఛిష్యమాణే సంప్రత్యయః పరిశేషః ।ఒక గంపలో పది మామిడిపండ్లున్నాయి.అందులోనుండి తొమ్మిది పండ్లు తీసి పిల్లలకిచ్చారు.ఇంకా ఆ గంపలో ఎన్ని పండ్లున్నాయి, వేరుగా చెప్పాలా?

డుచున్నవి.కాని,స్వయముగా సుఖస్వరూపములు కావు.అట్లే, "సుఖం మే స్యాత్"నాకు సుఖము కలుగవలెను—యీ సుఖ కామనచే సుఖమునందుగూడ ఆత్మార్థత్వము తెలియబడుచున్న ది.అలాంటపుడు సుఖమునందు పరార్థత్వాభావము ఎట్లుండు ను?అనగా సుఖము ముఖ్యప్రీతికి యెట్లు విషయ మగును?

పూర్వపక్షి అనుమానప్రయోగము ఇట్లున్నది.

ఆత్మ సుఖసాధనమున్నది (ప్రతిజ్ఞా); ఆత్మ పక్షము,సుఖ సాధనత్వము సాధ్యము; ప్రియత్వాత్ (హేతువు); అన్నపానాది-వత్ (దృష్టాంతము).

సమాధానము:-మేము ఇంతకుపూర్వమే విత్త పుత్ర కళత్రా దులు స్వతఃప్రియములు కావు.ఆత్మస్వరూపసుఖాభివ్యంజకము లు మాత్రమేనని చెప్పియున్నాము.సుఖముచే సుఖాభివ్యక్తి కలు గదు.సుఖము ఆత్మకు ప్రియసాధనమగుటకు పూర్వము,ఆత్మ యందు యే ప్రీతిగలదో,అది యే నిమిత్తముచే కలిగినది.దాని చే సుఖముగూడ ఆత్మకు ప్రియసాధనమగునో-అట్టి నిమిత్తమే మిటి?

ఒకవేళ పూర్వపక్షి ఇట్లనవచ్చును-"సుఖం మే స్యాత్" అను ప్రతీతినిబట్టి పుత్రాదులవలె సుఖసాధనమున్నందున ఆత్మయందు ప్రీతిగలదు.

సిద్ధాంతి:-ఆత్మయే సుఖస్వరూపము.అలాంటపుడు సుఖ ము సుఖసాధనమయ్యి యెవరికి ఉపకారము చేయుచున్నది.

ఏవిధముగా భోజనము సుఖసాధనమయ్యి భోక్తకు ఉపకారక మౌతుంది.భోక్తఉపకార్యమగును.అట్లు,యే ఉపకార్యము కొఱకు ఆత్మ ఉపకారకము(సాధన)మగును.స్రక్చందనాదులు సుఖసాధనములున్నవి.వాటికి ఉపకార్యము వాటికంటె భిన్నముగా భోక్త తెలియబడుచున్నాడు.

ఒకవేళ ఆత్మయే ఆత్మకు ఉపకార్యమని చెప్పినచో,స్వయముగా తానే కర్మ,తానే కర్తయగుట-కర్మకర్తృ విరోధము ప్రాప్తమగును.ఆత్మకు ఉపకార్యము ఆత్మకంటె భిన్నము మరొకటి తెలియబడుట లేదు.అందువలన,ఆత్మ-సుఖసాధనమున్నందున ప్రీతికి విషయమగుట లేదు.మరేమనగా సుఖస్వరూపమున్నందున ప్రీతికి విషయమగుచున్నది.అట్లే సుఖముకూడ ఆత్మశేషమున్నందువలన ప్రీతికి విషయమగుటలేదు.మరేమనగా,ఆత్మస్వరూపమున్నందున సుఖము నిరతిశయప్రీతికి విషయమగుచున్నది.

పూర్వపక్షియొక్క అనుమాన ప్రయోగములో హేతువునకు భోగ్యత్వరూప ఉపాధి[3]ఉన్నందున సోపాధికమగును.అనగా, భోగ్యత్వముండి ప్రియత్వమున్నట్లైతే, భోక్తకు సుఖసాధనమగు

3 సాధ్యవ్యాపకత్వేసతి సాధనావ్యాపకత్వమ్ ఉపాధిః । పూర్వపక్షిణః అనుమానప్రయోగమిత్థంభవతి:-ఆత్మాసుఖసాధనః,ప్రియత్వాత్.భోజనాదివత్॥ అత్ర భోగ్యత్వముపాధిః.యథా,యత్ర సుఖసాధనత్వమస్తి తత్ర భోగ్యత్వమస్తీతి నియమః;యత్ర ప్రియత్వమస్తి తత్ర భోగ్యత్వమప్యస్తీతి న నియమః -ఆత్మని ప్రియత్వమస్తి, భోగ్యత్వం నాస్తి.

ను. మరియు ఆత్మకు సుఖసాధనత్వము చెప్పినచో, ఆత్మ యే భోక్తకోసము సుఖసాధనమగును?అనగా భోక్త యెవరు?ఆత్మ కంటె వేరు భోక్తయగు చేతనము కనబడుట లేదు.

నను 'సుఖముత్పన్నమ్ నష్టమ్' ఇతి ప్రతీయమానస్య కథమాత్మస్వరూపత్వమితిచేత్; న;తస్య తద్వ్యఞ్జకవృత్తివిషయ త్వాత్|సర్వమేతదుక్తం బ్రహ్మానన్దే–"**ఆత్మాశేషఉపేక్ష్యంచ ద్వేష్యం చేతిచతుర్ష్వపి|ఆత్మాప్రేయాన్ప్రియఃశేషోద్వేష్యోపేక్షే తదన్యయోః|| ఇతి వ్యవస్థితోలోకో యాజ్ఞవల్క్యమతం చ తత్| సుఖసాధనతో పాధేరన్నపానాదయః ప్రియాః ఆత్మానుకూల్యాదన్నాదిసమశ్చే దమునాత్ర కః| అనుకూలయితవ్యః స్యాన్నైకస్మిన్కర్మకర్తృతా||** ఇత్యాది | (వే.పం.౧౨-౫౨;౫౫;౭౩;౭౪)

శంక:-ఆత్మయే సుఖము;సుఖమే ఆత్మయని స్వీకరించి నచో''సుఖముత్పన్నమ్,సుఖంనష్టమ్''అను ప్రతీతిచే ఉత్పత్తి వి నాశములు పొందు సుఖము నిత్యమగు ఆత్మయెట్లగును?

సమాధానము:-సుఖమునకు ఉత్పత్తి వినాశములు లేవు, మరేమనగా,సుఖమును అభివ్యక్తముచేయు అంతఃకరణ వృత్తి యొక్క ఉత్పత్తివినాశములు కలుగుచున్నవి.అవి భ్రాంతిచే సుఖ మునందు ఆరోపింపబడి ''పుత్రసుఖముత్పన్నమైనది,భార్యాసు ఖము నష్టమైనది''అను ఔపచారిక వ్యవహారము జరుగుచున్న ది.వాస్తవముగాదు.ఈ విషయమును శ్రీభారతీతీర్థులవారు బ్ర హ్మానందే ఆత్మానందమను 12 వ ప్రకరణములో మూడు శ్లోక

ములచే తెలిపినారు. వాటియొక్క భావమిది యగును. ౧.ఆత్మ, ౨.ప్రియము, 3.ద్వేష్యములు, ౪.ఉపేక్ష్యములు-ఇట్లు జగత్తులో నాలుగు పదార్థములున్నవి.వాటిలో ౧.ప్రత్యగానందరూప ఆత్మ సర్వాధిక ప్రీతికి విషయమున్నది.౨.పుత్ర,భార్యాది పదార్థములు ప్రియములు=సుఖసాధనములున్నవి.౩.ఆత్మ మరియు ఆత్మశేష ములగు పుత్రభార్యాదులంటెఅన్యములగు వ్యాఘ్రసర్పాదులు ద్వే ష్యములున్నవి.౪.దారిలో కనబడు తృణపాషాణాదులు ఉపేక్ష్య ములు.శ్రీయాజ్ఞవల్క్యఋషికి సమ్మతమైన ఈవిషయము బృహ దారణ్యక ఉపనిషత్తులో ప్రసిద్ధమున్నది.

''తదేతత్ప్రేయః పుత్రాత్ప్రేయో విత్తాత్ప్రేయోఽన్యస్మాత్సర్వస్మాద న్తరతరం యదయమాత్మా''(బృ.౧-౪-౮)

విత్తాత్పుత్రః పుత్రాత్పిండః పిండాత్తథేంద్రియమ్ ।

ఇంద్రియాచ్చ ప్రియః ప్రాణః ప్రాణాదాత్మా ప్రియః పరః॥

(వే.పం.౧౨-౬౦)

ఆత్మనఃసుఖరూపత్వంసర్వజ్ఞాత్మమునిభిరప్యుక్తమ్–**"సర్వం యదర్థమిహ వస్తు యదస్తి కిఞ్చిత్పారార్థ్యముజ్ఝతి చ యన్నిజ సత్తయైవ। తద్వర్ణయన్తి హి సుఖం సుఖలక్షణజ్ఞాస్తత్ప్రత్యగాత్మని సమం సుఖతాస్య తస్మాత్॥"**(సం.శా.౧-౨౪)ఇతి॥

శ్రీ సర్వజ్ఞాత్మ మునీంద్రులవారు కూడ ఆత్మ సుఖస్వరూప మున్నదని సంక్షేప శారీరకములో ఇట్లు చెప్పియున్నారు.

నిరుపాధిక అనుకూల పదార్థమే సాక్షాత్ ప్రీతికి విషయ ముండుట లోకప్రసిద్దము. అట్టి వస్తువు సుఖముకంటె మరొక వస్తువు లేదు.ప్రపంచములోని యెన్ని వస్తువులున్నవో, అవన్ని యు యెవరికోసమున్నవో, యేది తనయొక్క సత్తామాత్రముచే పరార్థమును వీడియున్నదో,దానిని సుఖలక్షణమునెఱిగినవారు 'సుఖము'అని చెప్పుదురు.అట్టిది కేవలము ప్రత్యగాత్మయే ఉన్న ది. కావున,ప్రత్యగాత్మ సుఖస్వరూపమున్నదని నిశ్చయింపబడు చున్నది.

బ్రహ్మగీతాసుచ–**"ప్రత్యగ్రూపఃశివఃసాక్షాత్పరానన్దస్వలక్షణః। పరప్రేమాస్మదత్వేన ప్రతీతత్వాత్సురర్షభాః॥**(౬-౧) **సర్వస్యైవ తు కామాయ న సర్వం భవతి ప్రియమ్। కిం త్వాత్మనస్తు కామాయ తతః ప్రియతమః స్వయమ్। అతః ప్రియతమస్వాత్మా సుఖవత్సు విలక్షణః॥"**(౬-౧౩;౧౪)ఇత్యాది। తస్మాద్యుక్త్యా విద్వదనుభూత్యా, బహువిదాం వచనైశ్చాత్మా సుఖరూప ఇత్యత్ర న కశ్చిద్వివాద ఇతి భావః ॥౨౪ ॥

ఈ విషయమునే బ్రహ్మగీతలు గూడ చెప్పుచున్నవి. ఓ దేవ శ్రేష్ఠులారా!పరమప్రేమాస్పదమున్నందున ప్రత్యగాత్మయేమంగళ స్వరూపమున్నది.సకలవస్తువులు సకలవస్తువులకోసము ప్రియ ములు కావు.మరేమనగా!ఆత్మకోసమే ప్రియములున్నవి.

"న వాఽరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి"(బృ.౨-౪-౫; ౪-౫-౫)

అందువలన,ఆత్మయే సర్వాధిక ప్రీతికి విషయమున్నది.ఓ దేవగ ణములారా!ఆత్మయే ప్రియతమ సుఖస్వరూపమున్నది. బాహ్య విత్త పుత్ర కళత్రాదులు ప్రీతికి విషయములున్నవి. కాని,స్వతః సుఖరూపములుకావు.సుఖాభివ్యంజక సాధనములు మాత్రమే. నిరుపాధికప్రీతికి విషయములు గావు.ఆత్మశేషత్వరూపముచే ప్రియములున్నవి.కావున,శ్రుతి,యుక్తి మరియు యాజ్ఞవల్క్యాది బ్రహ్మవేత్తల వచనములచేతను ఆత్మయే సుఖస్వరూపముగా నిర్వివాదముచే సిద్ధమైనదని తాత్పర్యము ॥ ౨౪ ॥

## బ్రహ్మము అఖండ ఏకరసము

నన్వేవమపి బ్రహ్మణః **"ఏకధైవానుద్రష్టవ్యమ్"**(బృ.౪-౧-౨,౩) ఇతి శ్రుత్యుక్తమఖణ్డైకరసత్వం న సంభవతి, ఉక్తప్రకారేణ తస్య సచ్చిదానన్దరూపత్రయాత్మకత్వాత్,నచ సచ్చిదానన్దానాం తేషాం త్రయాణామప్యత్యన్తాభేద ఇతి వాచ్యమ్,తథాత్వే తద్వాచకానాం సచ్చిదానన్దశబ్దానాం త్రయాణామపి పర్యాయతయా, సహప్ర యోగానుపపత్తేః;నహి ఘటకుమ్భకలశాదిశబ్దానామేకార్థవాచ కానాం సహప్రయోగోఽస్తీత్యాశఙ్క్య, బ్రహ్మణోఽఖణ్డైకరసత్వ ముపపాదయతి —

ఆత్మ సచ్చిదానందరూపమున్నదని సిద్ధించిననూ,"ఏకధైవా నుద్రష్టవ్యమ్"(బృ.౪-౧-౨,౩)అను శ్రుతిలోచెప్పబడినట్లుగా బ్రహ్మ మునకు అఖండైకరసత్వము సిద్ధించదు.ఎందుకనగా! పైన చె ప్పబడిన ప్రకారముచే బ్రహ్మము సత్, చిత్, ఆనందము-అని

మూడు విధములుగా సిద్ధించుచున్నది.అనగా, బ్రహ్మమునందు సత్,చిత్,ఆనందము-అను త్రయాత్మక స్వగతభేదము ప్రాప్తించు చున్నది.సచ్చిదానందములు అత్యంతఅభిన్నములు అని చెప్పుట కుదీలుపడదు.కారణమేమనగా,బ్రహ్మవాచకములగు సత్,చిత్, ఆనందములు-మూడు పదములకు ఏకార్థవాచిత్వము, అనగా పర్యాయ శబ్దములు అని చెప్పినచో, ఏకకాలములో మూడు పదముల సహప్రయోగము జరుగదు.లోకంలో ఏకార్థవాచి శబ్దములగు ఘటము, కుంభము, కలశములు ఒకే కాలములో ఒకే వాక్యమునందు సహప్రయోగము చేయుట కనుపించుట లేదు. ఒకవేళ ప్రయోగించినచో శాస్త్రములో పునరుక్తి దోషమని చెప్పుదురు.ఇట్లు శంక ప్రాప్తించగా,సమాధానార్థము ఉత్తరశ్లోకములో బ్రహ్మమునకు అఖండైకరసత్వమును సిద్ధిజేయుచున్నాడు.

**న హి నానాస్వరూపం స్యాదేకం వస్తు కదాచన ।**

**తస్మాదఖణ్డ ఏవాఽస్మి విజహజ్జాగతీం భిదామ్ ॥౨౫ ॥**

**అన్వయః:**-ఏకమ్ వస్తు కదాచన నానాస్వరూపమ్ న స్యాత్, తస్మాత్ జాగతీమ్ భిదామ్ విజహత్ అహమ్ అఖణ్డ ఏవ అస్మి ॥౨౫ ॥

**అన్వయార్థము:**-హి=ఏలయనగా,ఏకంవస్తు=ఒకేవస్తువు; కదాచన=ఎప్పుడుగూడ;నానాస్వరూపమ్=అనేకరూపములుగా ;నస్యాత్=కానేరదు;తస్మాత్=అందువలన;జాగతీమ్ భిదామ్=జ

గద్రూప ఉపాధికృతభేదమును;విజహత్=త్యజించి;అఖండః ఏ వ అస్మి=అఖండైకరసస్వరూపుడనై యున్నాను.

**టీకా:-**ఏకమద్వితీయం సచ్చిదానన్దాత్మకం వస్తు=బ్రహ్మ కదాచన=కదాచిదప్యుపాధికాలే తదభావకాలేఽపి నానాస్వరూపం–నానారసం న స్యాన్న భవేదిత్యర్థః । తత్ర హేత్వభిప్రాయేణ వస్త్వితి విశేషణమ్। యతో వస్తు పరమార్థభూతం తత ఇత్యర్థః। వస్తుగ్రహణం జ్ఞానానన్దయోరప్యుపలక్షణమ్।

ఏకము,అద్వితీయము,సచ్చిదానందస్వరూప వస్తువగు బ్రహ్మము ఉపాధి కాలములోగాని,ఉపాధ్యభావ కాలములోగాని అనేకరసము కానేరదు.ఎప్పుడుగూడ నానాస్వరూపము కానేరదు.మూలగ్రంథకర్తయగు శ్రీలక్ష్మీధర కవీంద్రులవారు బ్రహ్మవస్తువు సత్యస్వరూపమున్నదని తెలుపుటకై,'వస్తువు'అని హేతుగర్భిత విశేషణమిచ్చినారు.బ్రహ్మవస్తువు అనగా పరమార్థభూత 'సద్రూపము'న్నందుచే నానాస్వరూపముండ నేరదు.వస్తుపదము జ్ఞానమునకు మరియు ఆనందమునకు ఉపలక్షణము.

అయమర్థః:–బ్రహ్మణి సత్యజ్ఞానానన్దానాం పరస్పరభిన్నత్వే, సత్యస్య సత్యత్వం,జ్ఞానస్య జ్ఞానత్వమ్, ఆనన్దస్యానన్దత్వం చ న సిద్ధ్యేత్;కథమితి చేత్–సత్యం యది జ్ఞానాద్భిన్నం స్యాత్, జడస్య తస్య శుక్తిరూప్యాదేరివ సత్యత్వం నస్యాత్,ఏవంయది జ్ఞానమపి సత్యాద్భిన్నం స్యాత్, అసత్యస్య తస్య జ్ఞానస్య జడత్వనియమేన జ్ఞానత్వం నస్యాత్,తతః సత్యజ్ఞానయోః సత్యత్వజ్ఞానత్వసిద్ధయే

ఽత్యన్తం పరస్పరాభేదోఽఙ్గీకర్తవ్యః। తదుక్తం సర్వజ్ఞాత్మమునిభిః –**"సత్యేఽప్యస్తిజ్ఞానతా జ్ఞానతాయాం సత్యత్వంచ స్పష్టమస్త్యేవ తద్వత్। సత్యస్యేవం నాతిరేకావకాశః పూర్ణేతత్త్వే జ్ఞానసత్యోపపత్తేః"**(సం.శా.౧-౧౮౬)॥ఇతి॥

అభిప్రాయమేమనగా,సత్యము,జ్ఞానము మరియు ఆనందము-యీ మూడుపదములు పరస్పరము అత్యంత భిన్నములు-అని స్వీకరించినచో,సత్యమునకు సత్యత్వము,జ్ఞానమునకు జ్ఞానత్వము మరియు ఆనందమునకు ఆనందత్వము సిద్ధించదు. ఎందుకనగా,ఒకవేళ సత్యము జ్ఞానముకంటె భిన్నమగుచో జ్ఞానశూన్యసత్యమునకు జడత్వముప్రాప్తించును,అప్పుడు ముత్యపుచిప్పయందు భ్రాంతిచే కనబడు వెండివలె,సత్యము అసత్యమగును.అట్లే,జ్ఞానము సత్యముకంటె భిన్నమగుచో,సత్యముకంటె భిన్నమగుజ్ఞానమునకు అసత్యత్వము ప్రసక్తమగును.ఏది అసత్యముండునో,అది జడముండును.కావున,జ్ఞానమునకు జ్ఞానత్వము లేకుండాపోవును.అందుచే సత్యమునకు సత్యత్వము, జ్ఞానమునకు జ్ఞానత్వము సిద్ధించుటకై,పరస్పరము రెంటికి అత్యంత అభేదమును స్వీకరించవలయును. ఈవిషయమై శ్రీసర్వజ్ఞాత్మ మునీంద్రులవారు సంక్షేపశారీరకములో ఇట్లు చెప్పియున్నారు.

పూర్వపక్షము:-సత్,చిత్ మరియు ఆనందము-యీ మూడుపదముల లక్ష్యార్థమునందు పరస్పరము భేదమున్నదా?లేదా?ఇచ్చట,ఇట్లు విచారించవలయును.భేదమున్నదని చెప్పినచో,బ్రహ్మము అఖండైకరససరూపము-అని చెప్పుట కుదురదు. అ

నేకాకారమున్నదని చెప్పవలసియుండును.వృక్షములోని పత్రపుష్పఫలాదులవలె బ్రహ్మమునకుస్వగతభేదముప్రాప్తించును.అప్పుడు బ్రహ్మమునకు నిరుపాధిక మహత్వము సిద్ధించనందువలన "ఏకధైవానుద్రష్టవ్యమ్"అను శ్రుతి ప్రతిపాదిత ఏకరసత్వము అనగా స్వగతభేదశూన్యత్వము అసిద్ధమగును.ఒకవేళ సచ్చిదానంద పదముల లక్ష్యార్థమునందు అభేదమున్నదని చెప్పినచో, ఒకే సత్ పదఉచ్చారణచే బ్రహ్మము సిద్ధించుచుండ, చిత్ మరియు ఆనంద పదముల నుచ్చరించినచో,పునరుక్తి దోషము ప్రాప్తించును,గావున చిత్ మరియు ఆనందపదములకు వ్యర్థతాదోషము ప్రసక్తమగును.

ఈశంక పరిహారార్ధము 'సత్యేప్యప్తి' అను శ్లోకము ప్రవృత్తము చేయబడుచున్నది.

సమాధానము:-పైన చూపబడిన ఆక్షేపము యుక్తము కాదు.ఏలయనగా,సత్ పదముచే అసత్యమగు మిథ్యా ప్రపంచము వ్యావృత్తమై, బ్రహ్మము లక్షింపబడును. ఇంత మాత్రముచే సత్ పదముద్వారా ప్రపంచముపట్ల ఉన్న జడత్వము దూరమై, బ్రహ్మమునకు జ్ఞానరూపత్వము సిద్ధించదు.అందుకని,జడత్వ విరోధి చిత్పదముయొక్క ఆవశ్యకత ఉంది. అట్లే కేవల జ్ఞాన పదముచే జ్ఞానవిరోది జడముయొక్క వ్యావృతి చేయబడిననూ, బ్రహ్మమునకు అత్యంత అబాధ్యరూప సత్యత్వము సిద్ధించదు. అందుకని, సత్ మరియు చిత్ రెండు పదములకు ఏకార్థవాచిత్వరూప పర్యాయతఉన్నప్పటికినీ,అసత్తు మరియు జడమగు ప్రపంచము

యొక్క వ్యావృత్తిరూప వాచ్యార్థభేదమున్నందున పదభేదము యొక్క ఆవశ్యకత ఉంది.

శంక:-ఎప్పుడైతే సత్ మరియు చిత్ పదములకు అర్థభేద మున్నదో?అప్పుడు బ్రహ్మమునకు ఏకరసత్వమెట్లు సిద్ధించు ను? ఇంకా ఈ దోష పరిహారమునకు సమాధానము చెప్పనే లేదు గదా!

సమాధానము:-ఈ శంక యుక్తముగాదు.ఎందుకనగా! స త్పదలక్ష్యమగు బ్రహ్మమునందు జ్ఞానత్వముగూడ ఉంది. సత్పద లక్ష్యముకంటె జ్ఞానత్వము భిన్నముండుట అశక్యము. ఒకవేళ భిన్నమని చెప్పినచో,సద్రూపబ్రహ్మమునకు జడత్వ ప్రసంగమేర్ప డును.కావున,సత్పదలక్ష్యమగు బ్రహ్మమునందు జ్ఞానత్వమును గూడ అవశ్యముగా ఒప్పుకొనవలెను.సరే,ఏవిధముగా సత్పద లక్ష్యమునందు జ్ఞానత్వము గలదో, అట్లే, జ్ఞానపద లక్ష్యమగు బ్రహ్మమునందు సత్యత్వముకూడ పైయుక్తిచే తెలియవలెను. జ్ఞానమును సత్యముకంటె భిన్నమని స్వీకరించినచో,దానిని తు చ్ఛమని చెప్పవలసివచ్చును.అప్పుడు ప్రకాశకుడెవరు లేకపోవు టచే జగదాంధ్య ప్రసంగమేర్పడును.జగత్తంతా అంధకారబంధు రమగును.అందువలన,సత్ మరియు చిత్-ఈ రెండు పద ములు పరస్పరము అంతర్భావములుగాన,వాటికి అఖండైకరస వస్తువగు బ్రహ్మమునందు పర్యవసానము గలదని సిద్ధమైనది.

ఏవం యది జ్ఞానాదానన్దోఽపి భిన్నః స్యాత్,జ్ఞానభిన్నస్య తస్య ఘటాదివదనానన్దత్వమేవ స్యాత్,తథాఽఽనన్దాదపి యది జ్ఞానం భిన్నంస్యాత్,ఆనన్దభిన్నస్య తస్య ఘటాదివజ్జడత్వేన జ్ఞానత్వమేవ నస్యాత్; తతో జ్ఞానానన్దయోరపి జ్ఞానత్వానన్దత్వసిద్ధయేఽత్యన్తమభేదోఽఙ్గీకర్తవ్యః। ఇదమపి తైరేవోక్తమ్–"**ఆనన్దత్వే జ్ఞానతా జ్ఞానతాయామానన్దత్వం విద్యతే నిర్విశఙ్కమ్। సత్యస్యైవం నాతిరేకావకాశః పూర్ణేతత్త్వే జ్ఞానసౌఖ్యోపపత్తేః॥**"(సం.శా. ౧-౧౮౩) ఇతి।

అదేవిధముగా,ఒకవేళ ఆనందముగూడజ్ఞానముకంటె భిన్నమైనచో జ్ఞానభిన్నఆనందమునకు ఘటాదులవలె అనానందత్వము ప్రాప్తించును,మరియు ఆనందముకంటె జ్ఞానముగూడ భిన్నమైనచో,ఆనందభిన్న జ్ఞానము ఘటాదులవలె జడమగుట వలన జ్ఞానరూపము కాకుండా పోవును.అందువలన,జ్ఞానము మరియు ఆనందములయొక్క జానత్వ,ఆనందత్వ సిద్ధికొఱకు, వాటికి పరస్పర అత్యంతఅభేదము స్వీకరించవలసియుండును. ఈవిషయమునుగూడ శ్రీసర్వజాత్మ మునీంద్రులవారే చెప్పియున్నారు.ఆనందత్వమునందు జ్ఞానత్వము మరియు జ్ఞానత్వమునందుఆనందత్వము నిఃసందేహముగా విద్యమానమై యున్నది. ఈప్రకారముగా ఆనంద జ్ఞానములకు ఏమాత్రముగూడ భేదమునకవకాశము లేదు.ఎందుకనగా,పూర్ణతత్త్వమునందు జ్ఞానము మరియు ఆనందములయొక్క అభేదము అనుపపన్నము కానేరదు.

ఏవం సత్యాదానన్దోఽపి యది భిన్నఃస్యాత్,అసత్యస్య తస్య శుక్తిరూప్యాదేరివానన్దత్వం నస్యాత్;ఏవంసత్యమపి యద్యానన్దాద్భిన్నం స్యాత్,అనానన్దస్య తస్య శుక్తిరూప్యాదేరివ సత్యత్వం నస్యాత్;తతః సత్యానన్దయోరప్యత్యన్తమభేదో వక్తవ్యః।ఇదమపి త్తైరేవోక్తమ్–**"ఆనన్దత్వే సత్యతా సత్యతాయామానన్దత్వం నిర్వివాదంప్రసిద్ధమ్। సత్యస్యైవం నాతిరేకావకాశః పూర్ణేతత్త్వే సత్య సౌఖ్యోపపత్తేః"**(సం.శా.౧-౧౮౮)॥ఇతి॥

అట్లే, సత్యముకంటె ఆనందము భిన్నమైనచో,సత్యముకంటె భిన్నమగు ఆనందమునకు శుక్తిరజతమువలె అనానందత్వము సిద్ధించును.మరియు సత్యముగూడ ఆనందముకంటె భిన్నమగుచో,అనానందరూప సత్యముగూడ శుక్తిరూప్యమువలె అసత్యమగును.అందువలన ఆనందత్వ సత్యత్వసిద్ధికొఱకు,వాటికి పరస్పర అత్యంత అభేదమును అవశ్యముగా స్వీకరించవలయును. ఈవిషయమునుగూడ శ్రీసర్వజ్ఞాత్మ మునీంద్రులవారే చెప్పియున్నారు.ఆనందత్వమునందు సత్యత్వము,సత్యత్వమునందు ఆనందత్వము నిర్వివాదరూపముచే ప్రసిద్ధమున్నది.కావున,వాటియొక్క భేదమునకు లేశమాత్రము గూడ అవకాశము లేదు. ఎందుకనగా,పూర్ణతత్త్వమునందు సత్యము మరియు ఆనందముల యొక్క అభేదము అనుపపన్నము కానేరదు.

నిత్యముక్తశుద్ధత్వాదిష్వేవమేవోహ్యమ్।నచ తేషామత్యన్తాభేదే తద్వాచక సత్యాదిపదానాం పర్యాయతా వాచ్యా। అర్థానాం భేదస్యాఙ్గీకారాత్ః,సత్యపదం ముఖ్యాముఖ్యసత్యరూపబ్రహ్మకా

శశబలరూపే సత్యే వ్యుత్పన్నమ్, జ్ఞానపదం చ చైతన్యాన్తఃకరణ వృత్తిరూపముఖ్యాముఖ్యజ్ఞానద్వయశబలరూపేజ్ఞానే వ్యుత్పన్నమ్, ఆనన్దపదంచ ప్రత్యగ్ బుద్ధివృత్తిరూపముఖ్యాముఖ్యానన్దద్వయ శబలరూప ఆనన్దే వ్యుత్పన్నమ్, ఏవం నిత్యశుద్ధాదీన్యపి పదాని ముఖ్యాముఖ్యతత్తద్ద్వయశబలరూపేతస్మింస్తస్మిన్ వ్యుత్పన్నానీతి ద్రష్టవ్యమ్। ఏతత్సర్వం సర్వజ్ఞాత్మమునిభిరేవోక్తమ్–"**ఆకాశాదౌ సత్యతా కాచిదేకా ప్రత్యఙ్మాత్రే సత్యతా కాచిదన్యా। తత్సంపర్కాత్సత్యతా తత్ర చాన్యా వ్యుత్పన్నోఽయం సత్యశబ్దస్తు తత్ర॥** (సం. శా.౧-౧౭౮) **బుద్ధేర్వృత్తౌ జ్ఞానతా తావదేకా ప్రత్యగ్బోధే జ్ఞానతా కాచిదన్యా। తత్సంపర్కాజ్జ్ఞానతా తత్ర చాన్యా వ్యుత్పన్నోఽయం జ్ఞాన శబ్దస్తు తత్ర॥**(సం.శా.౧-౧౭౯) **బుద్ధేర్వృత్తౌ తావదానన్దతైకా ప్రత్యఙ్మాత్రే కాచిదానన్దతాన్యా।తత్సంపర్కాత్కాచిదానన్దతాన్యా వ్యుత్పన్నోఽయం తత్ర చానన్దశబ్దః** (సం.శా.౧-౧౮౦) ఇత్యాదినా తతో వాచ్యార్థభేదస్యాఙ్గీకారాన్న పదానాం పర్యాయతాఽపీతి భావః ।

సత్,చిత్ మరియు ఆనందపదముల అభేదవిషయములో యే యుక్తి చెప్పబడినదో,అదేయుక్తిచే నిత్యత్వము,ముక్తత్వము మరియు శుద్ధత్వాదులందుకూడ అభేదమును గ్రహించవలెను. వాటియొక్క అత్యంతాభేదమును స్వీకరించిననూ,ఆ సత్యాదిప దములకు ఏకార్థత్వము=పర్యాయవాచిత్వము చెప్పుటకు వీలు లేదు.ఎందుకనగా,వాటియొక్క వాచ్యార్థభేదము స్వీకరించబడి నది.ఎట్లనగా,సత్యపదము ముఖ్యార్థముచే అనగా లక్ష్యార్థము

చే బ్రహ్మబోధకమున్నది,మరియు అముఖ్యార్థముచే=వాచ్యార్థ ముచే మాయావిశిష్ట ఈశ్వరవాచకమున్నది.జ్ఞానపదము ము ఖ్యార్థముచే చైతన్యమునకు మరియు అముఖ్యార్థముచే అంతః కరణవృత్తిరూపజ్ఞానమునకు బోధకమున్నది.అట్లే, ఆనందపద ము ముఖ్యార్థముచే ప్రత్యగాత్మ(బ్రహ్మము)యొక్క నిరుపాధికా నందమునకు మరియు వాచ్యార్థముచే బుద్ధివృత్తిరూప సోపాధి కానందమునకు బోధకమున్నది.ఇట్లు యీ మూడుపదముల యొక్క వ్యుత్పత్తి గలదు.అట్లే,నిత్యత్వ,ముక్తత్వ,శుద్ధత్వాది పద ములకుగూడ ముఖ్యాముఖ్య వ్యుత్పత్తి తెలియవలెను.

ఆకాశాది పదార్థములు అవిద్యాకార్యములు, బ్రహ్మజ్ఞానబా ధ్యములు,వ్యవహారకాలమునందు అబాధ్యములున్నవి.అందువ లన,వాటిలో ప్రమాణాబాధ్యత్వరూప ఆపేక్షికసత్యత్వము ఒకటు న్నది. మరియు ప్రత్యక్ శుద్ధచైతన్యమునందు ఆకాశాదులలో స్వీకరించబడిన సత్యముకంటె విలక్షణమగు అనధ్యస్త త్రైకాలికా బాధ్యత్వరూప సత్యత్వము రెండవది గలదు.ఆకాశాదులు మరి యు చేతనముయొక్క పరస్పరాధ్యాసచేత అనగా వ్యావహారిక మరియు తాత్త్వికస్వరూప వివేకాభావమువలనభాసించు సత్య త్వము మూడవది.ఆత్మానాత్మలయొక్క అవివేకరూప ఆధ్యాసిక సంబంధమునకే శబలము అనగా విశిష్టమందురు.పరస్పర తా దాత్మ్యాధ్యాసచే నిష్పన్న శబల=విశిష్ట పదార్థమునందు వాచ్యా ర్థరూపముచే సత్యాది శబ్దములయొక్క వ్యుత్పత్తి గ్రహించబడు చున్నది.లేనిచో,అధిష్ఠానచైతన్య జ్ఞానముచే భాధింపబడనంతవ

రకు వ్యవహారకాలములో అధ్యస్తములగు ఆకాశాదులందు సత్యత్వముయొక్క అనుపలబ్ధి ప్రసంగమేర్పడును, గావున, అధ్యస్త శబలపదార్థములందు సత్యాది శబ్దములకు వాచ్యత్యము స్వీకరించబడినది.

ఘటాద్యాకార బుద్ధివృత్తియందు స్వతః జడత్వమున్నప్పటికినీ,వ్యవహారకాలములో దానికి అర్థప్రకాశకత్వరూప=చైతన్యాభివ్యంజకత్వరూప ఒక వ్యావహారిక జ్ఞానత్వము నిర్వివాదముగా గలదు.మరియు ప్రత్యక్చైతన్యమునందు స్వప్రకాశజ్ఞానతారూప పారమార్థిక జ్ఞానత్వము రెండవది గలదు. ఆ రెండింటి తాదాత్మ్యాధ్యాసముచే నిష్పన్న విశిష్టతత్త్వమునందు జ్ఞానపద వాచ్యత్వము మూడవది గలదు.

బుద్ధియొక్క సుఖాభివ్యంజకవృత్తియందు వ్యావహారిక ఆ-నందత్వము ఒకటి గలదు.ప్రత్యక్చైతన్యమునందు పరమప్రేమాస్పదత్వరూప పారమార్థిక ఆనందత్వము రెండవది గలదు.ఆ రెండింటి తాదాత్మ్యాధ్యాసముచే పరినిష్పన్న శబలవస్తువునందు ఆనందపదమునకు వాచ్యత్వరూప వ్యుత్పత్తి గలదు.

ఆకాశాదౌ నిత్యతా తావదేకా,

ప్రత్యఙ్మాత్రే నిత్యతా కాచిదన్యా ।

తత్సంపర్కాన్నిత్యతా తత్ర చాన్యా

వ్యుత్పన్నోఽయం నిత్యశబ్దస్తు తత్ర॥ (౧౮౧)

ఆకాశాదులందు కల్పితస్థాయిత్వరూప వ్యావహారిక నిత్యత్వముగలదు మరియు చైతన్యమునందు త్రైకాలిక అపరిచ్ఛేద్యత్వరూప పారమార్థిక నిత్యత్వము గలదు. ఆ రెండింటి యొక్క పరస్పర సంపర్కముచే పరినిష్పన్న విశిష్టతత్త్వమునందు నిత్య శబ్దముయొక్క శక్యత్వము గలదు.

ఆకాశాదౌ శుద్ధతా తావదేకా
ప్రత్యజ్మాత్రే శుద్ధతా కాచిదన్యా ।
తత్సంపర్కాచ్ఛుద్ధతా తత్ర చాన్యా
వ్యుత్పన్నోఽయం శుద్ధశబ్దస్తు తత్ర ॥ (౧౮౨)

ఆకాశాదులందు మలాది లేపరహితత్వరూప వ్యావహారిక శుద్ధత్వము గలదు.శుద్ధచైతన్యమునందు అసంగత్వరూప పారమార్థిక శుద్ధత్వము గలదు. ఈ రెంటియొక్క తాదాత్మ్యాపత్తి వలన కలిగిన విశిష్ట పదార్థమునందు శుద్ధశబ్ద గృహీత శక్యత్వము గలదు.

గోవత్సాదౌ ముక్తతా తావదేకా
ప్రత్యజ్మాత్రే ముక్తతా కాచిదన్యా ।
తత్సంపర్కాన్ముక్తతా తత్ర చాన్యా
వ్యుత్పన్నోఽయం ముక్తశబ్దస్తు తత్ర ॥ (౧౮౩)

గోవత్సాదులందు బంధరహితత్వరూప వ్యావహారిక ముక్తతా గలదు.శుద్ధచైతన్యమునందు సంసారరహితత్వరూప పార

మార్ధిక ముక్తతా గలదు.రెండింటియొక్క తాదాత్మ్యాధ్యాసముచే నిష్పన్న విశిష్టార్థమునందు ముక్తిశబ్ద వాచ్యార్థము కలదు.

అందువలన,వాచ్యార్థముల భేదమును అంగీకరించిననూ, పదములలో ఏకార్థత్వ=పర్యాయత్వ అభావముచే పునరుక్తిదోష ప్రసంగము రాదు.

నను కథం తర్హి వాచ్యార్థభేదే సత్యాదీనామత్యన్తాభేద ఉక్త ఇత్యాశఙ్క్య, వాచ్యార్థభేదేఽపి తల్లక్ష్యార్థానామభేదాదిత్యాహ– తస్మాదిత్యాదినా। యస్మాత్సత్యాదీనాం పరస్పరాభేదేన సత్యాది రూపత్వం,యస్మాచ్చ న పర్యాయతా,తస్మాజ్జాగతీంభిదామ్ జగ దాకాశాద్యుపాధిస్తత్ప్రయుక్తాం భిదాం=భేదం విజహత్=త్యజన్, ఆహమఖణ్డ ఏవాస్మి,ఏకరస ఏవాస్మి,నతు నానారసః। సత్యాది పదైర్భాగత్యాగలక్షణయా బోధితసత్యాద్యాత్మకాఖణ్డైకరసోఽస్మీ త్యర్థ। అతః**"ఏకధైవానుద్రష్టమ్"**ఇతి శ్రుత్యుక్తమేకరసత్వముపప న్నమితి భావః ॥౨౫ ॥

శంక:-ఒకవేళ వాచ్యార్థములయొక్క భేదమును స్వీకరించి నచో,సత్యాది పదములకు అత్యంతాభేదము యెట్లు సంపన్నమ గును?

ఉత్తరము:-వాచ్యార్థములలో భేదమున్నప్పటికినీ,లక్ష్యార్థ మగు అఖండైకరస వస్తువగు బ్రహ్మము ఏకమున్నందున పద ములకు అభేదముగలదు.అందుకని,సత్యాదిపదములకు పర్యా యత గూడలేదు.అందువలన ఆకాశాది జగద్రూప ఉపాధివలన

భాసించు భేదమును త్యజించి,నేను అఖండైకరస స్వరూపుడనై యున్నాను.నానాస్వరూపము గాదు.తాత్పర్యమేమనగా, ప్రత్యగ భిన్నబ్రహ్మమునందు స్వగతభేదముయొక్క గంధముగూడ లేదు.సత్యాది పదములచే భాగత్యాగ లక్షణాద్వారా లక్షితమగు సత్యాదిస్వరూప అఖండైకరస బ్రహ్మమునైయున్నాను.

సంసర్గో వా విశిష్టో వా వాక్యార్థో నాత్ర సమ్మతః ।

అఖండైకరసత్వేన వాక్యార్థోవిదుషాం మతః॥(వే.పం.౭-౭౫)

సంసర్గాసఙ్గి సమ్యగ్ధీ హేతుతా యా గిరామియమ్ ।

ఉక్తాఽఖండార్థతా యద్వా తత్ప్రాతిపదికార్థతా ॥

ప్రాతిపదికార్థమాత్రపరత్వం-వాఽఖండార్థత్వమితి చతుర్థపాదార్థః ॥ (తత్త్వప్రదీపిక-చిత్సుఖీ ౧-౧౯)

అవిశిష్టమపర్యాయానేకశబ్దప్రకాశితమ్ ।

ఏకం వేదాన్త నిష్ణాతా అఖండం ప్రతిపేదిరే ॥

(బ్ర.సూ.౧-౧-౨ వేదాన్తకల్పతరువు-శ్రీమదమలానన్ద సరస్వతి)

విస్తరస్తు తత్రైవ ద్రష్టవ్యః ॥

కావున, "ఏకధైవానుద్రష్టవ్యమ్" 'ఆత్మనుఏకరసరూపముచే సాక్షాత్కరించు కొనదగినది'అను శ్రుతిచే ప్రతిపాదిత ప్రత్యగభిన్నపరబ్రహ్మముయొక్క ఏకరసత్వము యుక్తియుక్తముగా ఉపపన్నమగుచున్నదని భావము ॥ ౨౫ ॥

## మహావాక్యార్థ వివేచనము

ఇదానీముక్త ప్రకారేణ జీవస్య బ్రహ్మాత్వోపపాదకైస్తర్కైరను గృహీతం తత్త్వమస్యాదిమహావాక్యం జీవబ్రహ్మణోరత్యన్తాభేదం భాగత్యాగలక్షణయా బోధయతీత్యాహ —

ఉక్తప్రకారముచే అనేక యుక్తులద్వారా జీవుడు బ్రహ్మస్వ రూపుడేయని సిద్ధిజేసి,ఇప్పుడు శ్రుతితాత్పర్యముగూడ జీవబ్ర హ్మైక్యమునందే గలదని చెప్తూ,తత్త్వమస్యాది మహావాక్యములు భాగత్యాగ లక్షణాచేత జీవబ్రహ్మలకు అత్యంత అభేదమును ప్ర తిపాదించుచున్నవని,గ్రంథకర్తయగు శ్రీలక్ష్మీధర కవీంద్రులవారు తరువాతి శ్లోకముద్వారా బోధిస్తున్నారు.

**పరోక్షతాపరిచ్ఛేదశాబల్యాపోహనిర్మలమ్ ।**

**తదసీతిగిరా లక్ష్యమహామేకరసం మహః ॥ ౨౬ ॥**

**అన్వయః** :-(పరోక్షతాపరిచ్ఛేదశాబల్యాపోహ నిర్మలమ్) పరోక్షతాచ పరిచ్ఛేదః(తత్ ప్రయోజకమ్)శాబల్యమ్ చ(తేషామ్) అపోహేన నిర్మలమ్ (శుద్ధమ్ ఐక్య అవిరోధీ ఇత్యర్థః) తదసీతి గిరా లక్ష్యమ్ తత్త్వమస్యాది వాక్యేన లక్ష్యస్వరూపమ్ ఏవ ఆహ ఏకరసమ్ మహః (సచ్చిదానందరూపమ్ అహమ్ ప్రత్యగాత్మా అస్మి ఇత్యర్థః) ॥౨౬ ॥

**అన్వయార్థము:**-పరోక్షతా పరిచ్ఛేదశాబల్యాపోహనిర్మల మ్=క్రమముగా ఈశ్వరునియందు మరియు జీవునియందుగల పరోక్షతా మరియు పరిచ్ఛిన్నతాది విరోధిఅంశములను=ధర్మ ములను భాగత్యాగలక్షణాచేతబాధించి శుద్ధము;తదసీతి గిరా

లక్ష్యమ్=తత్త్వమసిమహావాక్యమునకులక్ష్యము;ఏకరసమ్=అ ఖండైకరసస్వరూపము;మహః=సదానందమయ చైతన్యమునే; అహమ్(అస్మి)=శుద్ధము,చిద్రూపుడనగుప్రత్యగాత్మనైయున్నాను.

**టీకా:**-పరోక్షతాచ పరిచ్ఛేదశ్చ తత్ప్రయోజకం శాబల్యం చ, తాని తథోక్తాని, తేషామపోహేన నిర్మలం పరోతాపరిచ్ఛేదశా బల్యాపోహనిర్మలమ్। పరోక్షతా=పరోక్షత్వమీశ్వరస్య,పరిచ్ఛేదః =పరిచ్ఛిన్నత్వంజీవస్య। ఏతద్ద్వయం చ జీవేశ్వరోభయగతవిరు ద్ధధర్మాణాముపలక్షణమ్। శాబల్యం జీవేశ్వరోభయగతపరోక్ష త్వపరిచ్ఛిన్నత్వాదిప్రయోజకమాయాన్తఃకరణరూపోపాధిద్వయని మిత్తసమస్తసంబన్ధః।తేషామపోహేన=త్యాగేన,నిర్మలం=శుద్ధమై క్యావిరోధీత్యర్థః।తదసీతిగిరా=తత్త్వమస్యాదిమహావాక్యేన లక్ష్యం జహదజహల్లక్షణయాబోధ్యమ్।లక్ష్యస్వరూపమేవాహ–ఏకరస మితి।మహః=సత్యానన్దచైతన్యరూపమహం ప్రత్యగాత్మాస్మీత్యర్థః।

ఈశ్వరుని విషయంలో పరోక్షతా భ్రాంతి మరియు జీవుని విషయంలో పరిచ్ఛిన్నతా భ్రాంతి-వీటికి కారణము శాబల్యము, అనగా మాయ మరియు అంతఃకరణరూపోపాధిజనిత సంబం ధము,యేదైతే పూర్వము చెప్పబడినదో,ఆ ఆధ్యాసిక సంబంధ మును మిథ్యాత్వనిశ్చయరూప బాధము గావించినచో, అవశిష్ఠ శుద్ధచైతన్యమేది గలదో,దానిని గ్రంథకర్త-శ్లోకంలోని పూర్వార్ధ ముచేత"పరోక్షతా పరిచ్ఛేద శాబల్యాపోహనిర్మలమ్"అని చెప్పి నాడు.శ్లోకములో చెప్పబడిన పరోక్షతా,పరిచ్ఛిన్నతా శబ్దముల చే తత్త్వమసి మహావాక్యములోని'తత్' పదవాచ్యము-ఈశ్వరు

నియందుగల ౧.పరోక్షత్వము,౨.సర్వజ్ఞత్వము, ౩.సర్వశక్తిమత్త్వము, ౪.వ్యాపకత్వము, ౫,ఏకత్వము, ౬.స్వాధీనత్వము, ౭.సమర్థత్వము, ౮.మాయా ఉపాధిత్వము-యీా ఎనిమిది ధర్మములు, మరియు 'త్వం' పదవాచ్యము-జీవునియందుగల ౧.అపరోక్షత్వము,౨.అల్పజ్ఞత్వము,౩,అల్పశక్తిమత్త్వము, ౪.పరిచ్ఛిన్నత్వము,౫.నానాత్వము,౬.పరాధీనత్వము,౭.అసమర్థత్వము మరియు ౮.అవిద్యా ఉపాధిత్యము-యీా ఎనిమిది ధర్మములను-ఉపలక్షణముగా గ్రహించవలెను.శాబల్యమనగా, జీవేశ్వరులలోనున్న పరోక్షతా,పరిచ్ఛిన్నతాదులకు ప్రయోజకము=కారణమైన మాయా,అంతఃకరణరూపోపాధుల నిమిత్తముచే ప్రాప్త సమస్త ఆధ్యాసికసంబంధములను తెలియవలెను. వాటిని-అనగా మాయ అంతఃకరణరూపోపాధికృత విరోధిఅంశములను భాగత్యాగలక్షణాచేత త్యాగముచేయుటచే యే నిర్మలము=శుద్ధచైతన్యము=తత్త్వమసి మహావాక్యముద్వారా తెలియదగిన జీవేశ్వరైక్యమునకు అవిరోధి లక్ష్యచైతన్యమున్నదో, దాని స్వరూపము శ్లోకములో'ఏకరసమ్','మహః'అను శబ్దములచే చెప్పబడినది. అనగా-స్వగత,సజాతీయ,విజాతీయభేదశూన్య,ఏకరస,సచ్చిదానంద ప్రత్యగభిన్నబ్రహ్మమే,అహమ్=నేను అని తాత్పర్యము.

అత్రాప్యనుగ్రాహకయుక్తిఃపూర్వవద్రష్టవ్యా।యద్యాత్మా బ్రహ్మభిన్నంస్యాదాత్మనః సర్వాన్తరత్వలక్షణమాత్మత్వం నస్యాత్,ఏవం బ్రహ్మాపి యద్యాత్మభిన్నం స్యాన్నిరతిశయమహత్త్వలక్షణం బ్రహ్మత్వంబ్రహ్మణో నస్యాత్। ఇదమపి తైరేవోక్తమ్–**"అద్వైతేఽర్థే ప్రత్య**

**గర్థోఽస్తితద్వత్ప్రత్యక్తత్త్వేచాద్వయస్యాపిభావఃయద్యప్యేవం నాతి రేవకావకాశఃపూర్ణేతత్త్వేతత్త్వమర్థోపపత్తేః**"(సం.శా.౧-౧౬౨)॥ ఇతి॥

ఈ విషయమునకు పుష్టినిచ్చు యుక్తిని పూర్వము వలెనే తెలిసికోవాలి.ఎట్లనగా,ఒకవేళ ఆత్మ-బ్రహ్మముకంటె భిన్నమగుచో,ఆత్మయందు సర్వాంతరత్వరూప ఆత్మత్వము సంభవించదు. అట్లే, ఒకవేళ బ్రహ్మము ఆత్మకంటె భిన్నమగుచో, బ్రహ్మమునకు నిరతిశయ మహత్వరూప బ్రహ్మత్వము సిద్ధించదు. ఎందుకంటె,యేది సర్వాంతముండదో-అది ఆత్మ కానేరదు.దేనికంటె భిన్నమగు వస్తువునకు సత్త=అస్తిత్వముండునో,అది బ్రహ్మము=వ్యాపకము కానేరదు.వస్తుపరిచ్ఛేదము గలదగును.ఈ విషయమునుగూడ శ్రీ సర్వజ్ఞాత్మ మునీంద్రులవారే చెప్పియున్నారు.

తత్పద లక్ష్యమగు బ్రహ్మమునందు త్వంపద లక్ష్యమగు ప్రత్యగాత్మ ఉన్నది. అట్లే, త్వం పద లక్ష్యమగు ప్రత్యగర్థమునందు అద్వైత బ్రహ్మభావము గలదు.వీటిలో లేశమాత్రముగూడ భేదమునకవకాశములేదు.కావున,ఏకము,పరిపూర్ణమునగు పరబ్రహ్మతత్త్వమునందు తత్ త్వం-పదముల అర్థము ఉపపన్నమగును.

వాచ్యార్థభేదాదేవోభయోస్తత్త్వంపదయోరపర్యాయతాపి। ఇదమపి తైరేవోక్తమ్–"**ఆదేయాంశేనాణుమాత్రాఽపిభేదో యద్యప్యేవం భిన్నమాదాయ శబ్దౌ। వర్తేతే త్వయ్యద్వయాత్మప్రకాశే బాహ్యాంహాతుం జామితానాస్తి తస్మాత్**"(సం.శా.౧-౧౬౧)ఇతి॥

తత్పద,త్వంపద వాచ్యార్థములలో భేదమున్నందున తత్త్వం పదములకు పర్యాయత్వము గాని,పునరుక్తిదోషముగాని లేదు. ఈ విషయమునుగూడ శ్రీ సర్వజ్ఞాత్మ మునీంద్రులవారే చెప్పి యున్నారు.తత్ మరియు త్వం- యీ రెండు పదములయొక్క లక్ష్యాంశములయందు అణుమాత్రమునూ భేదము లేదు.భిన్న ప్రవృత్తి నిమిత్తముగల పదములకు మాత్రము భేదముండును. కాని,తత్త్వం పదములకు సామానాధికరణ్యముచే అఖండార్థత్వ ము ఉపపన్నమగును."భిన్నప్రవృత్తినిమిత్తానాంశబ్దానాం ఏకస్మి న్నర్థే వృత్తిః సామానాధికరణ్యమ్".

ఇట్లు రెండు పదముల లక్ష్యము ఏకమేయైననూ వాచ్యార్థ ముల భేదమున్నది. కావున, పదములకు పర్యాయత్వముగాని, పునరుక్తి దోషముగాని లేదు. అందువలన, తత్త్వం పదములకు లక్ష్యమగు అద్వితీయ ప్రత్యగభిన్నపరబ్రహ్మచైతన్యస్వరూపుడవ గు నీయందు భేద అభావమున్నందున,బాహ్యా ఉపాధి-తద్ధర్మ ములను త్యాగముచేయుటలో ఏ విధమగు సంకోచము లేదు. అట్లే-సామానాధికరణ్య బలముచేత సత్, చిత్, ఆనందాది పదములకు గూడ పునరుక్తి దోషము రాదని తెలియాలి.

వాక్యార్థశ్చ సకలవేదార్థాభిజ్ఞేన బ్రహ్మణా బ్రహ్మగీతాయాం స్ఫుటో దర్శితః–**"త్వమహంశబ్దవాచ్యార్థస్యైవ దేహాదివస్తునః । న తచ్ఛబ్దార్థతాంవక్తి శ్రుతిస్తత్త్వమసీతి సా॥తదర్థైక్యవిరుద్ధాంశం త్యక్త్వా వాచ్యగతం శ్రుతిః । అవిరుద్ధం చిదాకారం లక్షయిత్వా బ్రవీతి హి॥ తదర్థే చ త్వమర్థైక్య విరుద్ధాంశం వినైవ తు। కారణ**

**త్వాదివాచ్యస్థం లక్షయిత్వా తు కేవలమ్॥ చిదాకారం పునస్తస్య త్వమర్థైక్యంబ్రవీతిచ। తత్త్వంశబ్దార్థలక్ష్యస్యచిన్మాత్రస్య పరాత్మనః ॥ఏకత్వం యత్స్వతఃసిద్ధం సహి వాక్యార్థ ఆస్తికాః"॥** (౫-౭౮నుండి ౮౨ వరకు) ఇతి॥

తత్త్వమసిమహావాక్యార్థమును బ్రహ్మగీతలలో సకల వేదార్థజ్ఞుడగు శ్రీబ్రహ్మదేవుడు స్పష్టముగా తెలియజేసినాడు.తత్త్వమసియను శ్రుతిలో త్వం లేదా అహం శబ్ద వాచ్యార్థమగు దేహాది పదార్థములను తత్ శబ్ద వాచ్యార్థముగా బోధించుటలేదు. తత్త్వం పదముల వాచ్యార్థములో జీవబ్రహ్మైక్యమునకు పరోక్షత్వ,పరిచ్ఛిన్నత్వాదివిరోధిఅంశములను జహదజహల్లక్షణాచే త్యాగముచేసి,వాటిలోని అవిరుద్ధ చిదాకారమగు లక్ష్యాంశము యొక్క ఐక్యమును'అసి'పద బలముచే శ్రుతిమాత బోధించుచున్నది. ఆస్తికులగు దేవగణములారా! తత్ మరియు త్వం పద లక్ష్యార్థమైన చిన్మాత్ర పరమాత్మయొక్క యే స్వతఃసిద్ధ ఏకత్వము గలదో అదియే మహావాక్యార్థమున్నది.

తస్మాచ్ఛ్రుత్యాయుక్త్యాబహుజ్ఞవచనాచ్చజీవస్య సచ్చిదానన్ద నిత్యశుద్ధబుద్ధముక్తబ్రహ్మస్వరూపతా సిద్ధేతి భావః ॥౨౬ ॥

కావున,శ్రుతి,యుక్తి,సర్వజ్ఞపురుషుల వచనములచే మరియు మహాత్ముల అనుభవముచే జీవునికి సచ్చిదానందరూప, నిత్య, శుద్ధ, బుద్ధ,ముక్త బ్రహ్మత్వము సిద్ధించినదనిభావము.

---

విశేషము:—**శ్లో॥మానాన్తరవిరోధే తు ముఖ్యార్థస్యాపరిగ్రహే।**

**ముఖ్యార్థేనాఽవినాభూతోప్రతీతిర్లక్షణేష్యతే॥**(వాక్యవృత్తి ४८)

వాచ్యార్థమును గ్రహించగా జీవబ్రహ్మలఏకత్వప్రతిపాదక శ్రుతిప్రమాణములకు విరోధముజనించగా ముఖ్యార్థముతో సంబంధించిన జ్ఞానమే లక్షణాయని చెప్పబడుచున్నది.ఇది లక్షణా యొక్క సామాన్యలక్షణము.

"లక్షణాబీజం తు తాత్పర్యానుపపత్తిరేవ న త్వన్వయానుపపత్తిః"। లక్షణాకు బీజము తాత్పర్యానుపపత్తియే యగును. కాని అన్వయానుపపత్తి కాదు.

"శక్యమనన్తర్భావ్య యత్ర అర్థాన్తరప్రతీతిస్తత్ర జహల్లక్షణా"। అత్ర"గంగాయాం ఘోషః ప్రతివసతి"ఇతి వాక్యవజ్జహల్లక్షణాపి న సంగచ్ఛతే। యథా వా "విషం భుంక్ష్వే"త్యత్ర స్వార్థంవిహాయ శతృగృహే భోజన నివృత్తిర్లక్ష్యతే॥

"ఎక్కడ శక్యార్థము పూర్తిగావిడువబడి అర్థాంతర(అన్యార్థ) ప్రతీతి=జ్ఞానము కలుగునో అక్కడ జహల్లక్షణా చెప్పబడును. "గంగలో గ్రామము(గొల్లపల్లె)" అను వాక్యమువలె 'తత్త్వమసి' మహావాక్యములో జహల్లక్షణా సంభవించదు."గంగలో గొల్లపల్లె". ఇచ్చట'గంగా'పదవాచ్యము పవిత్రమైన భాగీరథీ నదీప్రవాహము.ప్రవాహములో గ్రామమునకుఆధారాధేయభావము సంభవింపమిచే దానిని పూర్తిగా పరిత్యజించిన తత్సంబంధియగు తీరరూప అర్థము తెలియబడుచున్నది. వస్తుతః విచారించగా ప్రకృతస్థలములో శక్యార్థము సర్వథా పరిత్యజింపబడుట లేదు.

లక్ష్యములో శక్యముగూడ అంతర్భావమున్నది. ఏలననగా, 'గంగా'పదము గంగాతీరత్వేన 'తీరము' అను అర్థమును లక్ష ణాచేతబోధించుచున్నది.అప్పుడు,'గంగా'పదముయొక్క వాచ్యా ర్థము భాగీరథీ నదీప్రవాహముగూడ గంగాతీరత్వేన తీరరూప లక్ష్యార్థముతో కలిసి(గంగాతీరే గ్రామః అని) ప్రతీతమగుచున్న ది. అట్లగుచో, జహల్లక్షణా ఎట్లు పొసగును. అందుకే,

ఉదాహరణాంతరము:—"విషము తిను"ఈవాక్యములో శ క్యార్థమగు విషభక్షణము పూర్తిగా విడువబడి,"శతృవుల ఇండ్ల లో భోజనముచేయకూడదు"అను అర్థము జహల్లక్షణాచేత సం పన్నమగుచున్నది.ఎవరుగూడ తన ప్రియపరివారమును విష ము తినుటకు ప్రేరేపించరుగదా!అందుకని,శక్యార్థమును సర్వ థా పరిత్యజించి'శతృగృహమున భోజన నివృత్తి'యను తాత్పర్య మును లక్షణాచేత గ్రహించవలసి వచ్చింది. ఇందులో "విషం భుంక్ష్వ"శబ్దముయొక్క శక్యార్థము ఏమాత్రముగూడ ప్రతీతి య గుటలేదు.అందువలన,ఇది జహల్లక్షణాకు నిస్సందిగ్ధ విశుద్ధ ఉదాహరణంగా స్వీకరించబడినది. కావున,

శ్లో||తథా తత్త్వమసీత్యత్ర చైతన్యేకత్వలక్షణే|
వివక్షితే తు వాక్యార్థోఽపరోక్షత్వాదిలక్షణః||
శ్లో||విరుధ్యతే భాగమాత్రో న తు సర్వో విరుధ్యతే|
తస్మాజ్జహల్లక్షణాయాః ప్రవృత్తిర్నాత్ర యుజ్యతే||
(సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము ౭౩౦ & ౭౩౯)

అత్ర తు పరోక్షాపరోక్షచైతన్యైకత్వలక్షణస్య వాక్యార్థస్య భాగమాత్రే విరోధాద్భాగాన్తరమపి పరిత్యజ్యాన్య లక్షణాయా అయుక్తత్వాజ్జహల్లక్షణా న సంగచ్ఛతే।(వేదాన్తసారము)

జీవబ్రహ్మైక్యమును ప్రతిపాదించు"తత్త్వమసి" మహావాక్యములో తత్పదవాచ్యార్థము మాయోపాధిక పరోక్షత్వాదివిశిష్టచైతన్యము—ఈశ్వరుడు.త్వంపద వాచ్యార్థము అంతఃకరణము లేదా అవిద్యోపాధిక అపరోక్షత్వాదివిశిష్టచైతన్యము—జీవుడు. ఇచ్చట ఉపాధిసహిత పరోక్షత్వాపరోక్షత్వ అంశమునందు మాత్రమువిరోధమున్నది.చేతనాంశమునందు విరోధములేదు.ఒక వేళ జహల్లక్షణాను స్వీకరించినచో సంపూర్ణ వాక్యార్థమును పరిత్యజింపవలసివచ్చును.లక్షణా నిరర్థకమగును.నారికేళ ఫలము పైటెంకు కలినమున్నదని తలంచి ఆ టెంకాయను పారవైచినచో ప్రయోజనమేమియు దక్కకుండా పోతుంది.

శంక:—ఎట్లు'గంగా'పదము స్వార్థమును పరిత్యజించి తీరమును లక్షించునో,అట్లు తత్పదముయొక్క సంపూర్ణ వాచ్యార్థమును విడిచిపెట్టి త్వంపదార్థమునందు లక్షణాను స్వీకరించినచో,లేక త్వంపదార్థముయొక్క సంపూర్ణ వాచ్యార్థమును వదిలేసి తత్పదార్థమునందు లక్షణాను స్వీకరించినచో, మహావాక్యార్థమునందువిరోధపరిహారమగును.కావున,మహావాక్యమునందు జహల్లక్షణా సంభవించును.అలాంటప్పుడు ప్రకారాంతరముచే జహదజహల్లక్షణాయొక్క ఆవశ్యకత యేమున్నది?

అది సరిగాదు.ఎందుకంటే,ఏ పదముయొక్క అభిధాశక్తి ద్వారా వివక్షితార్థబోధకలుగుటలేదో,లక్ష్యపదార్థమునుతెలుపు పదము అశ్రుతముండునో,అచ్చట లక్షణా ప్రవృత్తమగును."గంగాయాం ఘోషః ప్రతివసతి"ఈవాక్యములో తీరపదము వినబడుట లేదు.కనుక,తీరరూప అర్థప్రతీతి అగుటలేదు. అందుకోసం జహల్లక్షణా అపేక్షితమున్నది.కాని,"తత్త్వమసి" మహావాక్యార్థమునందు తత్పదము మరియు త్వంపదము రెండును విద్యమానమున్నందున,అభిధాశక్తిద్వారా రెంటియొక్క అర్థబోధ కలుగుచున్నందున, ఒకపదమునకు అన్యపదార్థమునందు లక్షణా స్వీకరించుట కుదురదు.

"శోణోధావతి"ఇతి వాక్యవద్ అజహల్లక్షణాపి న సంభవతి।అత్ర తు పరోక్షాపరోక్షచైతన్యైకత్వస్య వాక్యార్థస్య విరుద్ధత్వాత్ తదపరిత్యాగేన తత్సంబంధినో యస్య కస్యచిదర్థస్య లక్షితత్వేఽపి తద్విరోధపరిహారాసంభవాదజహల్లక్షణా న సంభవత్యేవ।

"ఎరుపు పరుగెత్తుచున్నది"ఈవాక్యంలో వలె అజహల్లక్షణా గూడ అభీప్సితార్థమును తెలుపుటకు సమర్థము కాజాలదు. ఎందుకంటే,ఎరుపువర్ణము గుణమున్నది.దానియందు పరుగెత్తుటయను క్రియ సంభవించదు.ద్రవ్యమే క్రియకు ఆశ్రయము కాగలదు."గుణ క్రియాశ్రయత్వం ద్రవ్యత్వమ్".అందువలన అద్రవ్యమగు శోణగుణమునందుఏప్రకారముచేగూడ పరుగెత్తుట అసంభవము.శోణపదముయొక్క ముఖ్యార్థము బాధింపబడుచున్న

ది.ఒకవేళ లక్షణాద్వారాశోణపదవాచ్యమగు ఎరుపు గుణము ను విడువకుండా,దానికి ఆశ్రయమగు అశ్వాదులను గ్రహించిన చో ముఖ్యార్థమునకు విరోధము ఘటిల్లదు.కావున, శోణపద వాచ్యర్థమును పరిత్యజింపనందున ఇచ్చట అజహల్లక్షణా సంగ తమగుచున్నది. కాని,

"తత్త్వమసి" మహావాక్యంలో అజహల్లక్షణా సంభవించదు. ఎందుకనగా,ఎంతవరకు పరోక్షత్వాపరోక్షత్వరూప విరుద్ధాం శములు పరిత్యజింపబడవో,అంతవరకు మహావాక్యముయొక్క వాచ్యార్థరూప పరోక్షత్వాపరోక్షత్వాదివిశిష్టచైతన్యములకు వివ క్షిత ఐక్యము సిద్ధింపదు.విరుద్ధాంశములములను పరిత్యజింప కుండా,దానికి సంబంధించిన ఏదో ఒక అన్యార్థమును అజహ ల్లక్షణాద్వారా కల్పించిననూ విరోధపరిహారమసంభవమగును. అలాంటప్పుడు అజహల్లక్షణాను ఆశ్రయించుట వ్యర్థమగును.

శ్లో||తత్పదం త్వంపదం వాఽపి స్వకీయార్థవిరోధినమ్।
అంశం సమ్యక్పరిత్యజ్య స్వావిరుద్ధాంశసంయుతమ్||
శ్లో||తదర్థంవా త్వమర్థంవా సమ్యగ్లక్షయతః స్వయమ్।
భాగలక్షణయా సాధ్యం కిమస్తీతి న శంక్యతామ్||
(సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము ౧౪౮ & ౧౪౯)

శంక:—తత్పదము తన వాచ్యార్థమునకు విరుద్ధాంశము ను(అనగా త్వంపదవాచ్యార్థమునకువిరుద్ధాంశమును)పరిత్యా గముచేసి,అవశిష్ట అవిరుద్ధచైతన్యాంశ సహితముగా త్వంపద

వాచ్యార్థమును అజహల్లక్షణాద్వారా లక్షించును.అథవా త్వంపదము తన వాచ్యార్థమునకు విరుద్ధాంశమును (అనగా తత్పద వాచ్యార్థమునకు విరుద్ధాంశమును)పరిత్యాగముచేసి,అవశిష్ట అవిరుద్ధచైతన్యాంశ సహితముగా తత్పదవాచ్యార్థమును అజహల్లక్షణాద్వారా లక్షించును.అట్లగుచో ప్రకారాంతరముచే భాగలక్షణాను ఎందుకు స్వీకరించాలి?

సమాధానము:—ఉపరోక్త కథనము సమీచీనము కాదు. ఎందుకనగా,శబ్దముయొక్క స్వభావమిది యగును–"శబ్దబుద్ధి కర్మణాం విరమ్య వ్యాపారాభావః"శబ్దము,జ్ఞానము,కర్మ-ఇవి ఒకసారి తనయొక్క ఒక వ్యాపారమునుండి విరమించినమీదట మళ్లీ అదే వ్యాపారముచేత అర్థాన్తర ఉపస్థాపకము కాజాలదు. ఉదా:—"గంగాయాం ఘోషః"ఈవాక్యంలో గంగా శబ్దము తన అభిధా వ్యాపారముచే(వృత్తిచే) ఒకసారి ప్రవాహవిశేషమును బోధించి విరమించిన పిమ్మట,మళ్లీ అదే అభిధా వ్యాపారముచే తీరాది అన్యార్థ బోధకము కాజాలదు. అట్లే ఏదేని శబ్దము తన అభిధా లేక లక్షణావృత్తిచే తన అర్థాన్ని బోధించి విరమించిన పిమ్మట అదే వ్యాపారముచేత అన్యార్థ బోధకము కాజాలదు. ఇట్టి స్థితిలో తత్పదముగాని త్వంపదముగాని లక్షణాద్వారా ఎప్పుడైతే చైతన్యాంశమును లక్షితముజేయునో,మళ్లీ ఆ పదము అన్యపదార్థముయొక్క వాచ్యార్థమును లక్షితమొనర్చుట అసంభవము."సకృచ్ఛృతస్యైకస్య పదస్య యుగపదుభయలక్షక

త్వాసంభవాత్"ఒకసారి వినబడిన పదము ఒక్కసారిగా రెండ ర్థములను లక్షితము గావింపదు.

అభిప్రాయము:—"తత్త్వమసి"మహావాక్యములో అజహల్లక్ష ణాయొక్క అసంగతియందు రెండు హేతువులు గలవు.౧)ఒకే పదము తన వాచ్యార్థముయొక్క ఏకాంశమును(అవిరుద్ధ చైత న్యాంశమును)గూడ లక్షించును.మరియు రెండవ పదముయొ క్క వాచ్యార్థమునుగూడ లక్షితమొనర్చును—ఇది అసంభవము. ౨)తత్పదముగాని త్వంపదముగాని ఉభయసామాన్య చైతన్యాం శమును లక్షణాచేత తెలియజేయవచ్చును.కాని,రెండవ పదము యొక్క వాచ్యార్థమును లక్షితమొనర్చుటయందు ఏవిధమైన అపేక్ష లేదు.ద్వితీయ పదము శ్రుతము(విద్యమానము)న్నందున, దాని వాచ్యార్థము అభిధాశక్తిద్వారానే తెలియబడుచున్నది. కా వున,పునః లక్షణాద్వారా దాని ప్రతీతికొఱకు ఎటువంటి అపేక్ష యును లేదు.

ఇక,పరిశేషన్యాయముచే మహావాక్యముయొక్క తాత్పర్య ము(వివక్షితార్థము)అగు అఖండార్థబోధయందు భాగత్యాగలక్ష ణాయే ఉపయుక్తమున్నది.

శ్లో।।భాగం విరుద్ధం సంత్యజ్యావిరుద్ధో లక్ష్యతే యదా।

సా భాగలక్షణేత్యాహుర్లక్షణజ్ఞావిచక్షణాః।। (స.వే.సి.సా.సం. ౭౩౪) ఎక్కడ విరోధిభాగము వదిలివేయబడి అవిరోధిభాగము గ్రహించుటగలదో,అక్కడ భాగత్యాగలక్షణా ప్రవర్తించునని లక్ష

ణాను యెఱిగిన పండితులు చెప్పుచున్నారు.

తస్మాద్యథా "సోఽయం దేవదత్తః" ఇతివాక్యం తదర్థోవా తత్కాలైతత్కాలవిశిష్టదేవదత్తలక్షణస్య వాక్యార్థస్యాంశే విరోధా ద్విరుద్ధ తత్కాలైతత్కాలవిశిష్టాంశం పరిత్యజ్య అవిరుద్ధం దేవద త్తాంశమాత్రం లక్షయతి.

ఎట్లు,"ఇతడు ఆ దేవదత్తుడే"అను వాక్యము లేక వాక్యార్థ ము విరుద్ధమగు తత్కాలైతత్కాలవిశిష్టాంశమును పరిత్యజించి అవిరుద్ధమగు దేవదత్తాంశము(దేహ)మాత్రమును లక్షించునో, అట్లే–

శ్లో॥తథా తత్త్వమసీత్యత్ర వాక్యం వాక్యార్థ ఏవ వా।
పరోక్షత్వాపరోక్షత్వాదివిశిష్టచితోర్ద్వయోః॥

శ్లో॥ఏకత్వరూప వాక్యార్థ విరుద్ధాంశముపస్థితమ్।
పరోక్షత్వాపరోక్షత్వ సర్వజ్ఞత్వాదిలక్షణమ్॥

శ్లో॥బుద్ధ్యాదిస్థూలపర్యన్తమావిద్యకమనాత్మకమ్।
పరిత్యజ్యావిరుద్ధాంశం శుద్ధచైతన్యలక్షణమ్॥

శ్లో॥వస్తుకేవలసన్మాత్రం నిర్వికల్పం నిరఞ్జనమ్।
లక్షయత్యనయా సమ్యగ్ భాగలక్షణయా తతః॥

(సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము ౭౫౭–౭౬౦)

"తత్త్వమసి"యను మహావాక్యమునందుగూడ భాగత్యాగల క్షణాచేత విరుద్ధాంశములగు పరోక్షత్వ అపరోక్షత్వ, సర్వజ్ఞత్వ

అల్పజ్ఞత్వాద్యనాత్మ ధర్మములను పూర్తిగా పరిత్యజించి, అవిరు ద్ధమగు చైతన్యమాత్రమును గ్రహించినచో,మాయాకల్పిత సకల ప్రపంచధర్మవర్జిత సచ్చిదానందాత్మకమగు కేవల నిర్గుణ పరబ్ర హ్మము అవశిష్టమై యుండును. సంసారదశయందు జీవునకు అంతఃకరణోపాధి సంబంధమును,ఈశ్వరునికి మాయోపాధి సంబంధమును ఉండుటవలన జీవేశ్వరులకు విరోధము భాసిం చుచున్నది.ఇక తత్త్వమసీత్యాది మహావాక్యవిచారముచే కలుగు బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచే అంతఃకరణము,మాయయను ఉపా ధిద్వయము విలయముకాగా తత్సంబంధ నిమిత్తకమగు మిథ్యా జీవేశ్వరభేదమును నశించును.

**ఉపసంహారము**

ఇదానీముక్తస్వరూపం బ్రహ్మాత్మత్వేన సాక్షాత్కృతవత పురు షస్య స్వప్రకాశాపరిమితానన్దబ్రహ్మాత్మతావస్థానలక్షణా విదేహ ముక్తిః,ప్రారబ్ధకర్మక్షయపర్యంతం దేహేన్ద్రియాదిప్రతిభాససహితా తాదృగ్ బ్రహ్మాత్మతావస్థానలక్షణా జీవన్ముక్తిశ్చ ఫలమిత్యభిప్రేత్య ప్రకరణముపసంహరతి —

పైన చెప్పబడిన బ్రహ్మస్వరూపమును స్వాత్మస్వరూపముగా సాక్షాత్కరించుకొన్న పురుషునికి స్వప్రకాశ అపరిమిత ఆనంద స్వరూప బ్రహ్మభావముచే స్థితిరూప 'విదేహముక్తి' మరియు ప్రారబ్ధకర్మ క్షయపర్యంతము దేహేంద్రియాది ప్రతిభాససహిత ముగ దృఢాపరోక్షానుభవపూర్వక బ్రహ్మభావముచే అవస్థాన

రూప 'జీవన్ముక్తి'యను ఫలము ప్రాప్తమవుతుంది-అని ఈ అభిప్రాయముతో ప్రకరణ గ్రంథమును ఉత్తర శ్లోకముద్వారా ఉపసంహారము చేయుచున్నాడు.

**ఉపశాన్తజగజ్జీవశిష్యాచార్యేశ్వరభ్రమమ్ ।**

**స్వతఃసిద్ధమనాద్యన్తం పరిపూర్ణమహం మహః ॥౨౮ ॥**

**అన్వయః**:-స్వతః సిద్ధమ్(స్వప్రకాశమ్)అనాద్యన్తమ్ పరిపూర్ణమ్(బ్రహ్మణి)జగత్ జీవ-శిష్య-ఆచార్య-ఈశ్వర భ్రమమ్ ఉప-శాన్తఃమహః(ఉపశాన్తమ్ తేజః)అహమ్(అస్మి ఇత్యర్థః)॥౨౮ ॥

అహమ్=శోధిత త్వంపద లక్ష్యార్థరూప ప్రత్యగాత్మనగు నేను;ఉపశాంతజగజ్జీవశిష్యాచార్యేశ్వరభ్రమమ్=దేనియందు జగత్తు,జీవుడు,శిష్యుడు,ఆచార్యుడు మరియు ఈశ్వరుడను భేద భ్రమనివృత్తమైనదో,ఆ;స్వతఃసిద్ధమ్=స్వప్రకాశరూప;అనాద్యంతమ్=ఆద్యంతరహితము,మరియు;పరిపూర్ణమ్=సర్వాత్మరూపమైన;మహః=తేజస్సునైయున్నాను.

**టీకా**:-ఉపశాన్తో జీవన్ముక్త్యవస్థాయాం బాధితో, విదేహ ముక్త్యవస్థాయాం సర్వాత్మనా నివృత్తో జగజ్జీవశిష్యాచార్యేశ్వర లక్షణో భ్రమో యస్మిస్తత్తాదృశమ్। ముక్తిద్వయస్య జ్ఞానఫలత్వం సర్వజ్ఞాత్మమునిభిరప్యుక్తమ్–"**జీవన్ముక్తిస్తావదస్తిప్రతీతేర్ద్వైతచ్ఛాయా తత్ర చాస్తి ప్రతీతేః । ద్వైచ్ఛాయారక్షణాయాస్తి లేశస్తస్మిన్నర్థే స్వానుభూతిఃప్రమాణమ్**"॥(సం.శా.౪-౪౩)॥"**తస్మాజ్జీవన్ముక్తిరూపే**

**ఽవిద్యావానారబ్ధానాంకర్మణాంభోగసిద్ధ్యై।స్థిత్వాభోగంధ్వాన్తగన్ధం ప్రసూతం భుక్త్వాత్యన్తం యాతి కైవల్యమన్తే"**(సం.శా.౪-౪౫)ఇతి॥

యెవరియందు జగత్తు, జీవ,శిష్య,ఆచార్య మరియు ఈశ్వ రాది భేదభిన్న సకల భ్రాంతులు జీవన్ముక్త్యవస్థయందు యోగ్య రీతిచే బాధితములైనవో,మరియు విదేహముక్త్యవస్థయందు 'సంపూర్ణముగా నివృత్తములైనవో,అట్టి సర్వాధిష్ఠాన బ్రహ్మస్వ రూపుడగుతత్త్వజ్ఞుడు ఉపశాంతుడనబడును.జీవన్ముక్తి మరియు విదేహముక్తి జీవబ్రహ్మైక్య జ్ఞానమునకు ఫలము.ఈరీతిచే ఆ ద్యంతరహితము,పరిపూర్ణము,సర్వాత్మకము అనగా త్రివిధ పరి చ్ఛేదశూన్యమునగు స్వప్రకాశ స్వరూపభూతపరమాత్మను నేను న్నాను.ఈ సిద్ధాంతమును శ్రీసర్వజ్ఞాత్మ మునీంద్రులవారు సంక్షే పశారీరకములో రెండు శ్లోకములచే చెప్పియున్నారు.

బ్రహ్మజ్ఞానముచే బాధితమైన అవిద్యయొక్క పునరుజ్జీవన ముగాని లేక ప్రతీతియగుటగాని యుక్తివిరుద్ధము-అనుశంకకు సమాధానముగా శ్లోకము(సం.శా.౪-౪౩)నుచెప్పుచున్నాడు.దృఢా పరోక్ష బ్రహ్మజ్ఞానానంతరముగూడ బ్రహ్మవేత్తకు అవిద్యా కా ర్యము దేహాదిక ప్రపంచముయొక్క ప్రతీతిబలముచే జీవన్ముక్త్య వస్థయందు మేము అవిద్యా లేశమును స్వీకరిస్తున్నాము. ఇం దులో స్వానుభవమే ప్రమాణముగా నున్నది.

"కథం హ్యేకస్య స్వహృదయప్రత్యయం బ్రహ్మవేదనం దేహ ధారణం చాపరేణ ప్రతిక్షేప్తుం శక్యేత?శ్రుతిస్మృతిషు చ స్థితప్రజ్ఞ

లక్షణనిర్దేశేనైతదేవ నిరుచ్యతే ॥''(బ్ర.సూ.౪-౧-౧౫)

అవిద్యాలేశమును స్వీకరించకుండా అవిద్యాకార్యమగు దేహాదిక ప్రపంచముయొక్క ప్రతీతి అనుపపన్నమగును. అందుకని, అవిద్యాలేశమును అవశ్యముగా స్వీకరించదగును.

శంక:-ముక్త్యవస్థలోగూడ మీరుఅవిద్యాలేశమును స్వీకరించినచో సంసారావస్థకు మరియు ముక్త్యవస్థకు భేదమేమిటి?

సమాధానము:-సంసారావస్థలో అవిద్యా తత్కార్యముయొక్క ప్రతిభాస యేది గలదో,అది అనర్థ హేతువున్నది.అనగా దుఃఖమునకు కారణమున్నది. మరియు జ్ఞానికి బాధితానువృత్తిచే స్వప్నమువలె ప్రతిభాసమాత్రముగనుండును.కాని,దానిలో భర్జితబీజములవలె=వేయించిన గింజలవలె కార్యక్షమత ఉండదు. అనగా పుణ్యపాపములను ఉత్పన్నముజేసి పునర్జన్మకు హేతువుకాజాలదు.ఇట్లు సాంసారావస్థ మరియు జీవన్ముక్త్యవస్థకు గొప్ప అంతరమున్నది.

శంక:-బోధోత్పత్యనంతరముగూడ అవిద్యాలేశముచే భోగము సంభవిస్తుంది.అట్లైన,దేహాంతర ప్రాప్తిగూడ సంభావ్యమగును?

సమాధానము:-(సం.శా.౪-౪౫ అనుసారము)అజ్ఞానంతుచ్ఛాఽప్యసతీకాలత్రయేఽపి పామరాణాంవాస్తవీ చ సత్త్వబుద్ధిర్లౌకికానామిదమిత్థమిత్యనిర్వచనీయా, వక్తుం న శక్యతే ॥(సర్వసారోప)

తుచ్ఛాఽనిర్వచనీయా చ వాస్తవీ చేత్యసౌ త్రిధా ।

జ్ఞేయా త్రిభిరోద్ధై శ్రౌతయౌక్తికలౌకికైః ॥ (వే.పం.౬-౧౩౦)

శ్లో॥శాస్త్రేణనశ్యేత్పరమార్థబుద్ధిః,కార్యక్షమానశ్యతిచాపరోక్షాత్

ప్రారబ్ధనాశాత్ప్రతిభాసనాశో,హ్యేవంత్రిధానశ్యతిచాత్మమాయా॥

(పరా.౭-౬౯)పారమార్థికము,వ్యావహారికము,ప్రాతిభాసికమను మూడు విధములుగా జగత్ప్రతీతి యేది గలదో,అందులో—

౧.ఉత్తర మీమాంస=వేదాన్తశాస్త్రముయొక్క అభ్యాసమువలన కార్యసహిత మాయయందు పూర్వము అజ్ఞానకాలంలో యే పరమార్థ బుద్ధి(త్రైకాలిక అబాధ్యత్వ జ్ఞానము)ఉండెనో, అది నష్టమై (అనిర్వచనీయము)వ్యావహారికమున్నదను బుద్ధికలుగును.[అనగా,ఎట్లు నిద్రనుండి ఉత్థానమగుటకు పూర్వము(స్వప్న కాలంలో)స్వప్నద్రష్టకు ఘటాదిపదార్థములయందు అర్థక్రియాకారిత్వము(సఫలక్రియా జనకత్వము లేదా వ్యవహార సామర్థ్యము లేదా కార్యక్షమత)ప్రతీతియగునో,అట్లే,అపరోక్షజ్ఞానము కలుగుటకుపూర్వము శాస్త్రాభ్యాసముచే(మిథ్య)అనిర్వచనీయముగా తెలియబడినపదార్థములయందుగూడ"మిథ్యాఘటముచే మిథ్యాజలముయొక్క ఆనయనరూపవ్యవహారము జరుగుచున్నది. మిథ్యా పుణ్యపాపములచే మిథ్యా స్వర్గనరకములు ప్రాప్తమగును" —అను ఈవిధమైన సఫలక్రియా జనకత్వము (అర్థక్రియాకారిత్వము=వ్యావహారికత్వము) ప్రతీతమగును]

౨.అనిర్వచనీయమున్నందున వ్యావహారికముగా తెలియబడిన మాయయొక్కకార్యక్షమత(అర్థక్రియాకారిత్వ)బుద్ధియేది గల

దో,అది అద్వైతతత్త్వముయొక్కఅపరోక్షజ్ఞానముచే నష్టమగును. అప్పుడు,దర్పణములో కనుపించు ముఖప్రతిబింబము మిథ్యయ ని తెలిసిన మీదటను దర్పణసన్నిధిరూపఉపాధి ఉన్నంతవరకు **బాధితానువృత్తిచే** ప్రతిబింబముయొక్కప్రతిభాస కలుగునట్లు కా ర్యసహిత మాయయొక్క ***ప్రతిభాస***(ప్రాతిభాసికత్వము)దేహపా తపర్యన్తము జ్ఞానికిగూడ కలుగుచుండును.

3.జీవన్ముక్తునికి"అహంబ్రహ్మాస్మి"(బృ.1-4-10)యను దృఢాప రోక్షజ్ఞానము కలిగిన తరువాతగూడ దేహాదిక ప్రపంచసహిత మాయయొక్క ప్రతిభాస యేదిగలదో, అది-ధ్వాంతము అనగా అజ్ఞానము,దానియొక్క గంధము అనగా లేశముచే సుఖదుఃఖ రూప ప్రారబ్ధము భోగముచే నష్టమైన వెంటనే విదేహకైవల్య ము నొందును."తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్య"ఇతి (ఛాం.౬-౧౪-౨)ఈక్రమముచే ఆత్మమాయ(అజ్ఞా నము) మూ డువిధములుగా నశించును.

ఈ విషయంలో శ్రీ వ్యాసభగవంతుడు ఇట్లు అనుగ్రహించి యున్నాడు.

జ్ఞానికి పాపముయొక్క సంస్పర్శ గలదా?లేదా?అను శంకకు సమాధానముగా —

తదధిగమే ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశా త్ ॥ (బ్ర.సూ.౪-౧-౧౩) ఉత్తరము అనగా జ్ఞానోత్తరకాలములో దేహాదులచే ఉత్పన్నమగు పాపము అంటదు.పూర్వము అనగా

జ్ఞానోత్పత్తికంటె పూర్వము ఈ జన్మలోగాని, జన్మాంతరముల లోగాని సంచయము చేయబడిన(సంచిత)పాపము తత్త్వజ్ఞానముచే నశించును."యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంత ఏవమేవంవిది పాపం కర్మ న శ్లిష్యతే" (ఛాం.౪-౧౪-౩); "తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేత ఏవమేవꣳ హాస్య సర్వే పాప్మానఃప్రదూయన్తే"(ఛాం.౫-౨౪-౩)ఇత్యాది శ్రుతులు జ్ఞానియొక్క ఉత్తర పూర్వాఘముల(పాపముల) అశ్లేష వినాశములను ప్రతిపాదించుచున్నవి.

తత్త్వజ్ఞాని పుణ్యముచే అంటబడునా?లేదా?అను శంకకు సమాధానముగా —

"ఇతరస్యాప్యేవమసంశ్లేషః పాతే తు" (బ్ర.సూ.౪-౧-౧౪) పూర్వోత్తర పుణ్యముగూడ పూర్వోత్తర పాపమువలనే అసంబంధమును మరియు వినాశమును పొందును.బ్రహ్మవిదునికి జన్మహేతువులగు పుణ్యపాపముల అభావముచే అవశ్యముగా ముక్తినొందునని భావము.

బ్రహ్మజ్ఞానియొక్క ప్రారబ్ధ పుణ్యపాపములు నష్టమౌతాయా?లేదా?అను శంకకు సమాధానముగా —

"అనారబ్ధకార్యేఏవ తు పూర్వే తదవధేః" (బ్ర.సూ.౪-౧-౧౫) వేటియొక్క ఫలము ఆరంభించబడలేదో,అట్టి సంచితపుణ్యపాపములు తత్త్వజ్ఞానముచే నష్టమగును. ప్రారబ్ధకర్మ మాత్రము నాశనము కాదు.ఎందుకనగా,"తస్య తావదేవ చిరం యావన్న వి

మోక్ష్యేఽథ సంపత్స్యే" (ఛాం.౬-౧౪-౨).ఇట్లు దేహపాతముయొక్క అవధి చెప్పబడినందు వలన.

ఇట్లు,ముక్తపురుషుడు కూటస్థాత్మరూపముచే ఉండిపోవును.పునర్జన్మ సంభవించదు.ఎందుకనగా,సంచితకర్మ జ్ఞానముచే నష్టమైనది.ప్రారబ్ధము భోగముచే నష్టమైనది.ఆగామి కర్మలు అంటవు.ఇక పునర్జన్మనిచ్చు కర్మాభావమైనందున విద్వత్పురుషునికి కైవల్య ప్రాప్తికి ఏవిధమైన ప్రతిబంధకము లేదు.

స్వతఃసిద్ధం స్వప్రకాశమ్,అనాద్యన్తమాద్యన్తరహితమ్, పరిపూర్ణం=సర్వాత్మకమ్=త్రివిధపరిచ్ఛేదశూన్యమిత్యర్థః। మహాస్తేజోఽహమస్మీత్యర్థః ౨౭ ॥॥

ఇట్లు,స్వప్రకాశము,ఆద్యంతరహితము,త్రివిధపరిచ్ఛేదశూన్యమునగు సర్వాత్మక జ్ఞానస్వరూపుడను నేనున్నాను.

## గ్రంథావగాహన ప్రార్థన

ఇదానీముపనిషదర్థసారసంగ్రహాత్మకే స్వరచితే ప్రకరణే విదుషాం ప్రవృత్తిం ప్రార్థయతే।

ఇప్పుడు ఉపనిషదర్థ సారసంగ్రహాత్మక స్వరచిత ప్రకరణమునందు విద్వాంసులయొక్కప్రవృత్తికొఱకు ప్రార్థించుచున్నాడు.

**లక్ష్మీధరకవేః సూక్తిశరదమ్భోజసమ్భృతః ।**

**అద్వైతమకరన్దోఽయం విద్వద్భృఙ్గైర్నిపీయతామ్ ॥౨౮ ॥**

**అన్వయః**:-లక్ష్మీధర కవేః సూక్తి(సూక్తయఃఏవ) శరదమ్భోజ

సమ్భృతః(సంపన్నః)అయమ్ అద్వైతమకరరన్దః (అద్వైత బ్రహ్మైవ మకరన్దః=రసః)విద్వత్ భృఙ్గైః నిపీయతామ్(పునఃపునః సేవ్య తామ్)॥౨౮ ॥

**అన్వయార్థము:-**లక్ష్మీధరకవేః=లక్ష్మీధరుడను పేరుగల కవి యొక్క;సూక్తి శరదంభోజ సంభృతం=సూక్తిరూప శరత్కాలపు కమలపుష్పములలో నిండి ఉన్నటువంటి;అయమ్=ఈ;అద్వైత మకరందః=అద్వైతమకరందము;విద్వద్భృంగైః=విద్వాంసులు-అను తుమ్మెదలద్వారా;నిపీయతామ్=సేవించబడవలెను(విద్వత్పు రుషులే సేవిచదగినది).

**టీకా:-**లక్ష్మీధర ఇతి గ్రన్థకర్తుర్నామ,స చాసౌ కవిః=క్రాన్త దర్శీ=సర్వజ్ఞస్తస్య సూక్తయ ఏవ శరదమ్భోజాని తేషు సంభృతః సంపన్నోఽయం సర్వైరనుభూయమానోఽద్వైతమకరన్దః అద్వై-తబ్రహ్మైవ మకరన్దో=రసః । **"ఏతమేవ రసం సాక్షాల్లబ్ధ్వా దేహీ సనాతనః । సుఖీ భవతి సర్వత్ర నాన్యథా సురపుంగవాః"** ॥ ఇతి బ్రహ్మగీతావచనాత్।(౩-౪౭)

'లక్ష్మీధరః' అనునది గ్రంథకర్తయొక్క నామధేయము. కవిః అనగా క్రాంతదర్శి=సర్వజ్ఞుడని యర్థము.ఆయనయొక్క సుంద రమైన ఉక్తులు అనగా మాటలే శరత్కాలపు కలములు. అవి, సర్వులకు అనుభవగోచరమగు అద్వైతబ్రహ్మరూప మకరంద ము=తేనియలతో సంపూర్ణముగా నిండియున్నవి. అద్వైతబ్రహ్మ మే రసస్వరూపమున్నదని శ్రుతిలో చెప్పబడినది. "రసో వై సః

రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽ నందీ భవతి"(తై.౨-౭), మరియు బ్రహ్మగీతలలోగూడ ఇట్లు చెప్పబడినది.

ఓసురశ్రేష్ఠులారా!అధికారులగు దేహధారులు యీ సనా తన అద్వైతబ్రహ్మరూప రసమును అభేదరూపముచే సాక్షాత్క రించుకొని,సర్వత్ర సుఖము నొందుచున్నారు. బ్రహ్మానందరూప రసముకంటె అన్యమగు ఆనందమును ముల్లోకములలో యే ఉపాయముచేకూడ పొంది జీవులు ఆనందితులగుట లేదు."ఏ ష హ్యేవానందయతి"(తై.౨-౭)పరమాత్మయే సర్వులను ఆనంది తులను జేయుచున్నాడు."ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి"(బృ.౪-౩-౩౨)ఈ బ్రహ్మానందముయొక్క లేశ మాత్రముచేతనే సకలప్రాణులు జీవించుచున్నారు, ఆనందము ను పొందుచున్నారు.

విద్వద్భృంగైః,విద్వాంస ఏవ భృఙ్గా బ్రహ్మరసజ్ఞాస్తైర్నిపీయ- తాం నితరామాత్మాజ్ఞాననివృత్తిపర్యంన్తం పునఃపునః సేవ్యతామ్, **"విచార్యాప్యపరోక్షేణ బ్రహ్మాత్మానం నవేత్తి చేత్। అపరోక్షావ సానత్వాద్భూయో భూయో విచారయేత్"**॥(వే.పం.౯-౩౨)ఇతి శ్రీ భారతీతీర్థవచనాత్ ।

విద్వద్భృంగములు=తత్త్వజ్ఞులే ఈ బ్రహ్మానందరసమును గ్రో లు అధికారి రసిక భ్రమరగణము. వారి ద్వారానే యీ అద్వైత మకరందము నిపీయతామ్=సంసార కారణమగు అజ్ఞానము యొక్క అత్యంత నివృత్తిపర్యంతము పునః పునః సేవించదగిన

ది.ఈ విషయము శ్రీ భారతీతీర్థులవారి వచనముచే సిద్ధించు చున్నది—ఒకవేళ అనేకమార్లు విచారము చేసిననూ అపరోక్ష బ్రహ్మరూపముచే ఆత్మ తెలియబడనిచో, బ్రహ్మాత్మైక్య జ్ఞానము కలుగనిచో, దృఢాపరోక్ష సాక్షాత్కారము కలుగునంతవరకు మళ్ళీ మళ్ళీ విచారము చేయవలెను.

యద్యప్యత్ర ప్రతిశ్లోకం బహు వక్తవ్యమస్తి, తథాపి మన్ద బుద్ధీనామలసానాం వ్యుత్పాదనార్థం ప్రవృత్తేన మయా గ్రన్థ-కాఠిన్య గౌరవభయాదుపరతమితి ॥౨౮॥

యద్యపి ఈ గ్రంథముయొక్క ఒక్కొక్కశ్లోకముపై యెంతైన ను విచారము చేయవచ్చును=వ్యాఖ్యానము చేయవచ్చును. అయినను-మందబుద్దులు,సోమరులగువారికి అద్వైతతత్త్వమును సంక్షేపముగా తెలియజేసి,ఆత్మవిచారమార్గములో ప్రవేశింప జేయు ఉద్దేశముతో,నాచేత ప్రవృత్తమైన యీ 'రసాభివ్యంజిక' యను టీకను,అధికముగా వ్యాఖ్యానించినచో కఠినమౌతుంద ని మరియు విస్తారభయముచే ఇంతటితో ఉపసంహరించుచు న్నాను.

**అద్వైతమకరన్దస్య రసాభివ్యఞ్జికా కృతా ।**

**స్వయంప్రకాశయతినా పురుషోత్తమశాసనాత్ ॥ ౧ ॥**

అద్వైత మకరందమునకు 'రసాభివ్యంజిక'యను టీక శ్రీమ త్స్వయంప్రకాశయతిచే ఈశ్వరాజ్ఞచే వ్రాయబడినది.

**బ్రహ్మానన్దరసాస్వాదమిచ్ఛద్భిర్విబుధోత్తమైః ।**

**రసాభివ్యఞ్జికా హ్యేషా పరిశీల్యా సదాఽఽదరాత్॥ ౨ ॥**

బ్రహ్మానందరసమును ఆస్వాదించు ఇచ్ఛగల విద్యాంసులు ఈ 'రసాభివ్యంజిక' టీకను ఎల్లప్పుడు ఆదరపూర్వకముగా అనుశీలనము (మననము) చేయవలెను.

**తాపత్రయార్క సంతప్తా మోక్షకామా ముదా సహ ।**

**రసాభివ్యఞ్జికాం గఙ్గాం మగ్నా భవత సత్తమాః ॥ ౩ ॥**

ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములను తాపత్రయరూప సూర్యునిచే తపింపబడు ముముక్షువులు యీ 'రసాభివ్యంజిక' యను శీతలవాహినియగు గంగలో ఆనందముతో మునకలు వేయవలెను.

**వ్యాఖ్యాప్రణీతిచ్ఛలమప్రబుద్ధే**

**ర్మమాపరాధం విబుధాః క్షమన్తు ।**

**అమ్బార్ధదేహోభగవానతఃస్యా**

**ద్బాలాపరాధాత్పితృవత్ప్రసన్నః ॥ ౪ ॥**

ఈ అద్వైతమకరందమునకు వ్యాఖ్యానము చేయుటలో నాద్వారా యేమైన అపరాధములు దొరలినచో విద్వత్పురుషులు క్షమించగలరు. అట్లే, యెవరి అర్ధభాగమున పార్వతీమాత విరాజిల్లుచున్నదో, అట్టి భగవంతుడగు శంకరుడు, బాలకుని అపరాధములచే తండ్రివలె, ప్రసన్నుడగుగాక!

**శ్రీకైవల్యానన్దయోగీన్ద్రపాద**

**పద్మద్వన్ద్వే నిఃస్రవన్మోక్షసారే।**

**శుద్ధైర్హంసైః సేవితే సుప్రసన్నే**

**మచ్చేతోఽర్థీ భృఙ్గలీలాం విధత్తామ్ ॥ ౫ ॥**

శ్రీ కైవల్యానంద యోగీంద్రులవారి చరణయుగళము సువికసిత కమలములవలె ఉన్నవి.వాటినుండి మోక్షామృతసారము స్రవించుచున్నది. పరమశుద్ధ ముముక్షురూప హంసగణము ఆ మోక్షామృతరసమును సేవించుచున్నారు. అట్టి శ్రీగురుదేవుల చరణకమలములందు నా చిత్తము సమర్పితమై, తుమ్మెదలవలె ఆచరించుగాక.

**చిదమ్భోధిసంమగ్నచిత్త గుణానాం**

**సతామాలయం శుద్ధసత్త్వప్రధానమ్ ।**

**నృణాం బోధయన్తం పరబ్రహ్మతత్త్వం**

**శివానన్దయోగీన్ద్రమీడేసదాహమ్ ॥ ౬ ॥**

ఎవరి చిత్తము సమ్యక్ ప్రకారము చిత్సముద్రములో నిమగ్నమై ఉన్నదో,సాధుజనోచిత గుణములకు నిలయమో, విశుద్ధ సత్త్వగుణ ప్రధానమో,మరియు యెవరు సకలజీవుల కళ్యాణమును గోరి ఎల్లప్పుడు పరబ్రహ్మ తత్వమును బోధించువారో, అట్టి శ్రీ శివానంద యోగీంద్రులను నేను సర్వదా స్తుతింతును.

**సర్వజ్ఞచూడామణిమీశ్వరాణామీశానమిన్దీవరకోమలాఙ్గమ్**

**కారుణ్యలావణ్యసుధాసముద్రశ్రీజానకీజానిమహంభజామి॥ ౭ ॥**

ఎవరు సర్వ ఈశ్వరులలో శ్రేష్ఠుడో,కమలములవంటి కో-
మల శరీరముగలవాడో, కారుణ్యము మరియు లావణ్యరూప అమృతసముద్రుడో, శ్రీజానకీదేవి యెవరికి సతీమణియైనదో, అట్టి భగవంతుడగు శ్రీరామ చంద్రప్రభువును నేను భజింతును.

**మన్దస్మితానన్దితభక్తజాలంసౌన్దర్యసంతర్పితవామభాగమ్ ।**

**స్వానన్దసంతృప్తమమన్దహాసంసామ్బంభజేచన్ద్రకలావతంసమ్ ॥ ౮ ॥**

ఆశ్రిత భక్తజనులకు తన మందహాసముచే ఆహ్లాదమును ప్రసాదించువాడును,అతి సౌందర్యవంతుడును, యెవరు తన వామభాగమును పార్వతీదేవికి అంకితము చేసెనో, మస్తకము న నెలవంకను ధరించి,స్వానందముచే పరితృప్తుడై మందస్మిత ముఖవర్చస్సు గలవాడైయున్నాడో,అట్టి భగవంతుడగు శ్రీశం కరునికి నా ప్రణామములు.

*ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీకైవల్యానన్ద యోగీన్ద్ర పాదకమలభృఙ్గాయమాణ స్వయంప్రకాశాఖ్యయతి-విరచితా శ్రీలక్ష్మీధర కవికృతాద్వైతమకరన్ద రసాభివ్యఞ్జికా వ్యాఖ్యా సమాప్తా ॥*

**శ్రీ సద్గురు పాదుకాస్తవమ్**

శ్లో॥శ్రీ సమంచిత మవ్యయం పరమ ప్రకాశ మగోచరం
భేద వర్జిత మప్రమేయ మనన్త మాద్య మకల్మషం ।
నిర్మలం నిగమాన్త మద్వయ మప్రతర్క్య మబోధకం
ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥౧॥

శ్లో॥నాదబిన్దు కళాత్మకం దశనాద భేద వినోదకం

మంత్రరాజ విరాజితం నిజమండలాంతర భాసితం ।

పంచవర్ణ మఖండ మద్భుత మాదికారణ మచ్యుతం

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥౨॥

శ్లో॥వ్యోమ వద్బహిరన్తరస్థిత మక్షరం నిఖిలాత్మకం

కేవలం పరిశుద్ధ మేక మజన్మహి ప్రతి రూపకమ్ ।

బ్రహ్మతత్త్వ వినిశ్చయం నిరతాను మోక్ష సుబోధకం

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥3॥

శ్లో॥బుద్ధిరూప మబుద్ధికం త్రితయైక కూట నివాసినం

నిశ్చలం నిరత ప్రకాశక నిర్మలం నిజమూలకమ్ ।

పశ్చిమాన్తర ఖేలనం నిజశుద్ధ సంయమి గోచరం

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥౪॥

శ్లో॥హృద్గతం విమలం మనోజ్ఞ విభాసితం పరమాణుకం

నీల మధ్య సునీల సన్నిభ మాది బిన్దు నిజాం శుకమ్ ।

సూక్ష్మ కర్ణిక మధ్యమస్థిత విద్యుదాది విభాసితం

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥౫॥

శ్లో॥పంచ పంచ హృషీక దేహ మనశ్చతుష్క పరస్పరం

పంచభూత సకామ షట్క సమీర శబ్ద ముఖేతరమ్ ।

పంచ కోశ గుణత్రయాది సమస్త ధర్మ విలక్షణం

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥౬॥

శ్లో॥పంచ ముద్ర సులక్ష్య దర్శన భావమాత్ర నిరూపణం

విద్యుదాది ధగద్ధగిత్వ రుచిర్వినోద వివర్ధనమ్।

చిన్ముఖాన్తర వర్తినం విలసద్విలాస మమాయకం

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥౭॥

శ్లో॥పంచ వర్ణ రుచిర్విచిత్ర విశుద్ధ తత్త్వ విచారణం

చంద్ర సూర్య చిదగ్ని మండల మండితం ఘన చిన్మయం ।

చిత్కళా పరిపూర్ణ మంతర చిత్ సమాధి నిరీక్షణం

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥౮॥

శ్లో॥హంసచార మఖణ్డనాద మనేక వర్ణ మరూపకం

శబ్ద జాలమయం చరాచర జన్తు దేహ నివాసినమ్ ।

చక్రరాజ మనాహతోద్భవ మేక వర్ణ మతః పరం

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥౯॥

శ్లో॥జన్మకర్మ విలీన కారణ హేతుభూత మభూతకం

జన్మకర్మ నివారకం రుచి పూరకం భవతారకం।

నామరూప వివర్జితం నిజ నాయకం శుభదాయకం

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥౧౦॥

శ్లో॥తప్తకాంచన దీప్యమాన మహాణు మాత్ర మరూపకం

చన్ద్రికాన్తర తారకైరవ ముజ్జ్వలం పరమాస్పదమ్।

నీల నీరద మధ్యమస్థిత విద్యుదాది విభాసితం

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥౧౧॥

శ్లో॥స్థూల సూక్ష్మ సకారణాన్తర ఖేలనం పరిపాలనం

విశ్వతైజస ప్రాజ్ఞచేతస మన్తరాత్మ నిజాంశుకమ్ ।

సర్వకారణ మీశ్వరం నిటలాన్తరాళ విహారకమ్

ప్రాతరేవహి మానసాంతర్భావయేత్ గురుపాదుకాం ॥౧౨॥

*ఇతి శ్రీ ఆద్యజగద్గురు శఙ్కరాచార్య విరచితం శ్రీ సద్గురు పాదుకాస్తవం సంపూర్ణమ్*



## అద్వైత పఞ్చరత్నమ్

నాహం దేహో నేన్ద్రియాణ్యన్తరఙ్గో, నాహఙ్కారః ప్రాణవర్గో న బుద్ధిః ।
దారాపత్యక్షేత్రవిత్తాదిదూరః, సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహమ్ ॥౧॥
రజ్జ్వజ్ఞానాద్భాతి రజ్జౌ యథాహిః, స్వాత్మాజ్ఞానాదాత్మనో జీవభావః ।
ఆప్తోక్త్యాఽహిభ్రాన్తినాశే స రజ్జుర్జీవోనాహందేశికోక్త్యాశివోఽహమ్ ॥౨॥
ఆభాతీదం విశ్వమాత్మన్యసత్యం, సత్యజ్ఞానానన్దరూపే విమోహాత్ ।
నిద్రామోహాత్స్వప్నవత్తన్నసత్యం,శుద్ధఃపూర్ణోనిత్యఏకఃశివోఽహమ్ ॥3॥
నాహం జాతో న ప్రవృద్ధో న నష్టో, దేహస్యోక్తాః ప్రాకృతాః సర్వధర్మాః ।
కర్తృత్వాదిశ్చిన్మయస్యాస్తినాహఙ్కారస్యైవహ్యాత్మనోమేశివోఽహమ్॥౪॥
మత్తోనాన్యత్కిఞ్చిదత్రాస్తివిశ్వం, సత్యంబాహ్యం వస్తు మాయోపక్లృప్తమ్ ।
ఆదర్శాన్తర్భాసమానస్యతుల్యం,మయ్యద్వైతేభాతితస్మాచ్ఛివోఽహమ్॥౫॥

॥ ఇతి శ్రీ పూజ్యపాద ఆద్య శంకరాచార్య విరచిత అద్వైత పఞ్చరత్నమ్ ॥

---

## మహ్యామేవ నమో నమః

సర్వభావాన్తరస్థాయ చైత్యముక్తచిదాత్మనే ।
ప్రత్యక్చైతన్యరూపాయ మహ్యామేవ నమో నమః ॥
(సంన్యాసోపనిషత్ ౨-౨౫; వరాహోపనిషత్. ౨-33)

త్వం వాఽహమస్మి భగవో దేవ తేఽహం వై త్వమసి ।
తుభ్యం మహ్యమనన్తాయ మహ్యం తుభ్యం చిదాత్మనే ॥
నమో మహ్యం పరేశాయ నమస్తుభ్యం శివాయ చ ।
కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిమ్ ॥
(వరాహోపనిషత్. ౨-3౪&3౫)

ఏకస్మై కృతకృత్యాయ నిత్యాయ విమలాత్మనే ।

నిర్వికల్పచిదాఖ్యాయ మహ్యామేవ నమో నమః ॥

న శోకోఽస్తి న మోహోఽస్తి నచైవాహమహం స్వయమ్ ।

న చ నాహం నచాన్యోఽహం మహ్యామేవ నమో నమః ॥

న మమాశా న కర్మాణి న సంసారో న కర్తృతా ।

న భోక్తృతా న దేహో మే మహ్యామేవ నమో నమః ॥

నాహమాత్మా న వా కోఽన్యో నాహమస్మి నచేతరః ।

సర్వమేవాహమేతస్మై మహ్యామేవ నమో నమః ॥

అహమాదిరహం ధాతా చిదహం భువనాన్యహమ్ ।

మమ నాస్తి వ్యవచ్ఛేదో మహ్యామేవ నమో నమః

నిర్వికారాయ నిత్యాయ నిరంశాయ మహాత్మనే ।

సర్వస్మై సర్వకాలాయ మహ్యామేవ నమో నమః ॥

నీరూపాయ నిరాఖ్యాయ ప్రకాశాయ మహాత్మనే ।

స్వయమాత్మైకసంస్థాయ మహ్యామేవ నమో నమః ॥

సమాం సర్వగతాం సూక్ష్మాం జగదేకప్రకాశినీమ్ ।

సత్తాముపగతోఽస్మ్యన్తర్మహ్యామేవ నమో నమః ॥

సాద్ర్యబ్ధ్యుర్వీ నదీ సేయం నాహమేవాహమేవ వా ।

జగత్సర్వం పదార్థాఖ్యం మహ్యామేవ నమో నమః ॥

(శ్రీ యోగవాసిష్ఠము-ఉపశమ ప్రకరణము.౮౦-౪౦ నుండి ౪౮)

ఇదం సత్యమిదం సత్యం సత్యమేతదిహోచ్యతే ।

అహం సత్యం పరం బ్రహ్మ మత్తః కిఞ్చిన్న విద్యతే ॥

(వరాహోపనిషత్.౨-౩౮)



## పరిశిష్టము ౨

## ఉధృత ప్రమాణముల పట్టిక

## అద్వైత మకరన్దము-భూమికలో

## -: గ్రంథములో ఉధృత ప్రమాణములు :-

